ప్రథమాంకమున సీతాస్వయంవరమంటపమున సమావిష్టులైన హరశరాస నారోపాఽసమర్థులగు రాజకుమారులను మంజీరకు డిట్లు దెప్పిపొడుచును

"పశ్య పశ్య సుభటైః స్ఫుటభావం, భక్తిరేవ గమితా నతు శక్తిః,
అఞ్జలి ర్విరచితో నతు ముష్టి, ర్మౌలిరేవ నమితో నతు చాపః" (I-55)

దీని యనువాదము తెలుగులో నిట్లున్నది

ఉ భావము పల్లవింపఁ గడు భక్తియ చూపిరి శక్తి లేదు సం
భావనఁ జేసి రజ్జనులు పాణి ఘటింపరు ముష్టిముద్ర యి
స్సీ వదనంబు వంచి రిదె సిగ్గరి భర్గుని విల్లు వంప రీ
భూవరసూను లెల్ల మగపుట్టునఁ బుట్టరె ప్రోలు ముట్టరే (I-౨౦౬)

పై పద్యము చతుర్థపాదమందలి భావము మూలాతిశాయి

ఈ సందర్భముననే నేపథ్యమునుండి వినవచ్చు రావణుని కర్కశభాషణము లను విని నూపురకుడు మంజీరకునితో "వయస్య కస్యాయం మహీతలచలద్రాహు రథచక్రరవకర్కశః కణ్ఠధ్వనిః శ్రూయతే" యనును (I-59) దీని యనువాద మెంత స్వతంత్రముగా నడచినదో గమనింపుడు

క అచ్చెరుపడి నూపురకుఁడు
నెచ్చెలి! గుండ్రాలకొండ నెత్రపుఁ ద్రోవ౯
వచ్చు పెనుబండి మ్రోతకు
నెచ్చగు నీ కంఠరావ మెవ్వనియదియో (I-౨౧౨)

చిత్రపటమును దెచ్చు చెలికత్తె పేరు మూలమున (I-71) చందనికయని యుండ తెలుగులో (I-౨౩౬) మందారకళిక యైనది

నూపురకు డమంగళము లాడగా రావణుడు కుపితుడయ్యును వానిం జంపక "తదేష కేవలం వైతాళిక ఇత్యుపేక్షః" అనును(I-92). దీని యనువాదము తనివి తీరక కవి యీరీతిగా పెంచినాడు

క తిట్టిన దీవించిన రా
కొట్టినఁ జలపట్టినను దగుం దగదనిన౯
భట్టు బహుమానయోగ్యుఁడు
గట్టిగ నని వంది నిన్ను గాచితిఁ జుమ్మీ" (I-౨౬౬)

బాణరావణులసంవాదమున బాణుడు రావణుని "సోఽయ మశక్తిప్రకారః" యని దెప్పిపొడిచిన మాట తెలుగులో నొక కందపద్యమై కూర్చున్నది(I-౨౯౧).

ద్వితీయాంకప్రారంభమున "తతః ప్రవిశతి తాపసః" యను సూచనము తెలుగులో నొక సీసపద్యముగా పెరిగినది(II-౧). ఈ సీసపద్యము ఎత్తుగీతి చివరి పాదము "వచ్చెఁ దాపసుఁ డాతరువాత నొకడు" అనునదే కావలసిన యనువాదము తక్కిన తాపసివర్ణన మంతయు మూలాతిశాయియే భిక్షుకతాపసులసంవాదమున గల(II-౩౫) పద్యము మూలాతిశాయి మరియు నమూలకము. ఒకవేళ మన కవినాటి సంస్కృతప్రతులందీ యధికపాఠ ముండిన నుండియుండును

సీత రాకకు పూర్వము ఉపవనమున రామలక్ష్మణులు చండికాయతనమును చూచినప్పుడు మూలమున గల శ్రీరామోక్తములగు "కథ మిద మిత శ్చణ్డికాయతనమ్" అను చిన్న గద్యమును,

"మాతః కరుణతరఙ్గిణి వికసన్నయనామృతోర్మిశీకరిణి
తరుణతుహినకరచూడామణిరమణి త్వాం నమస్యామి" (II-41)

అను చిన్న శ్లోకమును తెలుగులో ఒకసీసము, ఒకవచనము, ఒకశార్దూలము, మరియొక గీతముగా నవతరించినవి(II-50,51,52,53) వీనిలో చివరి గీతపద్యము సీతావివాహమను భావ్యర్థమును సూచించు నాటకీయవ్యంగ్య మైనది

గీ సింధుకోటీరదేహార్ధసింహపీఠి
నిందు కొలువుండు నీకు నెవ్వండు మ్రొక్కు
వాని *కవనిజయగులక్ష్మి* వచ్చు పొదవు
సంతతానందసామ్రాజ్యజనక మగుచు (II-౫౩)

ఈ యుపవనమునందే శ్రీరామచంద్రుని జూచి సీతాదేవి తుమ్మెద నుద్దేశించి యన్యాపదేశముగా చదువు పద్యము(II-౧౫౬) మూలాతిశాయి మరియు నమూలకము

చతుర్థాంకమున విజితుడగు భార్గవరాముడు శ్రీరామచంద్రు నిట్లు స్తుతించును.

"అపూరణాయ పురవైరిశరాసనస్య
బాణాత్మనా పరిణతః కిల లీలయా యః,
ఆరోపణాయ పునరస్య సఏవ శఙ్కే
బాలాత్మనా పరిణతః పురుషః పురాణః" (IV-87)

దీని భావ మంతయు పుణికిపుచ్చుకొని శ్రీరామచంద్రునికి మరికొంత వన్నెయు వాసియు కూర్చినది దీని తెలుగు సేత(IV-౧౧౨)

పంచమాంకమున హంసము గంగాదినదులకు శ్రీరామాదుల వనగమన వృత్తాంతము చెప్పుపట్ల వారి మార్గమున మూలమున లేని చెంచుపల్లి తెలుగు

సేతలో(V-౬౫) వచ్చి చేరినది. జనస్థానమందలి రాక్షసులను వర్ణించునప్పుడు (V-౯౯), వారు "వాహరథనాగభటోత్కటు" లనుట కూడ మూలాతిశాయి ఈ యంకమందే కాళింది "కా పున రియం సూచిశలాకావిద్ధాని మమ నఖా న్యలక్తక రసేన సిఞ్చతి"(V-168) యను మాటను "ఎవ్వరొకో తూలెడు తన మెయి శీతసుధాలవనవదృష్టిచేతఁ దడిపెడువారల్" (V-౧౫౦) అని మార్చుట మిక్కిలి యుచితమైన యనువాదము

షష్ఠాంకమున సీతావిరహముననున్న శ్రీరామచంద్రుడు తన పూర్వపు మధురస్మృతుల నిట్లు తలపోయును

"తాన్యేవ పక్ష్మలదృశో వచనామృతాని
భూయోఽపి కర్ణచుళకై రహ మాపిబేయమ్
యై ర్మామ మదర్శయ దసౌ వికసత్ప్రమోదా
గోదావరీకమలవీచివిచేష్టితాని" (VI-28)

దీని యనువాదమున(VI-౩౪) నాల్గపపాదమున మూలాతిశాయిగా చేరిన "రాచిలుక మాడ్కిం బల్మరుం బల్కుఁగఁ" అను ఉపమానము జయదేవకవిభావమునకు మెరుగులు దిద్దినట్లున్నది ఈ యంకమందే లంకావాసుల నుద్దేశించి నేపథ్యము నుండి వినబడు,

"తత్సమ్ముఖం ప్రచలితః స్వయమక్షనామా
నన్వేష రాక్షసపతేః కుపితః కుమారః" (VI-51)

అను ఉత్తరార్ధశ్లోకమునకు, (VI-౫౭)పద్యపు ఎత్తుగీతిలో గల "దోర్మండలాగ్ర చండరుచికాండహిండితాఖండదిగధిపాలఖేలత్ప్రతాపవాతూలసఖుఁడు, రణకళా దక్షుఁ డయ్యక్షరాక్షసుండు" అను భాగ మంతయు మూలమును మించిన అక్ష కుమారప్రశంస ఇదే యంకమందలి ౧౧౯వ పద్యము కొలది మూలమును గొప్పగా పొడిగించిన యచ్చతెనుగు కబ్బపు మచ్చుతునక

సప్తమాంకమున సీత చంద్రోదయము నిట్లు వర్ణించును
"ముకుళీకృతారవిన్దో మానవతీమానవారణమృగేన్ద్రః
త్రిభువన నయనానన్దో, రజనీముఖ చన్దన శ్చన్ద్రః." (VII-142)

దీని యాంధ్రీకరణ మిట్లున్నది.

గీ. కమలముల తూఁగుమందు లోకముల విందు
మానినీమానమత్తసామజగజారి

తామసీముఖచంద్రచందనము చంద్రుఁ
డింద్రపథమునఁ జంద్రికాసాంద్రుఁ డయ్యె. (VII-౧౭౫)

ఈపద్యమున "కమలముల తూఁగుమందు" వంటి స్వతంత్రానువాదమేకాక మూల మందలి యనౌచిత్యమును పరిహరించుటకై "మానవతీమానవారణమహేన్ద్రః" అనుదానిని "మానినీమానమత్తసామజ గజారి" యని మార్చుట ఎంతయు సమంజసముగా నున్నది మూలమున 'మృగేన్ద్రః' అనుటకు మారుగా "మహేన్ద్రః" అని అచ్చు పొరపాటు దొరలిన దనుకొందమన్న దీని ప్రాకృతచ్ఛాయయు నిట్లే యున్నది ఇది సంస్కృతప్రతులు వ్రాసిన వ్రాయసకాండ్ర పొరపాటో యేమో ! పరిష్కర్తలు కూడ దీనిని గమనించినట్లు లేదు

సంస్కృతప్రతి పూర్వోక్తమహారాష్ట్రపండితు లిర్వురును ఏడు సంస్కృతప్రతు లాధారముగా ప్రసన్నరాఘవమును పరిష్కరించి ప్రకటించినారు (1894) వారుపయోగించిన ఏడు ప్రతులలో A B అనునవి ప్రాచీనప్రతులు ఈ యేడు ప్రతులందు సమంజసములని తోచినవానిని గ్రంథమున చేర్చి తక్కిన పాఠాంతరములను అడుగున పేర్కొన్నారు వారిచ్చిన A B ప్రతులలోని పాఠాంతరములకును తెలుగు ప్రసన్నరాఘవనాట్యప్రబంధమందలి పాఠములకును పెక్కుచోట్ల సరిపోవుచున్నవి అనగా పరిష్కర్తలకు ప్రాచీనప్రతులుగా లభించిన A B వంటి ప్రతులే ఆనాడు తెలుగుదేశమున ప్రచారమం దుండెనని భావింప వలయును ఈ పండితులు సంస్కృతనాటకమును పరిష్కరించునప్పుడు చేసిన కొన్ని పొరపాటులను ప్రసన్నరాఘవనాట్యప్రబంధముద్వారా సవరింపవచ్చును 'మృగేన్ద్రః' అనుటకు మారుగా 'మహేన్ద్రః' అనుటయు, జయదేవుడు పదునారవ శతాబ్దమువా డనుటయువంటి పొరపాటు లిదివరకే యుట్టంకించితిని

సారూప్యవైరూప్యములు నే నుపయోగించుకొన్న సంస్కృతప్రతి కిని మన ప్రసన్నరాఘవనాట్యప్రబంధమునకును కొన్నిచోట్ల వ్యత్యాసము లున్నవి. అట్టివానిని కొన్నింటి నుదాహరింతును ద్వితీయాంకమున సఖి సీతాదేవితో "అహో తే చాతుర్యం యత ఆరామప్రకటనేనై వాకారగుప్తిం కృతవత్యసి" (II-8౫) యన్న మాటలో 'ఆరామ' పదమునకు బదులుగా Dప్రతిలో 'ఆకార' యను పద మున్నట్లు అధోజ్ఞాపికలో సూచితము. ఆంధ్రీకరణమున నీ పాఠమే గృహీతము (II-౧౪౬) ఈ యంకమందే ౧౫౬నుండి ౧౫౯వరకు గల గద్యపద్యములు

మూలమున క్రమము తప్పినవి ప్రసన్నరాఘవనాట్యప్రబంధమందున్న క్రమమే సరియైనది

తృతీయాంకమున ౧౪౮,౧౪౯ పద్యములు మూలమున విశ్వామిత్రోక్తములు (III-139) కాని మన యాంధ్రీకరణమునం దున్నట్లు కంచుకి నోట వెలువడుటే యుచితము

పంచమాంకమున ౫౯వపద్యము తరువాత మూలమున సరయూక్తమగు,

"రామే ప్రాప్తే వనాన్తే కథమపి భరత శ్చేతనాం ప్రాప్య తాతం
నీత్వా దేవేంద్రలోకం మునిజనవచనా దూర్ధ్వదేహక్రియాభిః
భ్రాతుః శోకాభిత ప్తః స్వజనపరివృతః పాలయామాస నన్ది
గ్రామే తిష్ఠ న్నయోధ్యాం రఘుపతి పునరాగామిభోగాయ వీరః" (V-71)

అను శ్లోకమును, యమునానది పల్కు "తత స్తతః" (V-72) అను మాటయును అనువాదమున రాలేదు ఇవి మన కవినాటి పాఠమున లేవో లేదా యనువదించక విడిచినాడో లేక వ్రాయసకాడే విడిచిపెట్టినాడో తెలియదు (V-౧౧౯)వ పద్యము గంగాముఖోద్గతము. కాని మూలమున గంగాయమునాసరయువులు మూడును కలిసి యన్నట్లున్నది.

షష్ఠాంకమందలి ౫౬వ మత్తకోకిలలోని యుత్తరార్ధము మూలమున గ్రంథ భాగమున లేదు C E. ప్రతులలోనున్న యధికపాఠమని అధోజ్ఞాపికలో దాని ప్రాకృతచ్ఛాయ నుట్టంకించినారు కాని యది గ్రంథభాగముననుండుటే సమంజసము

రామరావణయుద్ధమును విద్యాధరుడు విద్యాధరికి వర్ణించి చెప్పుపట్ల గల

"రణే ముక్తప్రాణా రజనిచరవీరా దినమణిం
విశ న్తః శోభ న్తే కమల మివ సాయం మధులిహః,
అధా మీభి ర్భిన్నం గగన నవకుఞ్జోదరదరీ
మయచ్ఛత్రచ్ఛాయా మనుభవతి బిమ్బం దినకృతః." (VII-75)

అను శ్లోకమున 'నవ' యనుటకు 'వన' యనియును, 'మయ' యనుటకు 'మధు' అనియును, పాఠాంతరము లున్నట్లు పరిష్కర్తలు అధోజ్ఞాపికలం దిచ్చిరేకాని మూలములోనికి తీసికొన లేదు అందుచే నీ శ్లోకము స్వారస్యము కొంత చెడినది చినతిమ్మయమంత్రి మాత్రము 'వన' 'మధు' పాఠములతో నాంధ్రీకరించి అలంకార మును పోషించి యౌచిత్యమును పెంచినాడు(VII-౭౦) ఈ సందర్భమందే యున్న.

విద్యాధరః  స ఏష రామసమరకౌతుకీ దశకణ్ఠః.

విద్యాధరీ  కః పున రేషో ఒఞ్జనపుఞ్జచ్ఛవిశరీరః కపివీర స్తస్యసంముఖం పరావర్తతే

విద్యాధరః  ప్రియే స ఏష విచిత్రసమరశీలో నీలః

అను సంభాషణములు, (VII-౧౧)పద్యము తరువాత రావలసియుండెను ఈ సంభాషణముల నాంధ్రీకర్తయే విడిచెనో వ్రాయసకాడే విడిచెనో తెలియదు

౧౫౭వ పద్యము శ్రీరామోక్తము మూలమున నిది విభీషణోక్తము కాని అత్యంతప్రాచీనప్రతియగు A లో నిది శ్రీరామోక్తముగా నున్నట్లు పరిష్కర్త లథోజ్ఞాపికలో నుట్టంకించినారు

ఈ యంకమందే ౨౧౬వ పద్యము తరువాత నుండవలసిన సీతాదేవి వాక్కులు,

సీతా (విహస్య విలోక్యచ) కథ మయ మున్మీలిత ఏవ
"పూర్వగిరిపద్మరాగః ప్రకటీకృతనయశీతలస్వభావః,
కుఙ్కుమకృతాఙ్గరాగో నలినీవనవల్లభోదేవః" (VII-169)

అనూదితములే కాలేదు

అయోధ్యానగరమును ప్రవేశించునప్పుడు శ్రీరాముడు సూర్యభగవానునకు నమస్కరించి యిట్లు స్తుతించును

"ప్రాచీముఖైకతిలక, పూర్వాచలశేఖరైకమాణిక్యమ్,
త్రిభువనగృహైకదీపం, వన్దే లోకైకలోచనం దేవమ్" (VII-174)

అధోజ్ఞాపికలో 'ముఖైక'కు బదులుగా 'కుఙ్కుమ'యును, 'శేఖర'కు బదులుగా 'రోహణ'యును, "వన్దే లోకైకలోచనం దేవమ్" అనుటకు బదులు "వన్దేహం కమలినీనాథమ్" అనియును, A B వంటి ప్రాచీనప్రతుల పాఠము లిచ్చినారు ఈ ప్రాతప్రతుల పాఠములే చినతిమ్మయనాడు తెలుగుదేశమున ప్రచారమున నుండెను కాబోలు(VII-౨౪౭)

ఇట్టి విశేషము లింకను ఈ రెండుప్రతులను పోల్చినచో తెలియగలవు

చినతిమ్మయ కృతార్థత : ప్రసన్నరాఘవము నాంధ్రీకరించుటలో బొడ్డుచెర్ల చినతిమ్మయ ఎంతవరకు కృతకృత్యుడయ్యెనో పరిష్కర్తనగు నాకు చెప్పుట కష్టమే పీయూషవర్షుడని ప్రఖ్యాతినందిన జయదేవకవివాణి యనితర

సాధ్యము చినతిమ్మయమంత్రి శక్తివంచనలేక దానిని తెలుగువారి కందింప ప్రయత్నించినాడు కొన్నిచోట్ల కృతకృత్యుడైనాడు, మరికొన్నిచోట్ల కాలేదు. భాషాంతరీకరణ మెన్నటికిని భాషాంతరీకరణమే. అందును సిద్ధవాక్కులును వశ్యవాక్కులును నగు మహాకవుల కృతు లనువదించుట యసిధారావ్రతము చిన తిమ్మయ మిక్కిలి శ్రమపడి వీలైనంతవరకు మూలమందలి సౌందర్యమును తెలుగులోనికి తెచ్చుటకై ప్రయత్నించినాడు వీలైనంతవరకు శ్లేషచమత్కారము లను గూడ చేజారనీయలేదు ఆతడు పడిన శ్రమ కుదాహరణ మొక్కటి మాత్రము చూపింతును

రావణుడు కపిబలము నుద్దేశించి మందోదరితో నిట్లనును

"ఇయం లీలాలోలాఙ్గదభుజలతా నీలచికురా
సమున్మీలత్తారా కుముదహసితా చారునయనా
ప్లవఙ్గానాం సేనా యువతిరివ తారాపతిముఖీ
మమాగ్రే కన్దర్పం ప్రకటయితు మద్య ప్రభవతి" (VII-58)

రావణుడు కపిబలము నబలగా శ్లేషించి వెక్కిరించు పద్య మిది ఇందులోని 'కన్దర్ప' శబ్దమున గల స్వారస్యము చెడకుండ చినతిమ్మయమంత్రి దీని నిట్లనువదించినాడు

గీ లాలితాంగదభుజలత, నీలచికుర,
చారునయన, సముజ్వలత్తార కుముద
హాస, తారేశవదన : వనాటసేన
యబల, నా మ్రోల మారుమాటాడ గలదె (VII-౫౮)

సంస్కృతమందలి 'కందర్ప' శబ్దము తెలుగులో 'మారుమాట'గా ననూదితమై శ్లేషచమత్కారమును ఔచిత్యమును పోషించుకొన్నది బొడ్డుచెర్ల చినతిమ్మయ కృతార్థుడు

పదములు . ప్రసన్నరాఘవనాట్యప్రబంధమును పరిష్కరించునప్పుడు అచ్చటచ్చట ఎదురుపడిన మాట లర్థముకాక శబ్దరత్నాకరమును సంప్రదించితిని అప్పుడు కొన్ని శబ్దము లానిఘంటువులో కనబడ లేదు. మరికొన్ని శబ్దముల కర్థము లున్నను ప్రయోగములు లేవు. ఆయా శబ్దము లన్నింటిని ప్రయోగము లతో నాచెంతగల శబ్దరత్నాకరమున అటనట చేర్చితిని అట్టివానిలో కొన్నింటి నుదాహరింతును.

1 అరము క్రి. విశే. త్వరితము. విశే వడిగలది.
"అడలనేటికి సీతాభిహరణబుద్ధి
నరము నీ రక్కసుని బల్మి నాగ నిచట" (I–౨౬౫)
"నిరుపమానందబాష్పశీకరము లరమి" (I–౪౨)

2 ఆలస్యము సం వి అ న. సోమరితనము జాగు విశే సోమరి
"ఆలస్యముబలె నంటితినో లేదో పెలుచనై..." (IV–౫౬)

3 ఆలేరు "ఆలేరనఁ దనరు లోచనానందంబై." (VII–౨౨౯)
ఇది శబ్దరత్నాకరమున లేదు ఇది 'ఆలకాపరి'వలె ఆవుల+ఏరు 'ఆలే' రగునో మరింకేదేని పదమగునో నా కర్థము కాలేదు

4 ఇలుకు దే వి కీళ్ళ నరము బెడఁకుట.
"ఇదియు నొక కానిపని యిపు, డెదిరించెనె యిలుకు మీదనే
సోఁకిడి..." (I–౨౮౦)

5. ఈరిమి. ఈ పదము శ ర.లో లేదు
"ఎత్తిన మూర్ఛ సీత చెలు లీరిమి గొల్పినఁ దేరదయ్యె" (V–౩౨)

6 ఉత్తరాసి దే వి తలుపు క్రింద తిరిగెడు కుబుసము
"ఈ నా యంగము లెంతయుం బొడవులై యిట్లున్కిమై ద్రిమ్మరం
గా నీ ద్వారము నుత్తరాసి విరుగుంగా మస్తకాఘాతమై" (III–3)
కవి యిట నాసా (=ద్వారశిఖర)మను నర్థమున ప్రయోగించినాడు ఈ యర్థము శ ర లో లేదు. బ్రౌణ్యములో కలదు.

7. కన్నడువు కన్నడ (దే వి ఆలము ఉపేక్ష) రూపమే శ ర లో కలదు గాని కన్నడువు రూపము లేదు
"ఓ జగదేకవిక్రమ యయో నను గన్నడు వేల సేసెదం" (V–౧౩౫)

8 కాశె వై.వి. కాశియ కాహళిక
"కాశె వట్టిన కవి నోరు కాశె వట్టు" (II–౮౦)

9 కిమ్ము. శ. ర లో లేదు
"కిమ్ములఁ బూతవూ వలుకు కెంపుల కన్నులు" (V–౧౧౦)

10. కూర్ప. మోచేయి కూర్పరము శ.ర.లో కలదు గాని 'కూర్ప' యను రూపములేదు.

"కూర్పు గకపాలవాఁడు చే కుండివాఁడు" (II-౧)

కుండి శబ్దమునకు గూడ ఇందే ప్రయోగము లభ్యము.

11. *ఖజూరిక* సం వి. ఆ సాముకూటము గరిడీ విఘంటువు లన్నియు నీ యర్థమునే యిచ్చుచున్నవి కాని ఈ గ్రంథమున నిది దొన్నె యను నర్థమున ప్రయుక్తము.

"లలితకువలసుమపలాశఖజూరికా" (II-౧౬౬)

12 *గిడుగు* దే వి కామలేని గొడుగు

"గిడుగు చందమున లంకించు మూపులమీఁద" (II-౧)

13 *గీమాడు* శ ర లో లేదు

"గీమాడు చెక్కుల కిలకిలలకు" (II-౧౩౨)

14 *గుంటికోవి* శ ర లో లేదు పెట్లదిమ్మెయని బ్రౌణ్యము.

"చెందొరపు గుంటికోవుల గుదుల్ గనఁ గ్రొత్తగు కొత్తలంబులన్" (VII-౨౨౫)

ఇందులోని కొత్తల మను మాట గూడ శ ర లో లేదు

15 *చెంగనాడు* శ ర లో లేదు

"చెంగనాడకు మమ్మ నీ చెలుల నెల్ల" (II-౧౩౯)

16 *తిరియు* దే స క్రి భిక్షించు కాని యీ కావ్యమున వేరొక యర్థమున ప్రయుక్తమైనట్లు తోచును

"శ్రీమీరఁ గటిసూత్రదామంబు తిరియంగ
ముడిగొన్న యినుపకచ్చడమువాఁడు" (II-౧)

17 *తివ్వం* శ ర.లో లేదు. తీఁగ.

"ఎవ్వాడును హరచాపపుఁ దివ్వం దివలేదె యనిన..." (I-౨౮౫)

18 *తూఁ(ము)* దూది

"వెనుకటి గౌరవము దూలవిధమై తూలున్" (I-౩౦౬)

19 *తొకుదొకులాడు* శ ర లో లేదు

"తోతేరక యనుడు నవ్వు తొకుదొకులాడఁ." (I-౨౮౭)

20 *త్రేణి* శ ర తద్భవదేశ్యముల యనుబంధమున దీనికి "వెదకు"అను నర్థ మిచ్చి ఆముక్తమాల్యద (VI-66) ప్రయోగ మిచ్చినారు కాని ఈ గ్రంథ ప్రయోగమునకు పై యర్థము సరిపడుటలేదు

"చంద్రోపమానుఁడై జలరాశితటమున
ద్రేణి యుండిన పూర్ణతేజుఁ డనవు" (VII-౩౬)

ఇచ్చట 'అధిశయించిన' అను నర్థమున ప్రయుక్తమైనదీ శబ్దము మూల మున 'నధిశేతే'యని కలదు (VII-33)

21. దారగిలు శ ర లో లేదు
"దనుజుఁడు తన చెవుల కవలు దారగిలంగ" (I-౩౨౨)

22 నాలి మందము
"క్రొత్తవిలాస మేరుపడఁ గ్రోలుచుఁ దేఁటులు నాలిగాలిచే" (II-౪౩)

23 పట్టీయము పై వి పెద్దకత్తి.
"పట్టి యొరపుట్ట వెడలు నా పట్టియంపు." (VI-౭౧)

24 పదువ ఈ రూపము శ ర లో లేదు (పదువు=దే వి సజాతీయప్రాణి సమూహ మని కలదు)
"పచ్చదనం బలఁతి చిలుక పదువలచేతన్" (II-౨)

25 పినుఁగు. ఆ విణ లుబ్ధుఁడు
"పినుఁగుం గోమటు లప్పురమున" (VII-౨౩౭)

26 పొవడు. దే స క్రి వి పొగడుయొక్క రూపాంతరము.
"పొవడఁగ నేన్నృపాలకులపుంగవుకీర్తులు ద్రొక్కు దిక్కులన్"
(III-౯౪)

27 బవరి· దే విణ. గుండ్రము. శ ర లో "బవరి యని యకారమధ్యముగా కొన్ని గ్రంథములయందు రూపము కానఁబడుచుండినను రూపాంతరము బవ్రియని కనఁబడుటచే బవిరి యను రూపమే సాధువని తోఁచెడి" యని కలదు.
"పగిది చెడకుండ నొయ్యన బవరిపరచె" (IV-౧౦౬)

28. బేరము: సం. అ న ప్రతిమ
"కనకోత్సవబేరంబులు." (II-౭౧)
బంగారు ఉత్సవవిగ్రహములని యర్థము.

29. మర· దే వి కీలు తిరుగుడు నొక్కు
"మరలేని పసిఁడి తామరపువ్వు మరపించు
కలికి ముద్దుమొగంబు కలకలలకు." (II-౧౩౨)
ఇట పై యర్థము పొసగునో లేదో తెలియదు

30 మిట్ట తీక్ష్ణము
"ఏయు మిట్టకోల నేపరి మారీచు" (II-౩౧)

31 ముయ్యంచు మూడు మూలలు గది.
"చంచలాలోక చూచు ముయ్యంచుఁ జూపు" (II-౧౬౦)

32 మేవు శ.ర లో నిట ప్రయుక్తమైన యర్థము లేదు
"మేవించెదఁ జెలిమి కాన మేరు సునాభీ" (I-౩౦౯)

33 మొనకట్టు ఒకానొక స్తంభనమూలిక
"మొనకట్టున మతికృపాణి మొగ తిరిగెఁగదా" (I-౨౨౯)
పై యర్థ మిట పొసగునో లేదో తెలియదు

34 యంత్రవరుడు శ ర లో లేదు
"కనకధరాధినాయకుఁడు కన్నుల కెంపు వహించెనేని రా
జనక చమూవిభుండనక యంత్రవరుండన కాజిఁదూలు" (I-౩౫)
బ్రౌణ్యములో యంత్రకారు డనగా పిరంగులు పేల్చువాడని కలదు యంత్ర
వరుండన యంత్రకారుడు కావచ్చును

35. లావణి దే వి పసులు మేసెడు బీటినేలకై ముందుగా నిచ్చెడు ధనము.
"లలితనిజప్రతాపరవులన్ వరదక్షితినాథుఁ డెల్లెడన్
గలయగ నించి గంచుటురిగన్ దగ లావణివైచి పోవనీ
కలమె బలంబులంచు ..." (I-౨౩)
పై యర్థ మిట పొసగునో లేదో.

36 లివ . శ ర లో లేదు. ధ్వనియని యర్థము.
"లే ముద్దుం గులుకు రవల లివలం బోలెన్." (VII-౫౨)

37 లెప్పము శ ర లో ఈ రూపము లేదు.
"మ, దృలవదభంగతుంగభుజదర్పము లెప్పము సేయనేర్చునే"
(IV-౯౮)
లెక్క సేయనేర్చునే యని యర్థము

38 వేల్మి ఈ రూపాంతరము శ ర లో లేదు హోమము.
"వినికియు నక్షమాలికయు వేల్మియుఁ దాల్మియు దండకుండికల్"
(IV-౮౪)

39. సవరము . వై. వి. చమరమృగము తోఁక.

"తిన్నని సవరాల గాలివలనఁ" (III-౧౧౮)

40 సెలగోరు శ ర లో లేదు

"సెలయున్ సెలగోరు వాఁడి చేకత్తి మొనఁ" (I-౪౬)

41 సోఁకిడి శ ర లో లేదు

"ఎదిరించెనె యిలుకు మీఁదనే సోఁకిడి..." (I-౨౮౦)

ఇట్టి పదము లింకను అనేకము గలవు కంచుటురిగ (I-౨౩), గొంటకట్టి, తెరపాము (I-౫౮), తురుముగోడెలు (II-౬౫) గిర్బున (III-౯), విపాట (IV-౨౭), నరిపంక్తులు (VII-౨౨౫) వంటి మాటలు నా కర్థము కాలేదు ఈనాడు సరళాదిగానున్న పదములు పూర్వము పరుషాదిగా నుండెడివి కాబోలు. 'గొనబు' అనుటకు 'కొనబు' అనియు, 'దిద్దు' అనుటకు 'తిద్దు' అనియు, 'బెబ్బులి' యనుటకు 'పెబ్బులి' యనియు పరుషాదిప్రయోగములే ప్రసన్నరాఘవనాట్యప్రబంధ మున గలవు సప్తమాంకమున గల అయోధ్యాపురవర్ణనమున పదునారవశతాబ్దపు వాతావరణము ప్రతిబింబించినది అప్పట్టులందు నిఘంటువులందు లేని శబ్దము లెన్నియో కలవు ఇట్టి వానిలో కవిప్రయోగము లెన్నియో, వ్రాయసకానిపొరపాటు లెన్నియో, యర్థము చేసికొనలేని నా 'గ్రహపాటు' లెన్నియో నాకు తెలియదు. కొన్ని పట్టులందు కవి తాను చెప్పదలచిన భావమున కనుగుణమైన మాటలు లభించి నప్పుడు ఛందోభంగమునకు భయపడి మాషమును మషముగా చేసిన ఇక్కట్టులును గలవు

సప్తమాంకమున రాము నుద్దేశించి నేపథ్యమునుండి వినవచ్చు మాట లివి :

గీ. ఏల పాలార్చెదవు దానవేంద్రు తలల
గొలల విందింపరాదె మా కోర్కి వొక్క
బాణమున నో పయోజాతబంధువంశ
తిలక నిజకీర్తిచే ధరిత్రియునుఁబోలె. (VII-౧౩౬)

ఇచట కోలల (బాణముల)ను పదమును 'కొలల'ని ఛందమున బంధించినాడు. తలల గొలల(గెలల)ని సవరించుకొనుట కవకాశమున్నది కాని మూలములో నిచట 'శరస్తోమైః' యని కలదు

"కిం క్రీడసి శరస్తోమై ర్నన్వేకేనైవ ప్రతిజ్ఞా,
పరిపూరయ నః కామం యశసా చ జగత్త్రయమ్ " (VII-122)

ఇంతకన్న మరియొక వింత ప్రయోగమును గమనింపుడు.

ఆ. వె. మధుర సాటిగాదు మాయయుఁ బ్రతిగాదు
కాశి జోడుగాదు కంచి యీడు
గాదు ద్వారకయును గాదెన *యుజ్జని*
యును సమంబుగా దయోధ్యతోఁద. (VII-౨౪౩)

ఈ పద్యమున 'ఉజ్జయిని' 'ఉజ్జని'గా మారుట మాషము మషమగుటే లేదా తెలుగునాటి వ్యవహారమున 'ఉజ్జయిని' 'ఉజ్జైని'యై వ్రాయసకాని మాహాత్మ్యమున 'ఉజ్జని'గా మారినదని భావింపవలెను వ్యవహారమున గల 'ఉజ్జైని' రూపమును గ్రహించినచో కవి ఛందోభంగమునకు భయపడి కక్కుర్తిపడినాడను కళంకము తొలగును వ్యవహారమందున్న "ఉజ్జైని" రూపమును గ్రహించుటే నా యభిమతము కాని గీర్వాణగిరాంధురంధరు లేమందురోయని గుండె గుబగుబ లాడుచున్నది

పరిష్కరణము నాకు లభించిన ప్రసన్నరాఘవనాట్యప్రబంధము తాళపత్రప్రతిని దాదాపు రెండేండ్ల క్రిందటనే ఉన్నదున్నట్లుగా ఎత్తి వ్రాసితిని ఈ గ్రంధమున కచ్చగు యోగము పట్టగనే పూర్వము వ్రాసిన ప్రతిని తాళపత్రప్రతిని రెంటిని సరిచూచుచు మరల నొకసారి వ్రాసితిని తాళపత్రగ్రంధము మిక్కిలి శిథిలావస్థలో నుండుటవలనను, వ్రాయసకాని పొరపాటు లధికముగా నుండుట వలనను ఈ గ్రంధపరిష్కరణము క్లేశావహమైనది తాళపత్రగ్రంథములను భక్షించు కీటకములు గూడ కావ్య రసాస్వాదనమున నారితేరిన వనిపించును మంచి పట్టులందే యవి గ్రంధమును కాజేసినవి. ఊహించుటకును పూరించుటకును కష్టము లైన స్థలములను ఏరికోరి యవి భక్షించునట్లు తోచును నాచేత కొన్ని యష్టావధానపు కష్టములు గుడిపించినారీ కీటకపృచ్ఛకులు కొన్నితావుల సమస్యాపూరణములు, కొన్నిపట్ల దత్తపదిగ్రహణములు, మరికొన్నిచోట్ల వ్యస్తాక్షరీసంయోజనములు, చివరకు అనవసరప్రసంగములవంటి యష్టావధానవిధానముల నెటులో యోపినంత చేసి గండము గడచి బయటపడ గలిగితిని కీటకములు కొన్ని యక్షరముల యుపరిభాగములను కొరికి అధోభాగములను విడిచినవి. కొన్ని యక్షరముల యధోభాగముల గొరికి యుపరిభాగములను విడిచినవి కొన్నిపట్ల గుడిని గుడిలోని లింగమును మ్రింగినవి. తలకట్లు, గుడులు, ఎత్వములు, ఒత్వములు పోయిన యక్షరములను అధోభాగముల పోలికలనుబట్టి పూరించు

కొంటిని ఇక శిఖరములు మిగిలినప్పుడు ఒక గోపురమునకు మరియొక గోపురమునకు గల మధ్యప్రదేశము ననుసరించి ఆయా అక్షరముల గుడుల పునాదులు కనుగొంటిని అప్పుడు నాకు ఆంధ్రభాషాలిపియందలి గొప్పతనము గోచరించినది వానికి సరియైన దేవనాగరి యక్షరములు వ్రాసి వానిని గూడ శిధిలపరచి తెలుగక్షరముల పూరించినట్లు పూరింపవచ్చునేమోయని ప్రయత్నముచేసి విఫలుడనైతిని అప్పుడు మన లిపి గొప్పతనము మరికొంత తెలిసివచ్చినది

ఆకులు క్రిమిదష్టములై యక్షరముల కడుపులు చిల్లులు పడినప్పుడును, స్పష్టాస్పష్టపు గురుతులు మిగిలినప్పుడును, నేను పూరించినవానిని ( )ఇట్టి కుండలీకరణములం దుంచితిని కమ్మలు విరిగిపోయిన చోటను, అక్షరములు పూర్తిగా శిథిలములైన చోటను, వ్రాయసకాని పొరపాటువలన యక్షరములు జారిపోయిన చోటను, ఏ యాధారమును లేక నేనే యూహించి పూరించినవానిని [ ] ఇట్టి కుండలీకరణములందును ఉంచితిని సమంజసములని తోచి నేను చేసిన మార్పులకడ సంఖ్యలుంచి గ్రంథమందున్న యక్షరములను, పదములను అధోజ్ఞాపికలం దిచ్చినాను వీనిలో చాలవరకు వ్రాయసకాని పొరపాటులనియే నా నమ్మకము నాకు తెలియని పదములును, పదబంధములును, ఉన్నచోట ప్రశ్నార్థకము లుంచినాను ఛందోభంగములైనచోట గూడ ప్రశ్నార్థకము లుంచినాను పూరించుటకు చేతకాని పట్టు లూరక విడిచినాను. వ్యాకరణవిరుద్ధప్రయోగము లున్నను తెలియని మాటలు వచ్చినను వీలైనంతవరకు వాని నటులే యుంచినాను సొంత కవిత్వము చొప్పించిన చోట గుర్తు లుంచి గ్రంథమందున్నవానిని అధోజ్ఞాపికలం దిచ్చినాను. కవి యుద్దేశించిన పాఠముల నూహించి శిథిలములను పూరించినప్పుడు నాకు కలిగిన శ్రమ వర్ణింపరానిది. సంస్కృత మూలమును చూడక ముందుగా నేనే ఊహించువాడను నా పాఠము సిద్ధమైన తరువాత మూలమును చూచెడివాడను మూలముతో సంవదించు శిథిలపూరణ మొనర్చినప్పుడు నాకు కలిగిన సంతోషముకూడ వర్ణింపరానిదే ఒక్కొక యక్షరమును కనుగొనుటకు గంటలకొలది ఉస్సురుస్సు మనువాడను ఆ యక్షరము స్ఫురించినంతట ఆర్కిమెడిస్‌వలె సంతోషపారవశ్యము ననుభవించువాడను సొంతముగా కవిత్వము కట్టవచ్చును గాని శిథిలమును పూరించుట కష్టమనిపించినది. లభించినది యొకే ప్రతి గనుక పరిష్కరణము నా పాలిటికి మహాయజ్ఞమైనది అమూలకములును, మూలాతిశాయి భాగములును, వచ్చినచోట శిథిలపూరణము మిక్కిలి క్లేశము కలిగించినది ప్రథమసప్తమాంకములం దింకను సందేహాస్పదములగు తావులు కొన్ని గలవు లేకలేక ఒక్క గ్రంథమును పరిష్క-

రించితినో లేదో నా కష్టసుఖము లిట్లుండ వాఙ్మయోద్ధారకు లెందరో మహాను భావులు పదులిరువదులు గ్రంథములు పరిష్కరించి ప్రకటించినవారి పాటు లెట్లుండెనో తలచుకొని సిగ్గుతో క్రుంగిపోయితిని

కృతజ్ఞతలు తెలుగు చరిత్రమునకును, నాటకచరిత్రమునకును క్రొత్త వెలుగును కలిగించిన ఈ యమూల్యగ్రంథము వెలుగుచూచుట కవకాశము కల్పించిన ఆంధ్రరచయితలసంఘంవారికి – ప్రత్యేకముగా ఆంధ్రరచయితల సంఘాధ్యక్షులగు ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారికి నమోవాకములు శిథిలములు పూరించుటయందు నా కత్యంతము సహాయభూతులైన మద్గురుపాదులు శ్రీమదాచార్య రఘునాథచక్రవర్తిగారి కేటికోళ్లు ఈ పీఠికను వ్రాయుటకు తోడ్పడిన గ్రంథరచయితలందరకు కృతజ్ఞుడను అల్పవ్యవధిలో నందముగా ముద్రించిన అజంతా ప్రింటర్సువారికి జోహారులు నా పరిష్కరణమునగాని నా యూహలందుగాని పొరపాటు లేవేని యున్నయెడల సహృదయులైనవా రెరిగించినచో కృతజ్ఞతతో మలి ముద్రణమున సవరించుకొందును ఇందేవేని గుణములున్నచో ధీరుడు బొడ్డుచెర్ల చినతిమ్మయ మంత్రికుమారునివి దోషము లున్నచో నాయవి అచ్చు పొరపాటులు మాత్రము సహృదయపాఠకలోకము సహించవలె

క "నందేల తిమ్మరాజ పు
రందరచిహ్నప్రసన్నరాఘవనాట్యా
మందప్రబంధరాజము"
వింధగుత తెలుంగువారి వీనుల కెపుడున్

1-8-117/2 చిక్కడపల్లి
హైదరాబాదు—20

శా ॥ ౧౮౮౪ శుభకృత్ విజయదశమి
8—10—1962

ఇట్లు
వి. రామరాజు

# వి షయ సూ చి క





# ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము

## ప్రథమాంకము



ఉ. శ్రీలలనాకపోలకుచసీమల కుంకుమరేఖ (లజ్జ) భూ
భాలములం బ్రపుణ్యలిపిపంక్తుల నొక్కట వ్రాయుచుం బ్రవా
ళాలఘురేఖ నొప్పు హరిహస్తచతుష్టయ మిచ్చుగాత నం
దేల నృసింహభూరమణు తిమ్మనృపాలున కీప్సితార్థముల్. ౧

శా. ఆరోగ్యం బొసగున్ మురారి ముఖచంద్రాంచన్మరున్మాధురీ
ధీరోదాత్తము మేఘనాదవిజయోదీర్ణంబు నిర్భిన్న దే
వారాతిద్విపకుంభకర్ణము దశాస్యాశాక్రమోత్కంబునై
భూరిశ్రీదగు పాంచజన్యరవ మెప్డున్ తిమ్మభూభర్తకున్ ౨

శా. (హా)సశ్రీపరిశోభినాభికమలస్థాజస్తవాకర్ణనో
ల్లాసోద్యన్నయనాననేందురుచిలీలం దేలి సక్రోధము
ద్రాసక్తిన్ మధుకైటభున్ సకరుణోదా(ర)ంబుగా లక్ష్మినా
శ్వాసస్నేహమతిన్ విరించి గను తేజం బేలు తిమ్మాధిపున్. ౩

వ. నాంద్యంతంబున సూత్రధారుండు నలుదిక్కులుం గనుంగొని హర్షో
త్కర్షంబున ౪

సీ. నిజవక్త్రశారదాంబుజనర్తితరమాక్షి
ఖంజనుండు మునీంద్రరంజనుండు
గండస్థలీరంగతాండవితాండజ
కుండలుం డానతాఖండలుండు
వక్షోనటత్ఫుల్లవైజయంతీదామ
భూషణుండు నిశాటభీషణుండు

భూతలాస్యక్రియాహేతుమాయాసూత్ర
ధారకుండు భవాబ్ధితారకుండు
గీ. గురువిలాసనాభీసరోవరభవప్ర
భూతభువనాంబుజాతుఁడునై తనర్చు
నంజనాద్రీశు తీర్థయాత్రానురక్తి
గూడె నీ పారిషదు(ల పెన్గూ)ట మిచట. ౫

వ. ఇందు నందేల తిరుమలధరావరుండును తిరుమలకొండ నేలు జేజేల రాజుఁబూజించువాఁడై వేడుకం గళింద హిందూ కుళిందాది జనపదేశ్వరులగు జనపతులును, నిర్వక్రనీతిక్రియాసంధానయుగంధరులగు ప్రధానిధురంధరులును, నిశితనిజజిహ్వాకాంతర్వసద్వాణులగు నంతర్వాణులును, వివిధకవితాకళాదక్షులగు కవిహర్యక్షులును, నటవాంశిక గాయక మార్దళికాది కళాధరులునుం గొలువం బ్రసవచాపవిశ్వరూపశంకాకారి పరివారనారీకపోలబింబితనిజరూపవిభవుండయి వివిధమణిమయూఖ రేఖాచ్ఛటాచ్ఛాదిత దిగ్వాటం బగు కొలువుకూటంబునఁ గొలువున్నవాఁడమ్మూర్ధాభిషిక్తు నర్ధాసనంబున. ౬

ఉ. ధీరుఁడు బొడ్డుచెర్ల చిన తిమ్మయమంత్రి కుమారుఁ డంచితా
కారుఁడు సత్కళావిదుఁడు కౌశికగోత్రుఁడు పద్మనేత్రి సే
వారతబుద్ధి నందవరవంశ్యుఁడు ప్రాకవిలోకనాథుఁ డా
చార సమగ్రవర్తనుఁడు సారవచోనిధి యున్నవాఁడొగిన్. ౭

వ. ఏమి వర్ణింపఁ దొడంగినవాఁడో యని యాకర్ణించు నెడ నతం డా రాజచూడారత్నంబునకు జగత్ప్రసిద్ధంబుగా ప్రసన్నరాఘవంబను మహానాటకం బంధ్ర నాట్యప్రబంధంబుగా ననుసంధించి యంకితంబు గావించి తదీయవంశావతారంబు వర్ణింపం దొడంగి యా సుధాసారుం దొంటి జనమేజయుం డెల్లయు నతం డాదిగా రాజరాజనరేంద్రుండు మర్యాదయు నతండు మొదలుగా నారవీటి పిన్నక్షమాపాలుండు మెరయంగా నవక్రవిక్రమక్రీడావిపాటితవిపక్షవక్షఃకవాటులగు మేటి రాజులం గీర్తించి

యనంతరమహీకాంతశ్రేణి నానుపూర్విఁ గర్ణకుహరమహంబుగా నిట్లని
వర్ణింపఁ దొడంగె ౮

మ గణుతింపం దగు నారవీటిపురబుక్కక్ష్మాతలాధీశ్వరా
గ్రణి కోదండకళాకిరీటి యనుచుజా గంకాణయూథాధిరో
హణరేఖానిషధేంద్రుడంచుఁ బటుబాహాసారసంపత్సమీ
రణసంసూతి యటంచు దానకలనారై రాజటంచున్ మహిన్. ౯

వ. ఆ రాజకంఠీరవుండు ౧౦

క రీవిగ నబ్బలదేవిన్
బావనచారిత్రయైన బల్లాదేవిన్
దా వరియించె రమావసు
ధావనితల భావజన్మ తంద్రియుఁ బోలెన్ ౧౧

గీ అందు బల్లాంబికకు రామయ క్షితీశ్వ
రాదు లుదయించి వెలసిరి యబ్బలాంబ
గనియె నయశాలి సింగరయ్యను మనూప
మాను నౌబళవసుమతీజాని వరుఁడు. ౧౨

వ. ఆ యిద్దరయందు. ౧౩

ఉ. భూనుతుఁ డారవీటిపుర బుక్కధరావరు సింగధారుణీ
జాని కృపాణరోచిఁ గని శాత్రవు లాహవధాత్రిఁ గన్నులం
గానమి లోకబాంధవుఁడు గావున వారికిఁ ద్రోవ వెట్టు తే
జోనిధి యట్టివారలకుఁ జూపు నొకానొక త్రోవ దైవముజా ౧౪

క. అతని (కి) నతిశుచితారుం
ధతి యౌబళదేవివలన నరసింగమహీ
పతి (నా)రయ్యయుఁ దిమ్మ
క్షితిపాలుఁడు గలిగి రంత శిక్షాదక్షుల్. ౧౫

క. అందు నరసింగరాజపు
రందరుఁ డసివజ్రధారఁ బ్రతిపక్షకుభృ
ద్బృందముల దునిమి యేలెన్
నందేలపురంబు విభవనాకపురంబున్. ౧౬

క ఆ నరసింగనరేంద్రుఁడు
మానవతీరత్నమైన మాడలదేవిన్
దా నుద్వాహం బయ్యెఁ బ
యోనిధిరాజాత్మజం బయోజాక్షి క్రియన్. ౧౭

సీ. చండధాటీరణడిండిమధ్వనిదీర్ణ
గాంగేయకుధరుండు సింగరయ్య
భూరిసేనారజఃస్మారితప్రళయోద
ధారణతత్త్వుండు నారనృపతి
పృథులశత్రుగ్రామభీమబాహాబల
శ్రీ బకారి కుమారయోబశౌరి
యోధసంబాధబాహుళ్యరౌద్రసమీక
సరదురుప్రతియాతి వరదరాజు
గీ. భానుతేజుండు రఘుపతిపార్థివుండు
కలిగి రేగురు నందను ల్గాఢయశులు
నాకతరుపంచకము నీగి నవ్వువారు
మాదలాంబకు నరసింగమనుజపతికి. ౧౮

వ. అందు. ౧౯

చ. అల[యు] పెరుంగరయ్య కలనైన భయంబు నెరుంగరయ్య యే
వెలితి నెరుంగరయ్య పృథివిన్ నడయాడు పెరుంగరయ్య తా
రలపు లెరుంగరయ్య నిఖిలాశల నడ్డ మెరుంగరయ్య య
బ్బలియుఁడు సింగరయ్య పదపద్మములం బడు వైరిభూపతుల్ ౨౦

ఉ. శ్రీనిధి యారవీటి నరసింగయ నారడు కోపగించినన్
మేనులు సంచలింప బలుమేయుచు శత్రుల పూరిమేపునే
పూనిక నెట్టివారలును బుట్టఁగఁ జేసిన దైవమం చిలన్
గానఁగ లోకు లాడుకొను గాథకుఁ దప్పొనరించు రాజులన్. ౨౧

చ. తన (ధృత)మండలాగ్రమగు దక్షిణహస్తమె శస్త్రవిద్విష
జ్జనపతులన్ గతశ్రమతఁ జక్కఁగఁ జేయ కుమారయోబరా
జెనయగ సవ్యసాచిత వహించుట యర్థికి రెండు చేతులన్
బనివడి యిచ్చుచోఁ గొదలు వాయఁగఁగాక సమిజ్జయార్థమే. ౨౨

చ. లలితనిజప్రతాపరవులన్ వరదక్షితినాథుఁ డెల్లెడన్
గలయఁగ నించి గంచు(టు)రిగన్ దగ లావణి వైచి పోవ నీ
కలమె బలంబులంచు నభియాతు(లు) దూల నిలాతలాధిరా
ట్టిలకుఁ డితండపోయనఁగ తేజమునం గడు నొప్పు నెప్పుడున్. ౨౩

ఉ. ధీనిధియైన యా రఘుపతిక్షితిపాలుని దానవారిచే
నైనదిగానగున్ జగతి నంబునిధానము కాకయున్న సం
తానమరుద్గవీజనకు దాతృతఁ జాల ప్రసిద్ధి కెక్కునే
తానును పూర్వవాసనలు దప్ప రొకప్డు గభీర వర్తనుల్. ౨౪

గీ. వారిలో సింగరయ్య శ్రీగౌరమాంబఁ
జెంది నరసింగు రఘుపతిక్షితిపు నొబ
ళాధిపులఁ గాంచె రామత్రయానుకారి
భూరితరవిక్రమాఢ్యుల పుణ్యమతుల. ౨౫

వ. అందు ౨౬

ఉ. సింగరయక్షితీశు నరసింగనృపాలుఁ డభంగసంగర
ప్రాంగణవీథి యోధనికరావృతుఁడై తురగంబుఁ దోలినన్
క్రుంగి నలంగి చెంగి తమ గుట్టుఁ దలంగి కలంగి ప్రాజ్యరా
జ్యాంగము లిచ్చి చొత్తు రభియాతులు కాంతలతోఁ నరణ్యముల్. ౨౭

క. రఘుపతిభూపతి రెండవ
రఘుపతి గాదేని యద్దిరా హరియూధా
లఘుపదభిదురత్రుటితా
రి ఘనాఘనాద్రియై ధరిత్రిఁ బరగునే. ౨౮

ఉ. యుద్ధములందు సింగరయ యోబడు హేతి నరాతి ధారుణీ
భృద్ధవళాతపత్రములఁ బిస్సన మీఁదికిఁ దేలఁ గొట్టినన్
శుద్ధసుధాంశుబింబములఁ జూచితి మీ నృపకీర్తివార్ధి ను
ద్బుద్ధములయ్యెఁ గావలయుఁబో యివియంచుఁ దలంతు రభ్రగుల్.

క. ఆ వసుధాధీశులలోఁ
బావనమతి నారసింహపార్థివమణికిన్
దేవియగు రామమాంబకు
నావళి చినయోబశేంద్రుఁ డాత్మజుఁ డయ్యెన్. ౩౦

ఉ. పాయక పిన్న యోబళనృపాలుఁడు శత్రుశిరః కరోటికల్
వ్రేయఁగఁ దత్కరాసిఁ బ్రభవించు ననూనఖణీవిరావముల్
తోయరుహోద్భవాండమున దొంటి యధఃకరణంబొనర్చు న
త్యాయతకాలరుద్రవృషభారభటిన్ సమరాంగణంబులన్. ౩౧

వ. ఏతత్పితామహానుజుండు. ౩౨

క. ఘనుఁడా నారక్షితిపతి
గనియెఁ నరసింగరాజు కనకాధిపు భూ
జన (వినుత) మాదలాహ్వయు
ననఘగుణాధార తిరుమలాంబిక వలనన్. ౩౩

క. అందుఁ బొగడొందె మార్గణ
మందా(ర)ము నిజ[క]రోర మార్గణబృందా
మందారదారితారియు
నందద్గుణనిధియు నగుచు నరసింహుఁ డిలన్. ౩౪

చ కనకధరాధినాయకుఁడు కన్నులకెంపు వహించెనేని రా
జనక చమూవిభుండనక యంత్రవరుండన కాజిఁ దూలుఁ గా
దనక యెరుంగఁ జెప్పరన కందరునున్ బరతెండటంచు వే
జనుగక మూఁకలై శరణుఁ జొత్తురు మత్తవిరోధియూధపుల్. ౩౫

క. సరి యగుదురు మాదలభూ
వరునకు బలశాంతిధైర్య వైభవమతులన్
ధరణీధర ధరణీధర
ధరణీధర గమన దమన ధాతృప్రముఖుల్. ౩౬

వ. అందు ౩౭

గీ కోరి నరసింగపతి పెద్దకొండమాంబ
యందు నమ్మూర్తిరాజు తిమ్మావనీశు
పిన్నకొండమదేవియం దెన్నఁగలుగు
కృష్ణభూవరుఁ గనియె వర్ధిష్ణుశీలు ౩౮

వ. అందు. ౩౯

గీ ఆజి పృథురాజు సంపద రాజరాజు
భోగసురరాజు వాక్కళాభోగిరాజు
ధైర్యనగరాజు సూనృతధర్మరాజు
మూర్తినిర్జితరవిరాజు మూర్తిరాజు. ౪౦

ఉ భాసురభోగభాగ్యనయబాణకళాబలధైర్యరేఖలన్
శ్రీసహితాలయుండగు నృసింహుని తిమ్మవిభుండు వోలు న
వ్వాసవు (వాస)వావరజు వాసవదేశికు వాసవాత్మజున్
వాసవదంతి వాసవనివాసము వాసవవైద్య వర్యులన్. ౪౧

చ. అతులితదానశీలియు మహాబలశాలియు నైన కృష్ణభూ
పతికడ(కేగు) యాచకులఁ బాయని భారతి వేఁడికొండ్రు దే

వత లతనిం దగం బొగడి వారలు వేఁడెడుచోట మేరు వి
మ్మితరము లొల్లమంచు వచియింపఁగ నీ(క వచిం)చు నెప్పుడున్. ౪౨

క. ఆ నారభూవరానుజుఁ
డైన కుమారోబరాజు ననుజాతుండై
శ్రీ నెసగు వరదరాజు సు
ధీనిధి నుద్వాహమయ్యె తిరుమలదేవిన్. ౪౩

క. ఆ రమణీరమణులకున్
శ్రీరంగవిభుండు నారసింహుఁడు కనక
క్ష్మారమణుఁడు జనియించి రు
~~దారులు రామత్రయప్రతాపవిహారుల్~~ ~~౪౪~~

శా. శూరత్వంబులు మాని, పెట్టు బిరుదుల్ సుంకించి, పంకించి, నీ
పేరీ పుత్త్రుఁడు, దాసి యీ తనయ, తా బిడ్డం జుమీయంచు నా
శ్రీరంగ క్షితిపాలుఁ జేరి యలఘుశ్రీమంతులై మింతు రు
గ్రారాతుల్ పరుసంబు సోకు నినుముల్ హేమాకృతుల్ గన్ క్రియన్.

క. కలన రిపుజరరతటములు
సెలయున్ సెలగోరు వాఁడి చేకత్తి మొనన్
[1]జెలగు నరసింగ జనవిభుఁ
డిలలో నరసింహుఁ డరయ నితఁడే యనగన్. ౪౬

క. అనయము కనకక్ష్మా భృ
ద్ఘన కీర్తులు రజత శిఖరిఁ గైకొనవు తగున్
వినుత కనకప్రభావం
బున కెనయే వెండి దండి ముల్లోకములన్ ౪౭

క. వారలలో నగ్రజుఁడగు
శ్రీరంగ క్షోణిపతికి శ్రీ తిరుమలదే

1 జెలగి

వీరత్నమునకు నౌబళ
భూరమణుఁడు గలిగె పూర్వపుణ్యఫలమ్మై. ౪౮

క ఆ యౌబళమనుజేంద్రుఁడు
సాయంతనమల్లికాప్రసన్నయశశ్రీ
నాయకుఁడై బాలాసుమ
సాయకుఁడై ధరణిభరణశక్తి వహించున్. ౪౯

శా ఆ నందేలకుమారయోబవిభు నిల్లాలైన యల్లాలిత
జ్ఞానం దిర్మలదేవి నెల్ల జనులున్ శైలాధిరాట్కన్యకం
గా నీరాకరసార్వభౌమతనయంగా వాణిఁగా జాహ్నవిం
గా నంభోనిధిమేఖలామదవతింగాఁ జూతు రత్యున్నతిన్ ౫౦

మ. కనియెన్ దజ్జలజాయతాక్షి నరసింగక్ష్మేశుఁ బెద్దోబళ
య్యను (మా) దాధిపుఁ బిన్నయౌబళు నృపాలాగ్రేసరున్ నారభూ
జన నాథోత్తము సంధిపంచకము చంచన్నాటకశ్రీ యనన్
ఘనుఁ డందుం దగు నారసింహ విభుఁ డక్షీమప్రతాపాఢ్యుఁడై. ౫౧

సీ చప్పరించుచుఁ జొంగ జార తుంగలె మేయు
పోత్రివల్లభు కోర పొత్తు రోసి
తలపోయ నీరసత్వమె కాని సరసభా
వము లేని గిరులు కూటములు రోసి
సతతంబు మధుపాయిసంతానమున కభో
గ్యంబైన కరుల దానంబు రోసి
పిగులు కుప్పసమె తప్పించి మై నేమియుఁ
గలుగని భోగి భోగంబు రోసి

గీ గహ్వరీకాంత జగనొబ్బగండ చండ
మండలీకరమార్తాండమహితబిరుద
నామ నందేల నరసింగనరవరేణ్య
విపులబాహాకన[క]పీఠి విశ్రమించు. ౫౨

మ అనతారాతుల గొంటగట్టి తెరపా మగ్రంబునన్ నిల్పి పె
ట్టిన శుభ్రాండము లోలి గెంటిపడు మాడ్కిన్ జాల నందేల యో
బన్నృపాలాగ్రణి ఖడ్గవల్లిక చలింపన్ రాలు తత్కుంభిరా
ట్ఘనకుంభస్థలముక్తమౌక్తికము లక్షమాహవశ్రేణులన్. ౫౩

క అల మాదిరాజు భుజమం
జులకుంకుమచర్చ దేలుచున్ మహి దంతా
వళకుంభశైలశిఖరా
గ్రలసత్సిందూరగైరికంబులఁ దెగడున్. ౫౪

మ. ప్రవిభావిక్రమమంత్రశాస్త్ర (విభవార్ఘ)శ్రీధనుఃకాంతిధై
ర్యవివేకంబులఁ జిన్నయోబళనృపాలాగ్రేసరున్ బోల్తువే
సవితన్ సాత్యకి సింధు సీరి సురశాస్తన్ సూతు సేనాని సై(ం)
ధవగర్వాపహు సోము సౌరగిరి సంధ్యాతాండవాడంబరున్. ౫౫

చతుర్విధకందము

తారాద్రిధైర్యుఁ గరుణా
గారు న్నిర్జిద్రవిభవుఁ గరుణోదీర్ణున్
నారావసీశుఁ ద్రిజగ
ద్వీరున్ వర్ణింపఁబోలు వితరణకర్ణున్. ౫౬

వ. ఇందుఁ బెద్దయౌబళక్షితిపతికి నుద్దండౌబళవిభుండును, బినయోబజన
పతియును, బినయహోబళేశ్వర విశ్వంభరాభర్తకు తిరుమలరాజ రాజ
రాజ కృష్ణరాజు లుదయించి రందు. ౫౭

శా. తిద్దున్ చంద్రునివంక కీర్తిరుచిఁ బెం దేజోరమాస్ఫూర్తియే
ప్రొద్దున్ బాయకుఁ దెచ్చుఁ జక్కనదుపున్ రూఢంబుగా నింగి నే
ప్రొద్దున్ నిర్జరధేనువున్ గుణగణస్ఫూర్తిన్ వితర్కింప న
య్యుద్దండౌబళరాజసింహాసనకు నే యుర్వీశులున్ సాటియే. ౫౮

క. కందేల గలుగు విధునకు
నందేల చినౌబళేంద్రు నవకీర్తిసుధా
బ్ధిం దేల ననుచుఁ దమలో
పందేలకుఁ గడఁగుదురు నభశ్చర కాంతల్. ౧౯

ఉ. ఆ వినయౌబళాహ్వయధరాధిపు తిమ్మనృపాలు దేవతా
నైవికిఁగా సహస్రకరనందనుఁగా హరిచందనంబుఁగా
ఖేచర రాజుఁగా వృషభ కేతను నెచ్చెలిఁగా సుధాంశుఁగాఁ
జూచి నుతించు నర్థితతి శుద్ధతరప్రతిపాదనంబునన్ ౨౦

క. ధనవిజితరాజరాజున్
జినయోబళరాజరాజుఁ జిరతరతేజో
దినరాజరాజకులనిధి
ఘన విద్యాభోజరాజు గణుతింపఁ దగున్ ౨౧

క. కొనియాడఁగఁ (దగు సత్కవి)
జనతావినుతావధాను సమధికదానున్
వనితామదనసమానున్
బినయౌబళరాజు కృష్ణుఁ బృథురణజిష్ణున్. ౨౨

వ. ఇయ్యేగురకుం బెద్దతండ్రియగు మహానుభావుండు. ౨౩

క. వనజాతహస్త సంప
జ్జనకా పాంగాభిరామసకలపురంధ్రీ
జననుతలక్ష్మీదేవిన్
బనివడి నరసింహ విభుఁడు పరిణయమయ్యెన్ ౨౪

మ. సిరు లుప్పొంగ నృసింహభూపతికి లక్ష్మీకాంతకున్ మార్గణా
మరభూజాత మహోబళేశ్వరుఁడు శుంభద్విశ్వ విశ్వంభరా
భరణశ్రీనిధి తిమ్మరాజు రిపుభూపాలద్విపశ్రేణికా
హరి నారప్పయుఁ గల్గి రుజ్వల యశోహారార్చితాశాధిపుల్. ౨౫

క. అరిరాయ దళ విభాళుని
పరనారీ సోదరుని గృపానిధి నంత్యం (?)
బర (ముం) డని దగదే యె
ల్లరు బొగడఁగ మహి నహోబల క్షితిపాలున్. ౬౬

సీ. ఆట డిగ్గియలు కర్ణాటతాటంకినీ
కాంత శ్రవఃపుటాభ్యంతరములు
కేళి సద్మములు బంగాళభృంగాటకా
సరసమాన[స] సరస్సంభవములు
కమ్మ సెజ్జలు సింధుగంధేభగామినీ
స్వాప్నచంద్రాతపాంచత్తలములు
కొలువు కూటములు కోసలపేశలాధరా
కమనీయతరనేత్రకైరవములు
గీ. గాయిగోవాళ చెలువర గండచండ
మండలీకర మార్తాండ ఖండనోగ్ర
బిరుదభూషిత నందేల తిరుమలేంద్ర
మహితసౌందర్య లక్ష్మికి నహరహంబు. ౬౭

చ. పడగలపాటులం బొరలు పన్నగభర్త మొగంబు వేలు నే
ర్పడ, గజరాజరాజి తలపట్టిడు, సాగిలు కూర్మభర్త, య
ప్పుడమి నృసింహభూరమణపుంగవు తిమ్మనృపాలు మేలపుం
గుడి భుజ మెక్కి నిక్కి తమ కూటమి రోయుచు డాయకుండఁగన్

మ. తనదోర్దర్పితదానవారి త్రిజగత్ప్రఖ్యాతి పెంపొంది క
ర్ణుని గొట్టింపవె కల్పగల్పకము సింధుస్వామి గంటన్ విరో
చన పుత్రుం దలమెట్ట శీతకరు కన్నన్నున్ మెలగింపఁగా
మను నందేల నృసింహ భూరమణు తిమ్మక్షోణిపాలుం డిలన్. ౬౮

చ. క్షితి ధృతిశాలియైన నరసింహమహీధవు తిమ్మధారుణీ
పతి యమరున్ మహీ(భరణ) భద్రకరాయతనీలముద్రికా

ప్రతతిఁ దనర్చు తత్కరమ పండిన నేరెడు నేరచేరు త
త్సతత సహేమదానజలధారయ కల్పన లున్న విన్నియున్. ౭౦

చ అరులకుఁ ద్రోవ యీఁదగునె [1]యాళశి రాహు గదల్ప కల్ల పు
ష్కరమణిమండలంబ నిజకాయవేస త్తదుదగ్రవై రిభూ
వరసహితంబుగాఁ గదిసి వామ(పదం)బున (ప్రా)లెనో యనన్
బరగె ధరించు తిమ్మజనపాలుఁడు బొమ్మలపెండె మిమ్మహిన్. ౭౧

చ. తిరముగ నారసింహజగతీపతి తిమ్మనృపాలుఁ డుద్ధతిన్
బురములఁ బాసినట్టి రిపుభూవరులన్ నిజవామపాదనూ
పురమున నిల్పె వా రితరభూభుజులం దలఁ దన్ను జొచ్చి రే
యురుదిది యెట్టివారును మహాశ్రయతన్ గనరే సమున్నతిన్. ౭౨

క. ధరపైఁ దాండవ మాడెడు
హరుఁడు సమానంబె పద్మజాండము మీదన్
దిరుపులు గొనియెడు తిరుమల
నరపాలకచంద్రు కీర్తినటి కెన్నటికిన్. ౭౩

మణిగణనికరము

మలయుచు నని దిరుమల నృపుఁ డలుకన్
హలిగతిని ముసల మటునిటు మెలపన్
మొలచిన భయమున మొగి చెడి బలమున్
బలములును జెదరఁ బరతురు ఖిమతుల్. ౭౪

సీ యవనసైన్యవిభాళ భువనైకమల్ల క
ల్యాణపురాధ్యక్షరక్షితుండు
బిరుదుమన్నెవిభాళ ధరణీవరాహ సౌ
రాసిదుర్గవిభాళభాసితుండు

1. యచ్ఛశి.

ఘనతరాత్యంబర గండనానావర్ణ
మండలీకరగండ మండితుండు
సంగీత సాహిత్య సంగరాంగణ సార్వ
భౌమ నిశ్శంకాంక బంధురుండు
గీ. ఖండనార్జున చెలువరగండ మన్నె
బెబ్బులి ఖ్యాతసంజ్ఞాతపృథులజయుఁడు
రాజమాత్రుండె నరసింగరాజ సుతుఁడు
దీప్తి దినరాజు నందేల తిమ్మరాజు ౨౫

వ తదనుసంభవుండు ౨౬

సీ గుహధనంజయరఘూద్వహభార్గవుల కొజ్జ
చర్చింప నెవ్వాని చాపవిద్య
ఘనకర్ణ బలిసుధాకరులకు మేల్బంతి
తలపోయ నెవ్వాని దానమహిమ
పవనపావనిభీమబలభద్రులకుఁ బ్రాపు
పరికింప నెవ్వాని బాహుశక్తి
నలపంచబాణాశ్వినలకూబరుల కేపు
రూపింప నెవ్వాని రూపరేఖ
గీ ఆతఁ డుద్దండ రాయవేశ్యా భుజంగ
చన సురాయరగం(డ) మో(హ)న మురారి
సంగరార్జున నందేల శాసనాంక
నారసింహక్షమాజాని నారశౌరి ౭౨

మ. అమితారిక్షితినాథయూథపనికాయంబందు నందేల నా
రమహీకాంతుని శాతహేతి మెరయన్ గ్రాలున్ సమిద్భూమి భా
గమునం బుష్కరవృష్టి చాల నల నాగశ్రేణి మేఘంబొ ఖ
డ్గము శంపాలతికామతల్లియొ యనంగా నద్భుతప్రక్రియన్. ౨౮

చ. అలయక వేయునోళ్లఁ గొనియాడిన మాటికిఁ బీట వెట్టినన్
లలిఁ దలఁ గ్రుచ్చి మచ్చిక లొనర్చిన సర్పవరాహకూర్మ భ
ర్తల కెడమీక నారవసుధావరు దక్షిణబాహుసంగతిన్
చెలఁగు ధరిత్రి కామినులు చిత్తము రాక ప్రియంబు మెత్తురే. ౭౯

వ. అని సకలసుకవిజనమనోహరంబుగా నిర్ణిద్రభద్రవాచాచాతురిం గోరి
వర్ణించిన నక్కవిగంధసింధురంబునకుఁ బ్రవిమలముక్తాఫలాతపత్రాం
దోళికాంగద పదక పదకటక హారాగ్రహార కర్పూర గంధసారాది
కంబులు తోరహత్తుగా మెచ్చియిచ్చిన నారాజన్యపర్జన్యు నఖర్వ
సర్వజ్ఞతయుం దదంతికంబున దద్దయున్ విద్దెల మేలెరింగి, పరోప
కారం బహారంబు హారంబుగాఁ బొగడుచుఁ బొగడు వడయు సుధీ
మండలేశ్వరుల నిండు గుణంబును జూచి సూత్రధారుండు వెండియు
హర్షించి, ౮౦

గీ. వీరిఁ జేరంగఁబోయి నా విద్యఁ జూడుఁ
డనుచు నెంతయుఁ బ్రార్థింతునని తలంచి
యేల ప్రార్థింప నాకు నే విందె పోయి
సాక్షి చెప్పెడు గతి నిది జాడగాదు. ౮౧

క. వలను గలవార లాకృతి
వలననె యూహింతు రిట్టివారల తలఁపుల్
దల వలితంబగు గేదఁగి
యలరుం సౌరభము చేత నలు లెరుఁగు క్రియన్ ౮౨

వ అని వీక్షించి, హర్షించి యిది నిశ్చయం బేతన్నిమిత్తంబ తత్సభాంత
రంబున నుండి రంగతరంగుండు వచ్చుచున్నవాఁ డను సమయంబున
నా నటుండు ప్రవేశించి, ౮౩

గీ. భావ విను మన్ముఖంబునఁ బారిషదులు
నిన్ను నిట్టుల పలుకుచు నున్నవార

లరసి యేదేని యో భరతాధిరాజ
యనవు డనుచిత మనుచిత మనుచు నపుడు. ౩౪

గీ. శ్రుతులు మూయుచుఁ బలుకు నా సూత్రధారుఁ
డైన గానిమ్ము వలయుఁ గార్యంబు వినఁగ
ననగ శైలూషుఁ డనుచితం బనుచితంబ
టంచుఁ బలికితి మే తెరింగించుమనుడు. ౩౫

క తన కంటెఁ బెద్దవాఁడగు
ఘనుఁ డుండగ రాజపదము [1] గైకొనఁదగునే
మన పిన్నవానికిన్ గని
కని యనుచిత మింత కన్నఁ గలదే జగతిన్. ౩౬

గీ ఆ మదగ్రజుఁడగు గుణారామనాముఁ
డర్హుఁ డీ రాజపదమున కనఘ యేను
భరతమాత్రంబ నావు దేర్పరపు మతని
గుణము లెట్టివి యే వినఁగోరినాడ ౩౭

గీ అనవు డుత్తర మిచ్చె నీ కతని పేరె
నావు డామాటకు [నతండు] నవ్వి యోయి
పేరిచే నెట్లు గుణముల పెంపు దెలియ
వచ్చు నావిని శైలూషవరుని జూచి. ౩౮

వ. సూత్రధారుం డిట్లనియె. ౩౯

క. సరసశ్రీఖండసుధా
కర రత్నాకర సువర్ణగణము గతిఁ జా స
త్పురుషశ్రేణియుఁ బేరఁ జా
దిరముగ నుత్తమగుణాళిఁ దెలుపుచు నుండుఁ జా. ౪౦

---

1 గైకొని తగునే.

వ. అని మరియును ౯౧

క కేవలము పేరుచేతనె
భావింపఁగ నెట్లు వచ్చు ప్రాజ్ఞులు గుణముల్
భావా యని శంకింపకు
మీ వినుమెరిఁగింతు నీకు నింతయుఁ దెలియన్. ౯౨

క. మునుపు రతిజనకుఁ డనియెడు
జనపాలకమౌళి మెచ్చ సభలోపల నే
ర్పున హరచాపారోపణ
మను నాటక మభినయించి యాతనిచేతన్. ౯౩

గీ. అవనిఁ దన పెంపు పరిపూర్ణ మగుచునుండ
బహుముఖానందవర్ధనప్రౌఢి చూపు
రంగవిద్యాధరఖ్యాతి రాజహంస
గమనఁ జేకొన్నక్రియఁ బరిగ్రహ మొనర్చె. ౯౪

వ అనిన నటుండు సూత్రధారుం జూచి యిట్లనియె ౯౫

సీ. ఇపుడా గుణారాముఁ డెచ్చో(ట) నున్నవాఁ
డనవు డీ నామధేయంబు మొదల
తనదిగాక యటంచు దాక్షిణాత్యుండైన
యొక ధూర్తనటుఁడు తా నోర్వలేక
రంగవిద్యాధరప్రఖ్యాతి నపహరిం
చిన వార్త విని యాత్మఁ గినుక వొడమ
నరిగినాఁడా దక్షిణాశాంతరమున కే
వింటి నేఁడొక వార్త వీను లలర
గీ. నొక సుకంఠాభిధానగాయకునితోడఁ
జెలిమి యొనరించి దక్షిణక్షితిపసంస
దంతరంబున నలవాని నాక్రమించి
రంగసంగరకేళిఁ దొడంగె ననుచు. ౯౬

వ. అనిన నటుం డిది యహో మహోపక్రమంబుగదా యనిన సూత్రధారుం
డిది యుచితంబ యగు నెట్లంటేని ౯౭

గీ. చంద్రికాహాసపూర్ణిమాచంద్రవదనఁ
బిసలతాహస్త నవదాతబిసరుహాక్షిఁ
గీర్తిభామిని హరియించు క్రించునకును
వసుధ నూహింప నలుగనివాఁడు గలఁడె. ౯౮

వ. అని ౯౯

క. ఈ కళ నాచారింపం
గా వలసిన కర్జమేది కడు తడవయ్యెన్
నీ విచ్చటి కేతెంచియు
నా విని యా సూత్రధారు నతఁ డిట్లనియెన్ ౧౦౦

గీ. [1]ప్రతిరసంబును నిఖిలాంకపంక్తి నెగడ
నలినరాజి వినూత్నబంధంబు నెలఁగ
ఘటితవక్రత శశిరేఖకరణి రమ్య
మగుచు నుతికెక్క నాటకం బద్భుతముగ. ౧౦౧

క. నీ విప్పు డభినయింపం
గా వినియెద మనుచుఁ గౌతుకము డెందములన్
దీవలుసాగ ససంభ్రమము
లై వీక్షించెదరు వారె యల సభవారల్. ౧౦౨

క. అన విని యెయ్యది యొక్కో
వినుతింపఁగ నర్హమనుచు విశదంబుగఁ జిం
తనచేసి యహహ చేఁబోది
విన మణి నడువీధి వెదకు వీరఁడిపోలెన్. ౧౦౩

1. ప్రఖరసంబులు

క. సకలవిశేషణములచేఁ
ప్రకటంబగు నీ ప్రసన్నరాఘవ మను నా
టకము నికటమున నుండగ
నకటా యెయ్యదియొ తగినదంటిఁ గంటే. ౧౦౪

వ అనిన శైలూషుండు[1] ప్రతిరసంబును నిఖిలాంక పంక్తి నన్న పద్యంబు పరియించి హర్షించి ౧౦౫

చ. కవికుముదాటవీచటులకౌముదియైన సరస్వతీప్రసా
దవిభవ మెన్నఁగాఁదరమె దానన యుద్భవమయ్యెఁగాదె స
త్కవులకు నీ కవిత్వసముదారసుధోద్గిరణంబు పాలవె
ల్లివలన నుద్భవంబుఁగనురేఖ రసాయనధార కైవడిఁ. ౧౦౬

క అనుటయు నా శైలూషున
కను నయ్యెడ సూత్రధారుఁడది యట్టిద యీ
యనువున నేతత్కవియును
వినుతించినవాఁడు వాణి వినుమెట్లన్నఁ ౧౦౭

ఉ. నీ పదపద్మరేణువు మనీషిజనంబులచే మనోమహీ
స్థాపితమై మనోజ్ఞకవితాలతగాఁగఁ దదుక్తిపల్లవం
బో పికవాణి వాణి ప్రియమొప్పఁగ నీవునుఁ దాల్తుగా శిర
శ్చాపలనిర్గతామరకుజప్రసవంబగు నీ శ్రవంబునఁ. ౧౦౮

ఉ నా కల చిత్తమంతయు సనాతనసత్కవిధాతయైన వా
ల్మీకులయంద డిందినది మెచ్చుగ గచ్చున దోమినట్టు ల
వ్యాకులలీల వాణియను హంసి తదేకముఖాంబుజస్థితిఁ
గైకొనుఁగా విధాతృముఖకంజచతుష్టయకేళికల్పనఁ. ౧౦౯

వ అని నుడికారంబునఁ గడుఁ బటుండగు నటుం డది యట్టిదయగుం ద్రిభువనాభోగంబున నాకుభవు వాగ్విభవం బభిరామంబగుఁగదా యని మరియును ౧౧౦

---

1 ప్రతిరసంబులు

మ. కవిమేఘావళి యే మహాత్ము వదనగ్లౌమండలీనిర్గళ
న్నవకావ్యామృతవార్ధి నింతరుచిఁ గానంజాలి యాకల్పముం
భువి వర్షించెడు నట్టి నాకుభవుఁడొప్పుం రాఘవాధీశకీ
ర్తివధూనర్తనరంగమాంగళికవాదిత్రాదిమారావమై ౧౧౧

క. ఏ రాము కీర్తి చంద్రిక
నా ఋషి కావ్యామృతాబ్ధి యలరందెడు నా
కా రామచంద్రునందుఁ జ
కోరికయై చిత్తవృత్తి కోరికఁ బెనుచుం. ౧౧౨

వ. అనిన నది యవ్విధంబగునని సూత్రధారుండు. ౧౧౩

ఆ. వె. మేచకాంబుజాతమిత్రకాంతిఁ జెలంగు
చంద్రునందు రామచంద్రునందు
నంబుజాక్షి సితకటాక్షాంచలమునందు
నాను హృదయ మెట్టివానికేని. ౧౧౪

వ. అని మరియును. ౧౧౫

చ. ఉరవడి బ్రహ్మలోకముననుండి మహీస్థలి కేగుదెంచు నా
సరసిజగర్భురాణికిఁ బ్రశాంతి వహించునె మార్గఖేదని
ర్భరపరిభూతి పంక్తిముఖభంజనమంజుకథాసుధాధునీ
తరళతరంగమాలికలఁ దా నవగాహము సేయకుండినన్. ౧౧౬

వ. అనుటయు. ౧౧౭

ఆ. వె. నటుఁడు సూత్రధారునకు నుత్తరం బిచ్చు
నేమి కారణంబు భూమిఁ గలుగు
కవివరేణ్యులెల్ల కౌసలేయునిఁ గొని
యాడుచున్నవార లనిన నటఁడు ౧౧౮

చ. ఇతరగుణాభిలోభనముపేతములుంబలె సద్గుణంబు లీ
క్షితిఁగల యంతవట్టు రఘుసింహమునంద వసించియుండఁగా

నితని నిజోక్తిగుంభముల నెల్లఁగఁ జేయు మహాకవీంద్ర సం
తతులకు నేమి దోసము గొనంబుల దోసముగాక సర్వముఁ ౧౧౯

చ. చిరసుకృతంబు విత్తనము శేముషి నూతనకందళంబు స
ద్వరపరిచర్య కాండ మనవద్యములై తగు భవ్యకావ్యముల్
తరుణపలాశముల్ సులపితంబులు పువ్వులునౌ కవిత్వపుం
దరువు రఘూద్వహోత్తమకథాఫలహీనత గొడ్డువోజుమీ. ౧౨౦

వ. అనిన నటుండు పూర్వంబున నేతత్కృతి నిర్మాతయగు నాతం డెవరో
యనిన సూత్రధారుండు సప్రణయకోపంబుగా నిట్లనియె. ౧౨౧

మ వినవా యోయి కవీంద్రమస్తమకుటీవిన్యస్తహీరీభవ
ద్వినుతఖ్యాతిపరిష్కృతాఖిలు మహాదేవోద్భవున్ భామినీ
జనతామ్రాధరమాధురీనవసుధాసామ్రాజ్యదీక్షాకళా
ఖనిసూక్తిన్ జయదేవసత్కవివరున్ గౌండిన్యమున్యన్వయున్ ౧౨౨

గీ శాంతమతియైన యీ సుమిత్రాతనూజు
మానసేందిందిరంబు లక్ష్మణునకుఁ బలె
శ్రీమదఖిలైకపావననామరామ
చరణసరసీరుహంబుల మరగి తిరుగు. ౧౨౩

క నావిని శైలూషుం డే
నీ వేళన్ జంద్రచరిత మెరుఁగని జీవం
జీవముగతి వెడఁగైతిఁ
గావున నను దూరఁ దగవెకా యెటు లనినఁ ౧౨౪

క. తనకృతి జయదేవుఁడు నా
కు నొసఁగి సూక్తులు హరించఁగొనఁ జూతురు దు
ర్జనులగు ప్రముచ్చులు పదిలం
బనవుడు వినయంబెసంగ నతనికి నంటిన్. ౧౨౫

చ. చెవిఁ గదియించి కంఠమునఁ జేర్చి శిరంబున నిల్పి యక్కునన్
దవులఁగఁ జేసి హస్తమునఁ దాల్చి(యు) మ్రుచ్చులచేత గుంభనం
బవియక యుండనీదగు ననర్ఘ్యవినూతనసూక్తిశుక్తిసం
భవమణిపంక్తి నేమరక పాలన మే నొనరింతు నెప్పుడున్. ౧౨౬

వ అనిన సూత్రధారుం డీ కవిమకుటహీరకోరకంబున కీ యశీకకాతరత్వం
బేల తన సూక్తిమౌక్తికహారంబు నపహరించు క్రించున కెయ్యది
సుఖం బెట్లనిన ౧౨౭

గీ. మహితశుభవృత్తి సూక్తి సంపదలు గల్గు
పరుని కృతినైన సతినైనఁ బ్రాలుమాలి
యపహరించినఁ [1]దలఁబోకడంబు రాశి
సొచ్చియైనను గాంచునే సుఖ మొకింత ౧౨౮

వ. నావుడు ౧౨౯

చ. నటుఁ డనియెన్ బ్రమాణనిపుణత్వము నీతనియందె కల్గు ను
త్కటముగ నంచు విందుము సుధాకరభాస్కరపంక్తులెల్ల నా
దటఁ గవగూడెనాఁగ కవితాపటుతార్కికతామిథోభిసం
ఘటన వహించు నీ సుకవిఁ గన్గొని యద్భుతమయ్యె నావుడున్.౧౩౦

వ. సూత్రధారుం డిది యేమి యద్భుతంబు వినుము. ౧౩౧

మ. భువి నెవ్వారలు నవ్యకావ్యకలనాభూషారతిన్ భారతిన్
దవులన్నేర్తురు వారి చేతన యగున్ తర్కాతి వక్రోక్తులున్
నవలాగుబ్బలు లీల గోరుమొనల న్నాటింపఁగా నేర్చువా
రు విదారింపరె కుంభికుంభయుగళిన్ గ్రొవ్వాడి వాలంబులన్. ౧౩౨

చ. అన విని సూత్రధారునకు నానటుఁ డిట్లను నీ సమస్త స
జ్జనులకు శ్రోత్రపర్వముగ సారతరోక్తులచేఁ గవిత్వముల్
గొనకొని చెప్ప నేర్పరులు గోరెదరే జయదేవు కావ్యముల్
విన ననఁ గోరకేమియని వేడుకతో నను నాతఁ డాతనిన్. ౧౩౩

---

1 తలబోక

వ. ఈ జయదేవుం డేతన్నిమిత్తంబున రచియించిన హృద్యపద్యంబు గలదు వినుము. ౧౩౪

చ సరసనిజోక్తులన్ గరము సంతసమందియు మెత్తు రాత్మలన్
బరఫణితి ప్ర(కార)ములు పండితవర్యులు కొందరెట్లనన్
బరువపుఁ బువ్వుదేనె తన పా దఖిలంబును నిండియుండఁగాఁ
గరకలశాంబుధార సహకారము గోరదె వాడుఁదేఁరదే ౧౩౫

క. అన విని నటుఁడీ కవి వా
క్కునఁ దోచున్ సరసతయును గోమలతయుఁ జం
ద్రుని లేఁత కొదమ నమృతము
దనుపును దెలికించు క్రియ (మి)ధస్థితి ననుడున్ ౧౩౬

క. రమణీ తన నును చనుంగవ
గొమరారెడు బొమలగతి[ని] [1]కుటిలత్వంబుల్
సమకూడియుఁ దగుగతిఁ జే
య మనఃప్రియ మతని సూక్తియగు నీ రెంటన్. ౧౩౭

వ అనిన నటుండు కరినతావక్రతలు కుకవిత్వంబున నొక్కొక్కకడ నెడరు నేనియు లెస్సయగునే యనుటయు సూత్రధారుం డిట్లనియె. ౧౩౮

చ ఇలఁ గవివాగరాళతయు నింతుల చూపుల వంకవంకలున్
మలసి వివేకహీనుఁడగు మందుఁడు నింద యొనర్ప నేమగున్
దెలిసినవాఁ డొకానొక సుధీమణి (గల్గిన) నెత్తుకోడె యా
చలిమలయల్లురేఁ డలఁతి జాబిలి నౌదలఁ దాల్చుకై వడిన్. ౧౩౯

వ. అని మరియును ౧౪౦

మ. కలశాంభోధిపయఃప్రపూరముల నాకంఠంబుగాఁ గ్రోలుచున్
జలదశ్రేణులు పల్గురాలవయి నక్షత్రాభవర్షోపలం
బుల వర్షింప క్షణంబులో నవి సుధాపూరంబులౌ మాడ్కిఁ బ్రా
జ్ఞుల సూక్తుల్ కరినాకృతిన్ దొరలియున్ జుమ్మల్ వివేకించినన్.

1 నకుటిలకత్వంబుల్

క. నావుడు నటుఁ డిటులను జయ
దేవుని నెమ్మనము హర్షతిలకితముసుమీ
ఏవంవిధోక్తు లమృత
స్రావసరసశీతలప్రచారిణు లగుటన్. ౧౪౨

గీ. సరసశీతలమగు సుధాకరుని మేన
నమృతధారాప్రవాహంబు లడరుకరణిఁ
బ్రమదకౌతుకమేదురభావవీథిఁ
గవుల కుదయించుఁ గమ్మని కావ్యకళలు. ౧౪౩

వ. అనిన సూత్రధారుం డిది యుచితంబయగు నెట్లంటేని. ౧౪౪

సీ. ఏ లాలితాకార కాళిదాసవిలాస
చెలువ యెయ్యది చోర చికుర నికుర
ఏ సాంకవామోద భాసకోమలహాస
కాంత యెద్ది మయూరకర్ణపూర
ఏ మంజులాలాప భామహశ్రీమహా
భామ యయ్యేది శివభద్ర భద్ర
ఏ మానినీమౌళి క్షేమేంద్రముఖచంద్ర
యలరుఁబోఁ డెద్ది శ్రీ హర్ష హర్ష

గీ. ప్రమద యెయ్యది బాణ హృత్పంచబాణ
గజగమన యెద్ది భవభూతి కాంతిభూతి
యట్టి యీ కవితారవిందాక్షి యేరి
సొగయఁ జేయదు చెప్పుమా జగతియందు. ౧౪౫

మ భువి లోకోత్తరుఁడైన భర్తకుఁ బ్రియంబుల్ మీరఁగా నిచ్చు స
త్కవితాకన్య సుపుత్రియుం బలె కవీంద్రశ్రేణికిన్ మానసో
త్సవమున్ జేయును చేయఁగాఁ గలవె యా చందంబునన్ లోకసం
స్తవనీయంబగు బ్రహ్మవిద్యయును రాజ్యశ్రీయు వేయేనియున్. ౧౪౬

క అను నెడ నేపథ్యాంతర
మున నోయి కుశీలవప్రముఖ మేలు భళీ
యను మాటలు వినవచ్చినఁ
గని దాల్భ్యాయనుఁడు వచ్చెఁగద యన నటుఁడున్. ౧౪౭

ఆ. వె. సూత్రధార యితఁడు శూద్రసంసృష్టికిఁ
దగడు బ్రహ్మతుల్యుఁ డగుచు వెలయు
యాజ్ఞ వల్క్య శిష్యుఁ డటుగాన మన మిందు
నిలువ వలవదనుచుఁ దొలఁగి చనిరి ౧౪౮

## ఇది ప్రస్తావన

క. తదనంతరంబ వచ్చెన్
విదితపురాణేతిహాసవిద్యాచతురుం
డుదితార్క సన్నిభుఁడు జిత
మదనుఁడు దాల్భ్యాయనుండు మది ముదమొదవన్. ౧౪౯

వ. ఇట్లు ప్రవేశించి. ౧౫౦

క కని లోకోత్తరునకు ని
చ్చిన కవిత సుపుత్రివోలెఁ జేతోమోదం
బొనరించు బ్రహ్మవిద్యయు
ఘనరాజశ్రీయుఁ జేయఁగలవే యటులన్ ౧౫౧

వ అను పద్యంబు పఠియించి యిది యిట్టిద యగునని ౧౫౨

చ. పురుషవరేణ్యుఁడౌ జనకభూపతియున్ భువనాభిరాముఁడౌ
వరునకుఁ గూతు నిత్తునని వారని కోరిక సందడింప మ
ద్గురుకథితాత్మవిద్యఁ గల యూర్మియు రాజ్యరమావిభూతిపై
మరులును నోసరించె నిఁక మానవమాత్రులఁ జెప్ప నేటికిన్. ౧౫౩

వ. అని యా సమయమ్మున ఘుమ్మని యొక నినదంబు వినవచ్చిన

నాలకించి కించిత్ప్రోన్నమితైకభ్రూదళాంచలంబుగా నాకసం బోరవారం
గనుంగొని ౧౩౪

క. ఇది యెట్టుర గగనంబున
విదితంబయ్యెన్ బ్రవీణవీణాధ్వని నా
రదముని రాఁబోలుఁ బ్రియం
బొదవ మదాచార్యుఁ బరమయోగీంద్రుఁ గనన్ ౧౩౫

క. అని వెండియుఁ దేటపడన్
గనుఁగొని మోసంబు వచ్చె గౌరవసామ్యం
బున నీ నినదము మహతీ
జనితక్వాణంబు గాదు చదలెం బొదలన్ ౧౩౬

క తుమ్మెదలు మ్రోయుచున్నవి
ఝుమ్మని యివె రెండు కుసుమసాయకు జయగీ
తమ్ములు వాడెడు గతి
నమ్మాధురి [1]చెవులఁగ్రోలి సాశ్చర్యుండై. ౧౩౭

గీ. ఏమి చెప్పంగ మద్గురుస్వామి మహిమ
తిర్యగాలాపములు నాకు తెలియఁజేసె
నిప్పు డీ గండుతుమ్మెద లేమి మాట
లాడుకొనియెడునో వింద ననుచు వేడ్క. ౧౩౮

వ. చెవియొగ్గియున్న యవసరంబున నయ్యిందిందిరద్వయమునందు. ౧౩౯

క. చెలికాఁడ కలాలాపక
వలయుఁ దెలియ నెచటినుండి వచ్చితివనినన్
నెలతాల్పు మకుటనది కలు
వలనుండి మధుప్రియుండ వచ్చితి నిటకున్. ౧౬౦

---

1 చవుల

వ అని యవి యొండొంటికి నిచ్చు నుత్తరప్రత్యుత్తరంబులకు దాల్వ్వి
యనుం డలరి వానింగల వచనచతురతయు నుచితనామధేయతయు
నహో బళీయని యభినందించి వెండియుఁ జెవిఁదార్చునెడ మధుప్రియుం
డా ఖండపరశుదండ నెద్దియేనియుం గ్రొత్త వృత్తాంతంబు గలదే యనినఁ
గలాలాపకుం డుచితప్రవృత్తంబగు నొండు వృత్తాంతంబు గలదు
వినుము. ౧౬౧

చ. బలిదనుజేంద్రనందనుఁడు బాణుఁడు శాసితపంచబాణు ని
ర్దళితపురామరారిహరిఁ దామరదండలఁ బూజనేసి యో :
జ్వలనమయాక్ష మామకభుజాకుజముల్ ఫలియింప నెత్తెదన్
గలదె భవన్నగేంద్రమున కంటె బలమ్మగు సొమ్ము నావుడున్ ౧౬౨

గీ. మిడికి పురములు మూఁడును మిడుతలయ్యెఁ
గడిమి [1]నెద్దేని జనియించు కాండవహ్ని
నట్టి నాదివ్యమైన బాణాసనంబు
జనకు చేరిక నున్న దీ జగతియందు. ౧౬౩

క. అని యాచంద్రకళామం
డనుఁ డతనికి నానతిచ్చుటయు వచ్చితి నే
పనివడి యివ్విలుఁ జూడఁగ
ననఘా నీవెందునుండి యరుదెంచితనన్ ౧౬౪

గీ నందనారామమునునుండి నాదు రాక
యనవు డచ్చోటఁ గ్రొత్తలేమైనఁ గలవె
కలవు రావణదూత యొక్కరుఁడ వచ్చి
తద్వనీరక్షకులఁ జూచి దర్పమెసఁగ. ౧౬౫

క రావణుఁడు శాంభవార్చనఁ
గావింపకమున్న యోరి కల్పకసుమముల్

1. గడిమి యద్దేని

కావరమునఁ గోసితి రిఁక
జీవింతురులే యటంచు సిలుగులఁ బెట్టన్. ౧౬౬

క వనపాలకు లెదవడి మముఁ
గినియక యీ తప్పుఁగావు గీర్వాణవరుల్
జనకతనయాస్వయంవర
మున కేగుచుఁ దమ విమానములు గై సేయన్. ౧౬౭

క. ఈ సుమములు గొని చనిరన
నా సుద్ది దశాననునకు నతఁడు గరముగాఁ
జేసెదనని చన వచ్చితి
నీ సౌభాగ్యంబుఁ జూడ నే నిచ్చటికిన్. ౧౬౮

క. అను మాటలు విను దాల్భ్య
యనముని సవిషాదుఁడగుచు నకటకటా యే
మనవచ్చు నిది యనర్థం
బునకున్ బీజంబు నిక్కముగ నెట్లన్నన్ ౧౬౯

గీ. వర(లు నా) జానకీస్వయంవరమహోత్స
వప్రసంగంబు బాణరావణుల చెవుల
సోకె నేతన్నిమిత్తమై వీఁక వారు
పోరిరేనియు మాన్ప నెవ్వారి తరము ౧౭౦

వ. అని దాల్భ్యయనుండు తన మనంబు మగుడం దిగిచికొని నాకు నియ్యశీకకాతరత్వం బేల భ్రమరోదితంబులు భ్రమారోపితంబులై సంభవించునని నివారించి వీనియందు భ్రమరసంభావనయుఁ గలుగ దది యెట్లంచేని. ౧౭౧

క. మందారామందసుమ
స్యందిమరందప్రవాహసుమమాధురిచేఁ

బొందుపడఁ బాడుచున్నవి
వంఘలవలె నిప్పు డివి యవారితలీలన్. ౧౭౨

మ అన నేపథ్యములోన నోయి మునినాథా మేలు నీ తెల్వి చ
క్కన నిక్కంబుగ నేము వందులము వేడ్కన్ విందులై వచ్చి నిం
డిన యీ రాజుల సీరకేతనుఁడు రూఢి న్వర్ణనల్సేయ మ
మ్మనుపన్ వచ్చినవార మిచ్చటికి నా నాశ్చర్యమున్ జెందుచున్. ౧౭౩

గీ. అనియె దాల్భ్యయనుండు నే నలులఁ గూర్చి
వందులో కాక యనుమాట [1]బిందువోక
యిపుడు నిజమయ్యె నౌరౌర యిట్టి చంద
మరసి చూడ ఘుణాక్షరన్యాయసరణి ౧౭౪

క ఈ మధుకరవృత్తాంతము
వే మామకదేశికునకు వినిపించెద నే
నామూలాగ్రముగా నని
యా మునిముఖ్యుండు చనియె ననుమోదమునన్ ౧౭౫

ఇది విష్కంభము

క ఆ తరువాతఁ బ్రవేశం
బై తనరెడు మాగధద్వయంబున సుగుణా
న్వితుఁడు నూపురకుఁడు వి
ఖ్యాతిన్ మంజీరకునిఁ బ్రియంబునఁ బలుకున్. ౧౭౬

సీ. అంగజాహితశైలశృంగాగ్రములఁ బోల్చు
ప్రసవితకర్ణికారము లనంగ
భాసురస్ఫాటికప్రాసాదవలభిరే
ఖల నించు పసిఁడి సింగము లనంగ

1. బిందుబోక

నుద్దండపుండరీకోపరిస్థలముల
నవతారమొందిన యజు లనంగ
స్నిగ్ధదుగ్ధాబ్ధివీచికలలోఁ గనుపట్టు
లలితోదితేందుమండలము లనఁగ

గీ. రాజభానూపమానవిరాజమాన
దంతిదంతశలాకావితానవిరచి
తాంచ దురుమంచికలఁ గుంకుమాంగరాగ
కలితులై యొప్పెదరు కంటె కంటె నృపుల. ౧౭౭

వ. [1]అన మంజీరకుం డోయి నూపురక యిటు చూడుమని. ౧౭౮

క చెలఁగెడు తమతమ దిక్కుల
నిలిచిన నృపవరులచేత నిబిడంబగు [2]మ
చ్చుల బవరి సీత పెండ్లికిఁ
దెలియఁగ ధనువెత్తి కదియు [3]దిగ్వలయమనన్. ౧౭౯

క నటుఁ డాడింపఁగ నాడెడు
పటుగతి నొక బొమ్మ మంచభాగమున మహా
నటచాపారోపణగతి
విటి యగు నీ నృపుల చిత్తవృత్తియుఁ బోలెన్ ౧౮౦

వ అన నూపురకుండు మంజీరకునితో నిట్లనియె. ౧౮౧

గీ మహితసీతావధూకరగ్రహణవాస
నావసంతరమాస్ఫూర్తి ననిచినట్టి
పులకకళికలఁ దగు నాత్మభుజరసాల
శాఖలీక్షించు సీతఁ డే జనవిభుండు ౧౮౨

వ. అనవుడు. ౧౮౩

---

1 అని 2 మచ్చులబవలి 3 దిగ్వలయమునన్

క. అతులయశఃపరిమళమో
దితచారణచంచరీకధీరస్వనఘూ
ర్ణితదిక్తటికుంతల కా
యత భూషణ మితఁడు మల్లికాపీడుఁ డిలన్. ౧౮౪

క దూరోత్సారితకంకణ
వారస్ఫుటమౌర్వికావివర్ధితకిణముల్
సారెకుఁ గనుఁగొనియెడు మం
జీరక యీరాజు నెరుఁగఁ జెప్పుము నాకున్. ౧౮౫

గీ భాసురాత్మప్రతాపప్రభాంతరంగ
పింజరితదిఙ్ముఖుండు కుబేరదిగ్వి
లాసినీఫాలభాగవిలాసలోలుఁ
డితఁడు కాశ్మీరతిలకమహీవిభుండు. ౧౮౬

గీ అను దనూనప్రతాపార్కజననమహిమ
నుదయధరకూటమునకుఁ బెన్నుద్ది యగుచుఁ
దనరు దక్షిణనిజభుజాదండమెత్తు
నిమ్మహీపాలశేఖరుం డెవ్వరొక్కొ. ౧౮౭

వ అనిన విని మంజీరకుండు ౧౮౮

క అలఘుప్రతాపశోభాం
చలచయపింజరితమలయశైలనితంబ
స్థలకాంచీమండనమై
మలయు నితం డెపుడు వీరమాణిక్యమనన్. ౧౮౯

వ అనిన నూపురకుండు ౧౯౦

గీ. రభసవికసితపులకాంకురములఁ బొదలు
గండతలమున నటియించు కుండలంబుఁ

జిక్కఁ దిద్దెడు నెపమున శంభుచాప
మంతఁ దెగవావఁ జింతించు నతనిఁ దెలుపు. ౧౯౧

వ. అనవుడు ౧౯౨

క. ఈతఁడు గాడా వినుత
క్ష్మాతలతతి విషమసమరసాగరమకరం
బై తనరు మత్స్యరాజు (పు)
రాతన (మత్స్యం బదీడు) ప్రతిభాశక్తిన్ ౧౯౩

క. నవహిమజలయుతమలయజ
ధవళితనిజభుజవిడంబితఫణీశ్వరుఁడై
భ(వ)కోదండవు దిరిసెపుఁ
బువు సముఁడితఁ డే నృపాలపుంగవుఁ డనఘా. ౧౯౪

వ. అనిన మంజీరకుం డిట్లనియె. ౧౯౫

ఉ. ఈతఁడు సింధురాజు నిజహేతివిజృంభణకాలకూటవి
ఖ్యాతియుఁ గీర్తి శీతరుచిగౌరవమున్ గుణరత్నవైభవ
ద్యోతితయున్ గభీరిమయుఁ దుంగభుజాయతభంగభంగియున్
నూతన మౌక్తికావళి మనోహరమూర్తియుఁ దాల్చు నిచ్చలున్. ౧౯౬

వ. అని యివ్విధంబున సీతాస్వయంవరోత్సవ కౌతుకంబున నేతెంచిన భూతలేశ్వరులం బ్రత్యేకంబ నూపురకుం డడిగినన్ జెప్పి మంజీరకుం డింకంజాలు రాజవర్ణనావిస్తారంబు, ప్రస్తుతకార్యం బుపక్రమింప వలయునని పరిక్రమించి సాటోపంబుగా నున్నతస్వరంబున రాజ సమాజంబునుం గూర్చి యిట్లనియె. ౧౯౭

మ. కరిదైత్యాంతకు వింటినారిచెవిసోకన్ [1]జాఁపగాఁజాలు నీ
ధరణీనాయకులందునెవ్వఁ డతనిన్ దాఁజేరి శింజాన క
ర్బురకాంచీలతికాపరీవృత [ఘన] శ్రోణీభరఖ్యాత సీ
తరసాజాత చెలంగఁజేయునెపుడున్ దత్కర్ణనేత్రంబులన్. ౧౯౮

---

1. చాప

వ అని మరియు సకౌతుకంబుగా నిట్లనియె. ౧౯౯

చ. గమిచి పురారి విల్దివియు కాంక్ష జనించిన రోమసంచయో
ద్గమమున బాహుతుందిలతఁ గ్రందుకొనన్ మహిజాకరగ్రహ
ప్రమదభరంబుచే మన సపారముగా నిపుడీ నృపాలకుల్
తిమురు తెరంగు నూపురక తేరకొనన్ గనుఁగొంటి నెల్లెడన్ ౨౦౦

వ మరియును ౨౦౧

గీ. చూడు(సమ)సమయముఁ గని(క్షోణి)విభులు
లేపుచున్నారు గండపాళీవిలోల
కుండలశ్రేణు లురక యొండొండ [1]రాచి
జాళువ పసిఁడి పొడుల వసంతమాడ. ౨౦౨

వ. అన విని నూపురకుం డిట్లనియె. ౨౦౩

ఉ. సారెకుసారెకున్ మిగుల సందడి రా[యుచు]నున్న యమ్మహా
వీరుల భూషణాళిఁ బ్రభవించిన మించిన కాంచనాణువు
ల్వారక యుల్లసిల్లెడు దళం[బు]గ నేతదురుప్రతాపవి
స్మేరశిఖాస్ఫులింగముల చెన్నున మిన్నున వన్నె వ్రాయుచున్ ౨౦౪

గీ. అనిన మంజీరకుఁడు మందహాసధవళ
తరకపోలంబుగాఁ బల్కెఁ దనదు సఖుని
పూఁపు చక్కనగాని యీ భూపతులకుఁ
జోటు చక్కనగా దిందుజూటు వింట. ౨౦౫

ఉ భావము పల్లవింపఁ గడుభక్తియ చూపిరి శక్తిలేదు సం
భావన జే(సి) ర(జ్జను)లు పాణిఘటింపరు ముష్టిముద్ర యి
స్సీ వదనంబె వంచి రిదె సిగ్గరి భర్గుని విల్లు వంప రీ
భూవరసూనులెల్ల మగపుట్టునఁ బుట్టరె ప్రోలు ముట్టరే. ౨౦౬

1. రాసి

వ. నావుడు ౨౦౬

క. నూపురకుఁడు మంజీరక
భూపాలుర సంభ్రమంబుఁ బోల్ప మొదలనే
తీపు తుదఁ జప్పనగు మరు
చాపముగతి ననుడు నతఁడు సవిషాదుండై. ౨౦౭

చ. అనుగుణ నీ నృపాలవరు లందరు దీవులనుండి వచ్చి రీ
ఘనకలధౌతకాంతిగల కన్యయుఁ గీర్తియుఁ జూడ లాభదా
యిను లొరుచేతనేని యిపుడీ విలుదీ[వియ యెత్త]వంప నొం
డునికి ఘటింపఁగాఁబడదహో మహి శూరవిదూరయయ్యెనో. ౨౦౮

వ. అనునెడఁ దెరమరుంగున ౨౧౦

క. పనివడి యెవ్వఁడురా యీ
వినగాములు వలుకు వంది విలు మోపెడునం
దునకు నిల శూరదూరయె
యని బెట్టిద మగుచు వినగనగు మాటలకున్ ౨౧౧

క. అచ్చెరుపడి నూపురకుఁడు
నెచ్చెలి గుంద్రాలకొండ నెట్రవుఁ ద్రోవన్
వచ్చు పెనుబండి మ్రోఁతకు
నెచ్చగు నీ కంఠరావ మెవ్వనియదియో ౨౧౨

చ. అన విని నాకునుం దెలియ దారసి చూచితి మంతనంబులన్
గాని పనియేమి।వానికడకుం జన నన్నియుఁ దేటతెల్లమౌ
నని కదియంగఁబోయి నిఖిలాశలు నేఁ జరియించినాడనో
యి నిను [1]గనుంగొన న్నెచట నెన్నఁడు నెవ్వఁడవోయి నావుడున్.

క. ఆ పురుషుఁడు సంభ్రమమున
రూపైయటు సంచలించి రోషంబున నో

1. గనుగొనం బెచట

రీ పర(వందీ) కతిపయ
గోపాలగ్రామచరణకుంఠితబుద్ధీ. ౨౧౪

క నను దశయని వెలిగ్రక్కుచు
మనమునఁ దలపోసి మిగుల మరుఁగిడఁ దగు నీ
తని పేరటు వచి(యి)ంపఁగ
మొనసితి నగుగాక యిదియ మొదల నిలిపెదఁన్. ౨౧౫

చ. నను దశదిక్ప్రయోజవదనాశ్రవణశ్రవణావతంసకీ
ర్తినిశి(త)మండలాగ్రముఖ[1]కృత్తకరోర[2]మదారిపంక్తికం
రు నిఖిలవీరశేఖరుఁ గడుంగడు కూపముకప్ప వార్ధిరా
జునుఁబలె నప్రసిద్ధునిగఁజూచితి వందులకేమి మాగధా. ౨౧౬

క పిడికిట నడఁగెడు నడుములు
గుడిగొను చెలువముల నొప్పు కొప్పులు చెవి సోఁ
కెడు గుణములుగల కన్యా
మృడధన్వప్రతతులెవ్వి యెరిఁగింపుమనన్ ౨౧౭

గీ. సెలవి నగ వామతింప మంజీరకుండు
చాప మిదె చూడు మంతక యోపితేని
కన్యఁ దరువాతఁ జూచెదుగాని యనవు
డేచి పురుషుండు హుంకార మాచరించి. ౨౧౮

గీ. ఓరి ఖల నీకు మీనమేషోదయముల
నెంచు నక్షత్రపాఠకసంచయంబు
వలని గోష్ఠియు లేదుగావలయు వారు
కన్యఁదెలుపక తెలుపరుగా ధనువును. ౨౧౯

---

1. వృత్త 2 మదాలి

మ. అన మంజీరకుఁ డంతలో నిపుడు వీఁడాహా కడుం జూపెడున్
దన వాచాలత చూపనీ మగుడ నేతద్భావగర్వోక్తిచే
తన వారించెదనంచు నీ నృపులలోఁ దర్కింప నక్షత్రవి
ద్యను నీవే నెరవాది వౌదువన నాతం డాగ్రహోదగ్రుఁడై ౨౨౦

క. ఓరీ యెట్టెట్టుర మరి
వీరుండున్నాడె క్షత్రవిద్యకు నేనే
పో రాజ నావు డల మం
జీరకుఁ డిట్లనియె నైన జెప్పెద వినుమా. ౨౨౧

క నిను నింత చెప్పికొనియెదు
ఘనుఁడవు ధర్మంబు విడిచి కన్నియ నిటు రా
బెనఁగెదవు చాప మందక
యనువగునే బయల నారి నాకర్షింపన్. ౨౨౨

క నావుడు నీవాడెడు నీ
భావంబులు దెలిసె నోరి బాపురె చాపం
బే వంపుట కనుమానమె
నావుడు నీవీశ్వరుఁడ(వె) నావుడు నతఁడున్. ౨౨౩

క. పైపైఁ బొదలెడు కోపా
[1]టోపైకవశమున నటునిటు న్మెలఁగుచు నీ
చాపారోపణమునఁ దన
యోపిక కనుమానలేశ [2]మూఁతంబైనన్ ౨౨౪

మ. జలదాభోగము బాసి క్రొమ్మెరుగు భాస్వత్స్వర్ణజిచ్ఛాయ ది
క్కులఁ దీండ్రింప వెలుంగు నెంతయు నభఃకుల్యాపరీవాహమున్
దొలఁగం ద్రోచి మెరుంగుచే దెసలు చిందుల్ ద్రొక్క నీలోత్పలా
వలి లీలన్ గగనాంతరాళఖురళిన్ వర్తింప వర్తింపుచున్. ౨౨౫

1 టోపావశమున 2 మూతనమైనన్

సీ అనిచూచి యాశ్చర్యమునఁజెంది యెట్టుగా
తన ప్రతిజ్ఞాభంగమునకు ధాత
విపరీతముగ సృష్టి నిపుణతఁ జూపి నాఁ
డిది చక్కఁ దెలియుదు నిపుడ యనుచు
నొక విచారము బ్రహ్మయును మద్విరోధంబు
కొరకు నెంతటివాఁడు కోరి మున్ను
పాలమున్నీటిలోపలి శౌరి బొక్కిలి
వెలిదమ్మి నాబావి నిలుపఁదలఁప
గీ. నతఁడు విని పాదశంకియై చతురమధుర
మధురసూక్తులచే వందిమాడ్కి నన్ను
బహుముఖంబులఁ గొనియాడి పాడి వినయ
మొప్ప నెంతయుఁ బ్రియములు చెప్పినాఁడు. ౨౨౬

క. అని మరియునుఁ దేటపడం
గనుగొని సామ్యంబ కతనగా మోసము వ
చ్చె నురక భ్రమసిన యెడ నె
వ్వని తెలివికి రాదు కొరఁత వసుమతిలోనన్. ౨౨౭

ఉ. కాదిది చంచలాలతిక కన్నియ యొక్కతె మేడమీఁద నా
హ్లాదమునం జరింపఁ దనుహాటకవల్లిక యుల్లసిల్లెడున్
గాదిది మీన చ(ం)క్రమణకంపితనీలపయోజరేఖ యా
పైదలి కొప్పుజూపు [1]తెగబారెడు తీరగుఁగాని చూడఁగన్. ౨౨౮

క కనుకాంతి మెరుఁగు తెరఁగై
కనుచూపుల పసలు నల్లగలువల చెలులై
తనరినయాకృతి సామ్యపు
మొనకట్టున మతికృపాణి మొగ తిరిగెఁగదా. ౨౨౯

1 తెర.

వ. అని. ౨౩౦

క. ఈ తరుణియ కావలయు
న్సీతాకన్యాలలామ నిశ్చయ మితర
స్త్రీతతికిఁ గలుగనేర్చునె
యీతీ రీ తిన్నఁదనము నీతేజంబుల్. ౨౩౧

వ. అని మరియుఁ గౌతుకాయత్తచిత్తంబున. ౨౩౨

చ. వనజమ నీభవంబు వృథ వారిజశాత్రవ సీత కాలిగో
రున కెనరాదు నీదు కలరూప మొకింతయు నెంతదవ్వు నీ
కును ముఖమండలంబునకుఁ గోమలి చూపులముందరల్ మృగాం
గనయును బన్కిరాదనఁగ ఖంజనమా నినుఁ జెప్పనున్నదే ౨౩౩

క. అని యప్పురుషుఁడు మోదం
బునఁ బొగడుచునుండు సమయమున నూపురకుం
గనుఁగొని మంజీరకుఁ డి
ట్లను నయ్యపరంజిమేడకై కనుఁగొంచున్ ౨౩౪

వ. చెలికాఁడా యొక్కపూఁబోఁడి చేతియది దిగిచికొని యంతఃపుర కాంతాజనంబులు సంభ్రమంబునఁ జూచెద రది యెయ్యదియన నతం డిట్లనియె. ౨౩౫

క. గురుభవనాగత యా కుం
దరదన మందారకళిక తత్కరపద్మాం
తరగతము చిత్రపట మది
తరుణులు చూచెదరు ప్రమదతరళహృదయలై. ౨౩౬

గీ. అనిన మంజీరకుఁడు తన యనుఁగుఁ జూచి
చూచితే నీవు పటచిత్రశోభ యనిన
మున్ను జూచితి నీకది విన్నవింతు
ననుచు నూపురకుఁడు పల్కె నభినవముగ. ౨౩౭

ఉ కారుమెరుంగువంటి నృపకన్యక వ్రాసి తదంతికంబునన్
సారమసారనీలతనుశాలిఁ బ్రసూనశరాసనోపమా
కారుఁ గరాబ్జకుండలితకామవిరోధిశరాసను న్మహో
దారుని నొక్కరాకొమరుఁ దార్కొన నందు లిఖించినా రనన్ ౨౩౮

ఆ.వె అహహ యెంతముగ్ధ లబలలు కరినప్ర
తిజ్ఞ నె(ర)పు వసుమతీవిభునకుఁ
జిరుతవయసువానిఁ జిన్నిరాకొమరునిఁ
గూఁతు మగనిఁజేయఁ గోరినారు. ౨౩౯

క ఈరీతి పటము వ్రాసిన
వారెవ్వరు తెలసినాఁడవా యనవుడు పెం
పారు నల యాజ్ఞవల్క్యుని
గారాపుం జిన్నిభార్యగాదె లిఖించెన్. ౨౪౦

వ. అనిన నతండు. ౨౪౧

గీ. హర్షమునఁజెంది యట్టిద యయ్యెనేని
పొసఁగఁ దనకోర్కె మైత్రేయపుత్రి మొదల
సిద్ధయోగిని కాలదర్శిని వికల్ప
కల్పనల ద్రోవఁబోవదుగా తలంప. ౨౪౨

సీ. అనుడు నూపురకుఁ డిట్లనియె నీ జరరుండు
తలఁగిపోయిన గదా వెలితి లేక
యొనగూడు నన్నియు ననుడు వీఁ డేకాకి
వెడలింతు నిప్పుడే విల్లుఁజూపి
యనుచు నాతనిఁజేర నరిగి యోహో విను
మెక్కడెక్కడజూచె దిదెగదోయి
యిందుశేఖరుచాప మిందు బెట్టగదోయి
దృష్టి నావుడు మొగం బెత్తినేసి

గీ. రేసి యప్పూరుషుం డోరి దృష్టి నిలుపు
పెంత పలుకును బంతంబు నెనయ ముష్టి
యును ఘటించెద నన నది యూడిపడిన
శేఖరము కాక జూడ మంజీరకుండు. ౨౪౩

ఆ. వె. లక్ష్యమాణనిష్కలంకేశచాపంబు
నెత్తు నీకు సొమ్ము లెన్నిలేవు
పడిన ముకుట మేల పలుమారు నీక్షింపఁ
బోయె దింకఁ బ్రొద్దువోయె లెమ్మ. ౨౪౪

ఆ. వె అనవు డాత్మలోన దను నెట్లు తెలిసెనో
పొసఁగ దిందు లేక ప్రువ్వు దొలవ
వ్రాయు వడినరీతి రాబోలు నొకమాట
యట్టె తప్పదనుచుఁ బెట్టుగాఁగ. ౨౪౫

గీ. సావహేలంబుగా నెత్తి యల్లె లీల
కొప్పునకుఁగూర్చి శరజాతగురుని విల్లు
వేగ నీ గర్వితారాతివీరవరుల
చిత్తములతోడ నప్పుడ చెందినాఁడ. ౨౪౬

క. అని దగ్గరి హస్తంబా
ధనువుపయిన్ వైచి చూచి తనలోఁదా నే
మనవచ్చు దీని చక్కం
గనుఁగొనఁగా వశమె యైనఁగానిమ్మనుచున్. ౨౪౭

గీ. అసము డింపక వక్రమైనట్టి తెరు వి
దేల బుజువైన నాకేలి వాలుఁ ద్రోవ
సీతఁగొనిపోదు ననుడు మంజీరకుం డి
దేమి పెందర్కములఁబోయె దిపుడు నీవు. ౨౪౮

చ. కనుఁగొనవే నరేంద్రుల నఖండయశోధవళీకృతాఖిలన్
ఘనతరరోషభీషణవికాసితనేత్రుల భ్రూవిభంగసం
జనితవికారవక్త్రుల నిశాతవిలోలకరాళఖడ్గభా
జనభుజదండమండితుల సాహసచిత్తుల నప్రమత్తులన్. ౨౪౯

వ. అని యవ్వందికుంజరుఁడగు మంజీరకుఁ డంజిక పలుకుటయు ౨౫౦

క మెరుఁగులు పరిగొను కరవా
లొరవాఁయగఁ బెరికి [1]తిగిచి యురక నలుదెసల్
చురచురఁజూచుచు నాతం
డరిమురి నిట్లనియె గ(రి)నహాసముఖుండై ౨౫౧

చ నృపసుతులార చూచితిరె నిర్దళితారిమదావశేంద్రకుం
భపటలముక్తమౌక్తికసమాగమతారకితాభ్రమున్ గృపా
కృపణము మత్కృపాణ మిది క్రీడయొనర్చు రణాగ్రవీథి వీ
రపిశితఖాదనంబునకు వ్రాలిన వేరొక (కాళరా)త్రియై. ౨౫౨

వ. అని మరియు ౨౫౩

క. పెక్కండ్రు గూడి యొక్కని
జక్కడపక విడువ మనెడి శంక వలదు నీ
వొక్కరునె తాకి మార్కొను
మక్కట ధర్మంబు వదలమని యాడెదరే. ౨౫౪

వ. అని యచ్చెరు విచ్చపలమనుజకీటంబుల యఖర్వగర్వంబు చూచితె వీంద్ర దీంద్రించు నిజరూపంబుచేతనే వెరపించెదనని సాటోపంబుగా జవనిక మాటునకు నరిగి. ౨౫౫

సీ. ఉన్మీలితాభీలసోమశైలదిగంత
కరిదంతసంతానకరములార
కీలితాశాధికసాలభంజీపుంజ
మంజీరపాదపద్మంబులార

1. దిగిచి మొగిచి యురక నలుదెసం

దారితారాతికోటీరవాటీరత్న
చంద్రహాసాదిశస్త్రంబులార
పూజితాంభోజరేఖాజూటకూటాంఘ్రి
కంజ(పీఠీ)మస్తకంబులార
గీ. రండు మీరంచు రాక్షసరాజు తనదు
పూర్వలనువందె నంజనపర్వతాను
కారియగు ప్రాంశుభావంబు కారుమెరుఁగు
పసలు వెదజల్లు కోరలు ప్రజ్వలింప. ౨౫౬
గీ. దండి నేతేర నూపురకుండు సఖుని
బలుకు నొకఁడయ్యుఁ దాల్చె నీపంచజనుఁడు
తలలు రెండై దు లిట్టివిగలవె యనవు
దూరకుండుమటంచు మంజీరకుండు. ౨౫౭

చ. తలఁప నరుండుగా డితఁడు (దానవ)రాజు దశాననుండు నా
మొలచినభీతిఁ గన్నుగవ మూయుచు నూపురకుండు నెచ్చెలిన్
దలకొని నన్నుగావు మొక దానవమాత్రుఁడు మ్రింగు మర్త్యులన్
జలమున వీఁడు తత్కులముసామియచే మరి చెప్పనున్నదే. ౨౫౮

వ. అనుటయు. ౨౫౯

క. ఆమంజీరకుఁ డిట్లను
నేమిటికి భయంబు నొందెదీ వఖిలభట
స్తోమార్చ్యయోగ్యము గా
దా మన యీవందికులము దా నూపురకా ౨౬౦

క. మనవంటివారి యందును
మనవంటి యశోవధూటి మన్నించు మహా
ఘనుఁడీ లంకానాథుఁడు
కినియఁగ మనమేమి తనకు గీర్వాణులమే. ౨౬౧

వ. అనుటయు ౨౬౨

గీ. కరము సంతసమంది నూపురకుఁ డీతఁ
డింత సద్గుణగణధుర్యుఁడేని భయము
లేక యొకమాట యడిగెదఁగాక యనుచుఁ
బూని యాతని దగ్గరఁబోయి యోయి. ౨౬౩

క విను మొకటి చాలదే తల
పనిమాలిన[1]వాఁడ నీకు పదియేటికి [2]వ
ల్లని మోపు చేటు భువిఁ బూ
ట్చిన మే లొక్కటియ తక్క చిక్కినవెల్లన్ ౨౬౪

క. నా విని సక్రోధుండై
రావణుఁ డోరీ దురాత్మ రానీదగునే
యీవేళ మస్తకచ్ఛే
దావహాయగు నశుభవార్త నాననమునకున్ ౨౬౫

క. తిట్టిన దీవించిన రా
కొట్టినఁ జలపట్టినను దగుం దగదనినన్
భట్టు బహుమానయోగ్యుఁడు
గట్టిగ నని వంది నిన్ను గాచితిఁజుమ్మీ. ౨౬౬

వ. అనినం జిరునగవు మొగంబున న్నిగయ నంజక మంజీరకుండు మరి యొందు వేళనైన శిరచ్ఛేదప్రసంగంబు నీకు మంగళంబు నొసంగునే యనిన రావణుం డిట్లనియె ౨౬౭

ఉ చొప్పడఁ బారిజాతములు చొన్పుచు నచ్చరలేమ లేటవా
ల్గొప్పులు దీర్ప నొప్పు తన కొప్పశిరంబులచాలు పున్క పెం
గప్పెరవేల్పు దివ్యచరణంబుల నుగ్రరణంబులన్ ముదం
బుప్పతిలంగ ద్రుంపఁబడియున్ ఘటియింపదె శోభనంబులన్. ౨౬౮

1 పాట. 2 వల్పని

వ. అనిన నూపురకుం డీపాటి మేటి వేటికి రూపు మాటి నిశాటపాటచ్చరుం డునుంబోలె నిచ్చటికి వచ్చితనిన నవ్వి యవ్వియచ్చరారాతి యిట్లనియె.

ఉ. ఓరి వివేకహీన వినరోరి హరాచల మున్మనంబుగా
వారక లీలమై నెగురవైచిన బాహుబలంబు డింద ని
స్సారకరీరరూపమగు చాపము వాప నిజాల మేన నే
తేరఁగ సిగ్గురాదె నగదే నను లోకము చౌకసేయుచున్ ౨౭౦

క. అని నూపురకుం గోపం
బున నాక్షేపించి జనకపుత్రికఁ దనకున్
గనుపింప రనుచు నదలిం
చిన విని మంజీరకుండు చిత్తం బెరయన్. ౨౭౧

వ. సీత యీతనిపాలిద యని వగచి ౨౭౨

చ. జనకుఁడుగన్న పెన్నిధి రసాసతినోచిన నోముపంట యో!
ఘనుడగు యాజ్ఞవల్క్యుని పొగత్తలమేలిమి యోజగల్గు స
జ్జనముల భ్రాంతి హా తళుకుఁజక్కెరబొమ్మ దురాత్ముఁడైన యీ
దనుజుని పాలిటంబడితె తల్లి! పురాకృతకర్మవాసనన్. ౨౭౩

క ఎక్కడి జానకి రావణుఁ
డెక్కడ విధికృతముఁ ద్రోయ నెవ్వరి తరమౌ
నెక్కడఁ జూడఁగనోపుదు
మక్కట యీబారి దైవ మాఁకడుచునొకో. ౨౭౪

గీ. అనుచు నూపురకుఁడు తన యనుఁగుఁ బలుకు
నడలనేటికి సీతాభిహరణబుద్ధి
నరము నీరక్కసుని బల్మి నాగ నిచట
నెవ్వఁడేనియు లేడు మహీతలందు ౨౭౫

వ. అనిన మంజీరకుండు నిట్టూర్పు నిగుడించి యిట్లనియె. ౨౭౬

ఉ. కోపమువేళ నాఁ గొనిన కోల్పులిఁ బోల్పఁగఁ బాత్రమైన యీ
పాపపు రక్కసుం దొడరు బల్లిదుఁ డెవ్వఁడు గల్గనేర్చు పృ
ద్వీపతిజాతిలోన గృతవీర్యసుతుండు సహస్రబాహుఁ డ
ష్టాపదశైలతుల్యభుజసారధనుం డొకరుండు దక్కఁగన్. ౨౭౭

క. అనవిని నూపురకుం డదె
కనుఁగొను చెలికాఁడ బ్రతుకుఁగంటిమి కృతవీ
ర్యుని పట్టి వేయుచేతుల
పెనుఁబావరి వచ్చె మనసు బిమ్మిటి నిచ్చెన్ ౨౭౮

మ. అని మంజీరకుఁ డాప్తు నిట్లను వయస్యా మున్ననిన్ రేణుకా
తనయక్రూరభుజాకుఠారవిలసద్ధారాజలాంభోనిధిన్
మునిఁగెంగాదె సహస్రబాహుఁడు కులంబున్ దాను నీవచ్చువాఁ
డనుకంపా(ర)హితుండు [1]బాణుఁడను దేవారాతి నిక్కంబుగన్. ౨౭౯

క. ఇదియు నొక కానిపని యిపు
డెదిరించెనె యిలుకు మీదనే సోఁకిడి మం
చిదిలే యీతం డితనిన్
విదళించున్ జగతి విషము విషమును (బో)లెన్. ౨౮౦

వ. అనుసమయంబున సమరవిద్యాధురీణుండగు బాణుండు రాణఁ బ్రవేశించి సంచరింపుచు నిట్లనియె. ౨౮౧

చ. అమితభరైకసారముల నారజతాద్రిఁ దిరస్కరించు నీ
శమితలతాంతచాపవరచాపము నాకర(పం)కజంబులన్
గ్రమముగఁ బుష్పతుల్యముగఁ గైకొని వే ఫలియింపఁజేసెదన్
సమదభుజానవీనతరుజాలము సంతతదానశీలమున్. ౨౮౨

క. అని పలుకు బాణుఁ గనియున్
గనుఁగొనక దశాననుండు గర్వోద్రేకం

---

1 బాణుఁడును

బున మ్రొగ్గతిలుచు నేమీ
జనకజఁ దోఁతేని యట్టి చందంబనినన్. ౨౮౩

క. వానిం గనుఁగొని యిటకు ద
శాననుఁడున్ వచ్చినాడె యని బాణమహా
దానవుఁడు పలికె నీ యస
మానంబగు వీరవరసమాజములోనన్. ౨౮౪

క. ఎవ్వాఁడును హరచాపపుఁ
దివ్వం దివలేడెయనిన దివలేడేయం
చవ్వల మంజీరకుఁ దన
నవ్వార్తయు వినియువినక నలుక జనింపన్. ౨౮౫

వ. రావణుం డిట్లనియె. ౨౮౬

క సీతఁ దడవయ్యె నిటకుం
దోఁతే రిదియేమి తారు దోఁతేరే నా
శాతకృపాణిక విడుచునె
తోఁతేరక యనుడు నవ్వి తొకుదొకులాడన్ ౨౮౭

ఉ. బాణుఁ డిదేమి వీఁడు తన పంతము గొంతము నింత దూయువాఁ
డేణధరాళుగాసనము నెత్తఁడు తా నటులెత్త వారలే
జాణలు సీతఁదేక జగజాగులు సేయుట చేతగామినొ
ద్రాణ యెరుంగవచ్చునన రావణుఁ డఘలు జేవురింపగన్. ౨౮౮

శా. ఔరా యోరి యశీకపండిత హరాహార్యంబు దోశ్శౌర్యలీ
లారూక్షక్రియఁ బెల్లగించి భువనాలంకారశంకావహ
శ్రీరంజిల్లెడు నిత్యకీర్తిమహిమన్ జేకొన్న నాకెన్న ని
స్సారంబౌ విలువంపఁగాగలుగు ప్రాశస్త్యంబు దా నెద్దియో. ౨౮౯

వ అనవుడు. ౨౯౦

క. బలితనయుఁ డనియె నౌరా
విలు ద్రివ్వగఁ బ్రాలుమాలి వెనుకటి సుద్దుల్
దలపోసెదు పడపుడిగిన
వెలయాల్గతి నావు డలుక వెలి కురుకంగన్. ౨౯౧

సీ. బాణాసురుని జూచి పలుకు నేరా యోరి
యీదశాననుఁ జెందునే యశక్తి
అనవు డిట్లను నీదశాననత్వము పెక్కు
లైన కల్లలు గూయగాని పూని
బలిమి చూపఁగఁ జాల దలవడి బహుళదో
ర్దండత్వమును బోలె ఖండనముల
నావుడు తృణసమానభవద్భుజాదండ
సారంబుచే నోరి శూరుఁడైతె
గీ. యనుడుఁ గోపించి సమరవిద్యానికుంఠ
యోరి దశకంఠ నాదుబాహువులఁ దూల
బోవనాడెద వెరుఁగవులే విజృంభ
మాణబలవైభవంబుల మన్న నన్ను ౨౯౨

మ జనకుం గొల్వ రసాతలంబునకు నిచ్చల్ బోయి నాబాహుంకే
శి నిలామండల మొక్క సంగడముబోలెన్ బెక్కుతోయంబు లె
త్తినగాదా తలలూచి భోగిపతి యాత్మీయస్ఫుటారత్నముల్
గొని తీర్పించి యొసంగె నీకడియముల్ కోర్కుల్ మదిన్ దార్కొనన్.

క. అనుటయు రావణుఁ డాతని
గని సత్యపరాక్రమమునఁ గ్రాలెడు నాతో
విను నీదబ్బరనేతలు
పనివడి చెప్పెదవు నీతిపథదూరుఁడవై. ౨౯౪

క. నావుడు బాణాసురుఁ డను
నీవిక్రమకర్మ మయిన నిజమైనదియే
రావణ నావిని దబ్బర
లే వీరాధికుఁడనైన నేఁజేయు పనుల్. ౨౯౫

చ. వెలయఁగ మత్కఠోరభుజవీరరమామణి సౌధపంక్తికిన్
కలశములెత్త నేవెలఁది గట్టు క్రమంబున హస్తపల్లవాం
చలములనెత్తి యీపనికి సాక్షి స్వయంగ్రహణోపగూహదో
హలమున నుబ్బఁజేయు కుధరాత్మజ మెచ్చు గిరీశుఁ డారయన్. ౨౯౬

గీ. నావు డిట్లను బలిదైత్యనాథతనయుఁ
డీ వృథావాగ్వివాదంబు లేల మనదు
తారతమ్యంబు లీ విల్లు దాన తెలుపు
నూరకుండు మనంగ మంజీరకుండు. ౨౯౭

వ వసుమతీజాత నరవీరవరున కొసఁగఁ
బాత్ర మూరక రావణబాణులేల
మాన రియ్యాస నావు డమ్మాగధునకు
[1]ననును బలిసూతి వినవోయి తన(ర) తెరఁగు. ౨౯౮

క దండి విలువంపఁ జూచుట
చండస్ఫుటబాహుసారసౌరభలీలా
తాండవముకొరకు దక్కన
ఖండరతిన్ జనకసుతకుఁగాఁ గాదుసుమీ. ౨౯౯

వ. అని బాణుండు నిజభుజభుజంగమబలపరిమళంబుల వెలయింప(ం
దలం)పలఁతులఁ దెలియం బలికిన. ౩౦౦

గీ. పలుకు రావణుఁ డల వెండిమలఁ గదల్చి
నిలిచినప్పుడయయ్యె నా బలపరీక్ష

1. ననిన.

యిపుడు గైకొంటి సీతకై విపులసార
కంతుసంహారకార్ముకకర్మదీక్ష ౩౦౧

వ అనవుడు తెరమరుంగున ౩౦౨

క. అసురనరసురనిశాచర
(వ)సుచారణసిద్ధసాధ్యవర్యులలో నే
రసికుఁడు విలువంచిన మరు
దసనా[1]పస నాచికొను సుతం దగ [2]నిత్తున్. ౩౦౩

వ అనుటయు రావణుండు. ౩౦౪

శా ఓ దోర్దండములార మీరు హరువి ల్లువ్వెత్తుగానెత్తి ది
గ్వేదండంబులు మీయశోంబునిధిలోఁ గ్రీడింప నీమేదినీ
జాదీవ్యత్కుచకుంభకుంకుమరజస్స్యందోహసంధానమ
ర్యాదం జెందుడు మందుఁడీతఁడను వీరశ్రేణి కచ్చాముచున్. ౩౦౫

క అని యా చాపముఁ గనుఁగొని
తనమది నిది యేరితరము దరలింపఁగ నే
గనుక యిఁక జనకపోయిన
వెనుకటి గౌరవము దూలవిధమై తూలున్. ౩౦౬

చ పదరుట గాదటం చసురభర్త విరోచనపౌత్రుఁజూచి నీ
మది నొకరీతిమాను బహుమానము సేయఁగ మాకు(బా)డి నిన్
వదలక క్రొత్తగా నిటకు వచ్చినవాఁడవుగాన మున్ను నీ
విది తగ బూనివంచుమని [3]నించు మనంబున నాతఁడయ్యెడన్. ౩౦౭

క. ఆ విలు చేరఁగఁబోవఁగ
రావణుఁ డంతర్గతమున రా మనస మహా
దేవునివిలు నాచేతికి
లావట మరి పీనియాటలా పదరకుమీ. ౩౦౮

1 వన 2 రిత్తున్ 3 నిచ్చు.

క. ఈ విల్లు వంచి జానకి
నే పీఱఁడు పెండ్లియైన నే లంకకునై
రావించి యెటులనైనన్
మేవించెదఁ జె(లి)మి కాన మేరుసునాభీ(?) ౩౦౯

గీ. అని చతుష్పాదుఁ డాత్మ నత్తాడు వేళఁ
బలుకు మంజీరకుండు నెచ్చెలికిఁ గంటె
కంటె బాణుండు వెనఁగ ముక్కంటివిల్లు
తరల దొరుచేత సాధ్వి చిత్తంబువోలె. ౩౧౦

వ. అనిన పౌలస్త్యుండు సవి(షాదుండై) వెరువడి యీ దురుపశ్రుతి కనక లతాగాత్రియగు జనకపుత్రి మంతనంబున నెంతవెనంగి బనికిరాదని తెలుపుచున్నయది కట యెట్టు వినంబడియె నని నిట్టూర్పు నిగుడించి యున్నతస్వరంబున నిట్లనియె. ౩౧౧

సీ బలితనూభవ తృణప్రాయమయ్యెనెకదా
నేడిదే నీభుజానీకబలము
నావుడీ భుజగర్వ మీవు చూచుచునుండి
యును మానవేమి కటూక్తులనిన
నీబాహువులచేత నేమిసేయఁగనోపు
దనుడు హైహయరాజు మునుపుజేయు
కరణిఁ జేసెద నన్ను భరమేద నీభుజా
వనము నాదుప్రతాపవహ్ని నేర్తు
గీ. ననుడు నీదు ప్రతాపదావానలంబు
రవయు సవయును లేకుండ వివిధరుచిర
చాపచుంబితమద్భుజాజలదముక్త
ఘనశరాసారముల నార్తు మొనసి యనుడు ౩౧౨

వ. రావణుండిట్లనియె. ౩౧౩

చ. పనివడి యోరి బాణ శితబాణశతంబుల నేయు మోరి జీ
వనరుహబాణతూణపుఁగవన్ దొవతూపుల నేర్చు నీవునున్
గనుకని నా కరాంతరము గైకొనియున్నవి ఖడ్గవల్లికా
జనవరజామతల్లికలు చాటితిఁ దక్కిన వీరకోటికిన్ ౩౧౪

క. అనునెడ నూపురకు(ండీ)
ధనదానుజబాణులౌర తముదార చలం
బున బొగడఁజొచ్చి (రి)స్సీ
యని విపరీతంబుగాఁగ నందరు నవ్వన్. ౩౧౫

క. క్షితిఁ బరనిందకు నాత్మ
స్తుతికిని సత్పురుష లేల సొగయుదు రవి పూ
ర్వతపఃఫలవిఘ్నము లని
స్మృతి ప్రతివారమును జాటిచెప్పుచునుండున్. ౩౧౬

వ. వీ(ర)లాత్మశ్లాఘాపరులై యెగ్గుసిగ్గు లెరుంగ రనం గనలిపడి రావణుం డోరి మూర్ఖ దశకంధరుండును దనుదానె పొగడుకొనువాఁడె యని యిట్లనియె ౩౧౭

శా. మద్బాహాబలవిక్రమంబు వొగడున్ మండోదరీకుంత(ల
ప్రో)ద్బద్ధామరభూరుహప్రసవమాల్యోద్దీర్ణపుష్పాసవం
బుద్బద్ధప్రమదంబునన్ గొని యలివ్యూహంబు వీణాలతా
హృద్బంధుత్వము చూపు మ్రోత లలరన్ హేలావనీవీధులన్. ౩౧౮

గీ. అనిన బాణాసురుండు (వీఁడౌర) సౌర
సాలసుమదామకమనీయశశిముఖీని
జోపభోగప్రభావంబు నుగ్గడింపఁ
దవిలె నిది యంత మెరసి యేతత్క్షణంబ. ౩౧౯

ఉ. కుండలిరాజహారధరకూటములం బ్ర(హరిం)చు మద్భుజా
కాండము లింద్రుకేలి బలుకైదువు దూల్చి తదీయభూమిరు

ణ్మండలి నూచముట్టుగఁ దెమల్చి మదీయపురీతటక్షమా
ఖండమునందుఁ గేళివనిఁగా నొనరించు వరించు కీర్తులన్ ౩౨౦

క. [1][అ]నుచును శోణపురీశుఁడు
చనిన దశాననుఁడు వీఁడు చనియెనె చనసీ
చనదా జానకిఁ గొనిచన
కనుజీవుని రుదితనాద మది వినకున్నన్. ౩౨౧

క. అనునెడ మంజీరకుఁ డో
జనకతనూజాత (నిన్ను) సంరక్షించున్
పనివడి దైవమ యన న
ద్దనుజుఁడు తన చెవులకవలు దారగిలంగన్. ౩౨౨

వ ఆలకించి ౩౨౩

గీ. ఈ నభోవీథి వినవచ్చు దీనరావ
మకట యెవ్వనియదియొకో యనుచుఁ జక్కఁ
జూచి మారీచు వీఁడొక శూరుఁడేయు
నుగ్రశరహతి నొరలుచు నున్నవాఁడు ౩౨౪

గీ. నిశ్చయము వీని టోయి మన్నింపకున్న
తగవుగాదని చనియె నద్దశముఖుండు
వేగ నతఁ డేగ సంతోషవివశుఁడగుచు
(ననుగు)సఖు బల్కె నూపురకాహ్వయుండు ౩౨౫

క. సీత మనభాగ్యమున బులి
వాతన్ విడిబడిన [2]లేడివలె బ్రతికెఁజూమీ
యీాతరి నావిని యతఁ డా
రీతినె యగు మనము వోయి నృపవరుతోడన్. ౩౨౬

1 ( . ) నిశోణితపురీశుండు. 2. లేడు

క ఈ వృత్తాంతము తెలియం
గా విన్నప మాచరింపఁగా వలయుఁగదా
వేవేగ ననుచు నందరు
నావేళ న్నిర్గమించి రనుమోదమునన్. ౩౨౭

*                    *                    *

క. నందేల తిమ్మరాజ పు
రందరచిహ్నప్రసన్నరాఘవనాట్యా
మంద ప్రబంధరాజము
[1]నందున ప్రథమాంకమయ్యె నార్యస్తుతమై. ౩౨౮



1 నందుల.

# ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము

## ద్వితీయాంకము



సీ. శ్రీమీఱఁ గటిసూత్రదామంబు తిరియంగ
　　　　ముడిగొన్న యినుప కచ్చడమువాఁడు
ఘన[బాహుమూలమందున జుట్టిపట్టి]న
　　　　తెలినాగబెత్తంబుతీఁగవాఁడు
గిడుగు చందమున లంకించు మూఁపుల మీఁద
　　　　గప్పిన కాషాయకంథవాఁడు
ఒడలిపై నావంత పొడయైన లేకుండఁ
　　　　బూయు దట్టఁపుబూదిపూఁతవాడు
గీ. మిట్టపేరెదవాఁ డంటుపొట్టవాఁడు
కూర్పుగకపాలవాఁడు చేకుండివాఁడు
గుబురుఁ గూర్చంబువాఁ డెఱ్ఱగడ్డవాఁడు
వచ్చె దాపసుఁ డాతరువాత నొకఁడు. ౧

క. వచ్చి నలుదిక్కులుం గని
పచ్చదనం బలఁతి చిలుక పదువలచేతన్
బెచ్చులు వెరిగెడు తీవెల
హెచ్చగు నారామసీమ మిదియని వేడ్కన్. ౨

గీ యవనికకుఁ జక్కగా నిల్చి యిల్లవాఁడె
భిక్షుఁ డిట కేమొకో వచ్చెఁ బెద్దవారి
నెదురుకొన నర్హమనునంతఁ గదియ వచ్చె
నా పరివ్రాట్టు మాయల (యా)టపట్టు. ౩

ఉ. భావ మెఱర్వ భిక్షుఁడు తపస్విఁ గనుంగొని నీకు నేమహా
నా వశివర్యయన్న నతఁ డయ్య భవత్పద దర్శనంబునన్
గైవసమయ్యెఁ బూర్వమునకన్న శుభోదయలక్ష్మి నావుడు
న్వావిరి సంతరించి కుహనాయతిఁ దాదృశతాపసుం డనుఁ. ౪

సీ. భిక్షుకవర్య యీ పృథివీతలము నెల్ల
త్రిమ్మరె దేటికి దెగిన గాలి
పడగ చందంబున బడలితి రెంతైన
నీ మిథిలాపురి నేను రాత్రు
లధివసింపుడు మేని యందలి ఖేదంబు
నపనయింపుడు ప్రసంగార్థ సరణి
జనకవసుంధరాచక్రేశుఁ బొడఁగను
డుచితప్రసంగోక్తు లుగ్గడింపు
గీ. మనుడు యతి వల్కు దాపసు నహహ మాకు
నిస్పృహాత్మల కేటికి నృపుల గోష్ఠి
యడుసు చొర నేమిటికి కాళ్లు గడుగనేటి
కేను వెట్టినే రాజుల యిరుకు సొరగ. ౫

క. అనవుడు తాపసుఁ డిట్లను
జనకుఁడు బ్రహ్మోపదేశచతురుఁడగుట మీ
కనుసరణము సేయఁగఁదగు
విను బ్రహ్మజ్ఞాని మీకు విందొ గాడో. ౬

ఆ. అనవు డాతనినను నను నూరకె
నగెదొ భూమిభువననాథుఁడైన
జనకుఁ డిట్టిడౌట సత్యంబు నావుడు
తపసి[1]వలుకు నతని నిపుణసరణి. ౭

---

1 బలుకు

వ. భిక్షుకవర జనకక్షితిపతి బ్రహ్మవిద్యాపద్యం జరి(యించుట సత్యం బట్టి యపూర్వ...) భాగ్యంబు దశకంఠుని యనంబోయి శితికంఠునాజ్ఞ నయినది యనిన భిక్షుం డిట్లనియె. ౯

క. అపలాపాలప(న)కళా
నిపుణత లేకఁజాలు యతివె ? నీ వసురవుగా
క పలుకు నిక్కము నీకే
ల పృథగ్భావంబు లేను లాతినె నీకున్.

వ ఏనును నీ వాడిన తీర్థంబె యాడనున్నవాఁడ నీవెవ్వఁడవనిన దాపసుం డిట్లనియె. ౧౦

క. లంకేశమంత్రిమకుటా
లంకారప్రసవమాల్యలతయైన నిరా
తంకమతి మాల్యవంతుఁడు
కింకరుఁడుగ నేలు నన్ను గెంటని కరుణన్ ౧౧

సీ. ఆ నిశాటాధినాయకమంత్రి యొక వార్త
వినియెఁ దా నదియెది యనిన వినుము
సకలజ్ఞుఁడైన కౌశికుఁడనుముని యయో
ధ్యావిభు దశరథుఁడను నృపాలుఁ
గని నిజాధ్వరరక్ష గావించుపొంటె ద
త్తనయుల గురుభక్తిద త్తనయుల
యాచించు(టయు) ధన్యుఁడని యాతనికి నేత్ర
ములకంటెఁ బ్రియమైన పుత్రులేని

గీ మసల కారాజశేఖరుం డొసఁగి రామ
లక్ష్మణులఁ గాకపక్షవిలాసయుతుల
నొసగుటయు [1]నెంచి సంతోషరససరన్ని
మగ్నమానసుఁడగుచు నమ్మౌనిమౌళి. ౧౨

1 వెంచి

క. రాజునకు నొసగె నవదిన
రాజద్యుతిమండలముల రహిఁ గరగి దృగం
భోజముల నలరఁ జేయుచు
రాజిలు తాటంకయుగముఁ బ్రజ లరుదందన్. ౧౩

గీ. ఒసగి యీ దివ్యతాటంగయుగళ మర్థి
మవని వీరునిగనుతల్లి [చె]వి ధరింప
తేటతెల్లంబుగా నిదే తెలుపుచున్న
యది విదితగర్భరత్నవర్ణాళిచేత ౧౪

క. కావున శ్రీకౌసల్యా
దేవీశ్రుతియుగళి నిల్పు దివ్యంబుగ ని
ష్పావనకుండలయుగ్మం
బా వెలఁదియ వీరసూపదాశ్రయ మగుటన్. ౧౫

గీ. అనుచు దీవించి యా కమ్మ లవనిపాల
వరునకును నిచ్చి యమ్మునీశ్వరుఁడు చనియె
నృపకుమారులఁ దోడ్కొని నిజవనమున
కనుడు భిక్షుకుఁ డటమీఁద నయినదెట్లు. ౧౬

మ. వినుపింపు మనుటయుఁ దాపసుం డిట్లను నీవృత్తాంతంబు మాల్య
వంతుడు విని యా వింత రవణంబులు దశముఖజననియగు నికషామహా
దేవికిం గాక సామాన్యులగు నన్యపురంధ్రులకుం దగునే యని విత
ర్కించి కర్కశపరాక్రమక్రీడావిపాటితహరిహయనగరకవాటయగు
తాటకం దత్తాటంకయుగళంబు గొనితేరం బ్రేరేచుటకై తాటకావనంబు
నకు మున్న యొక్క రక్కసుం బనిచె నిప్పుడు. ౧౭

క. తాటక యింతక తెచ్చున్
దాటంకము లనెడు బుద్ధి [1]తరువిడగా న

1. తరవిడగా.

మ్మేటి నిశాటుఁడు నను న
చ్చోటికిఁ బనివనిచెఁ గమ్మజోడు గొనుటకై. ౧౮

క. అనుటయుఁ దాపసుతో ని
ట్లనియెఁ భిక్షుకుఁడు చోద్యమయ్యెడు నేలా
గున వినియెనొకో దూరా
వని గల యావార్త మాల్యవంతుం డనుడున్. ౧౯

ఉ. శీలముగల్గు విద్యయును చిత్తము రంజిలజేయు వార్తయున్
నీలకచాకుచస్తబకనిర్వృతమౌ మృగనాభి తావియున్
దైలకణంబు నీటఁ బడి తజ్జల మంతయు నిండ బర్వు న
ప్పోలిక నెల్లలోకములఁ బుట్టు తనంతన దుర్నివారమై ౨౦

వ. అదియునుంగాక జాగరూకుండగు మాల్యవంతుండు నిరంతరంబునుం
బరమహీవృత్తాంతవిమర్శనదత్తాంతరంగుండై చారజనాపాంగంబుల
నన్నిదేశంబులఁ బ్రవర్తింపంజేయు ననిన భిక్షుకుం డిట్లనియె. ౨౧

గీ. అట్టిదయయేని మిథిలావనాంతరాళ
మునకు నేటికి వచ్చితి వనిన నతఁడు
రావణుం డిందు వచ్చిన రాక వింటి
విని దదీక్షణవశమనోవృత్తి నగుచు. ౨౨

ఆ. వె. మొదల నితని గాంచి తదనంతరము తాట
కావనంబునకును బోవువాఁడ
నీతెరంగు దెల్పు నీ వెవ్వఁడవు నిక్క
మనుడు భిక్షుఁడనియె నతనిగురిచి ౨౩

క. ఏ మొదల మాల్యవంతుం
డా మెయిఁ బనివంచినట్టి యనుచరుఁడ సమం
బై మనకు నొదవె మిథిలా
రామస మాగమసమాచరణ మిప్పాటన్. ౨౪

గీ. తాపసుఁడు వల్కె నిప్పు డాతాటకావ
నము నతాటంకమై[1]యున్నె నగుచు భిక్షుఁ
డోవయస్య నతాటకం బావనాగ్ర
మనక యిట్లాడఁదగదన్న నార్తుఁ డగుచు ౨౫

వ. తాపసుం డాతాటక యిప్పు డెందుబోయె ననిన భిక్షుకుం డిట్లనియె. ౨౬

క. ఇంతి పురి కరిగె ననవుడు
సంతసమున దాపసుండు చనియెనొకో దే
వాంతకపురి కనవుడు నొ
క్కింత శిరం బూచి భిక్షుఁ డిట్లను నతనిన్ ౨౭

గీ. దేవయను రెండువర్ణముల్ వోవ(విడు)వు
మనుడు తాపసుఁ డిట్లను నాకె కెవ్వఁ
డిచ్చె నంతకుపురమునకేగఁ ద్రోవ
యనిన భిక్షుఁడు రాము భీమాస్త్ర మనియె. ౨౮

క. అన రాముఁడనగ నెవ్వఁడొ
యని మది నూహించి కౌశికాధ్వరరక్షా
వినియుక్తమైన దశరథ
తనయద్వయి నగ్రజుండొ తాదృశుఁ డనుడున్. ౨౯

గీ. అట్లయగునన్న తాపసుఁ డాశుకేశ (?)
తనయు లిద్దరు మారీచుఁడును సుబాహు
[2]లనగ బరిపంథిమర్దను లనతబలులు
గలరు తద్విధ మెట్టిదో తెలియ వలయు. ౩౦

గీ. అనవు డాతఁ డనియె నా తాటకనకూడి
యని సుబాహుఁ డరిగె నర్కకులజుఁ

1 యున్న. 2. దనగ.

దేయు మిట్టకోల నేపరి మారీచుఁ
డందె ప్రాణయుక్తుఁడయ్యె ము(క్తి) ౩౧

గీ. (తా)పసుఁడు వల్కె నవ్వార్త దశముఖునకు
నెవ్వఁ డెరుఁ(గి)ంచెనన భిక్షుఁడిట్టులనియె
నేటువడి పోవు మారీచుఁ డెట్టి రవము
తెలిపె (మి)థిలాగతునకు వైదేయపతికి ౩౨

క. అనవుడు తాపసుఁ డిట్లను
తన [1]చెవులనె బంధువధవిధానము వినియున్
గినియఁడకొ దశలపనుఁడు
జనకజ మోహాంపుటురుల సందడిఁ బడుచున్. ౩౩

వ. అనుడు నీమాట నిక్కంబెయని భిక్షకుం డిట్లనియె. ౩౪

క. సీతాననచంద్రాతప
[2]శీతలమగు పంక్తిముఖుని చిత్తమునం దు
ద్యోతింపదయ్యె నూష్మల
తాతతవిభవంబు నీ(ట) నగ్నియ పోలెన్. ౩౫

గీ. అనవు డారామలక్ష్మణు లమ్మునీంద్రు
నాశ్రమంబున నున్నారె యనిన భిక్షుఁ
డనియెఁ దాపసు నీక్షించి య(ధి)పసుతులు
మిథిల కేతెంచినారట మిహిరనిభులు ౩౬

వ. విశ్వామిత్రుండును నాదశరథపుత్రులన కూడి వర్తింపుచున్నాఁడను వార్త వింటి మనినం గంటగించి యా క్రించు నేపథ్యంబు వీక్షించి మహాప్రమాదంబువచ్చె నిచ్చటికి నయ్యైనవంశకరీరంబు సలక్ష్మణుండై యేతెంచె నీ వియచ్చర[3]విముఖపలాశనివహదహనుండగు మహాను

1 చాలనె. 2. శీతలమగ. 3. విముత

ఛాపుం దనుజపవమానప్రేరితుండై తన వేఁడిమి పచరింపకపో డింక
నీవంక మనకు నిలువం జెల్లదని కపటభిక్షుసహితుండై చనియె నంత. ౩౭

## ఇది విష్కంభము

క. ఆరామసీమమున కపు
డారాముఁడు వచ్చె లక్ష్మణాన్వితుఁడై సొం
పార మలయానిలాన్వితుఁ
డై రయమున వచ్చు చైత్రు నాకృతి వెలయన్. ౩౮

గీ. లక్ష్మణుని బల్కె రాముఁ డోలక్షణాఢ్య
యభినవారామరామణీయకము గంటె
యన సుమిత్రతనూజాతుఁ(డంత) బలుకుఁ
బలుకుబలుకున గపురంపు మొలక లెగయ. ౩౯

క. దేవ నిసర్గమనోహర
(మీ)వన మఁటమీఁదఁ బర్వె నిదె మధుమాస
శ్రీవిభవము విపులంబుగ
గావున నేతద్విశేషగతి గనుపట్టెన్. ౪౦

గీ. అనుడు నోవత్స నీవన్నయట్ల నీది
శకట [నా] రామవీథీవసంతలక్ష్మి
పలుకుచూపెడు నిదె మహోజ్వల(పయో)ని
ధానవీచిఁ బయోజా[మ]తల్లి బోలె. ౪౧

వ అని మరియును. ౪౨

ఉ. ఒత్తడిఁ బూవుఁదీవియల నుండెడు కమ్మని తేనె తెట్టువల్
కుత్తుకబంటి గ్రోలి మదఘూర్ణితచిత్తవికారకాకలిన్
గ్రొత్త విలాస మేరుపడఁ గ్రోలుచుఁ దేఁటులు నాలిగాలిచే
నృత్తమునేర్చు వంజులవనీనవమంజరులన్ జెలంగెడున్. ౪౩

చ మలయమునందునుండి పురమర్దనశైలముత్రోవ దాడిమై
గలఁయగఁబర్వి లోకము లఖర్వగతిఞా గొని గెల్వుమంచు నీ
యిల [1]వలరాచవాఁడు సెలవిచ్చిన నగ్గిరిఁ [2]జక్రికంకణుం
డొలయుట యాత్మలోఁదలఁచియో మెలఁగుఞా బవనంబు మందమై ౪౪

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. ౪౫

శా. పోవంజాలదు చైత్రగంధవహ మీపూదీఁగప్రోయాంద్రు చెం
గావిం గెంజిగురాకు గేల మధుసిక్తంబుల్ ప్రసూనాక్షతల్
సేవావృత్తి నొసంగ సోలియు నలిస్త్రీగీతికిం జొక్కి నే
ణీవాహం[బు తె]మల్వ[లే]కయుఁజుమీ నేడీ వనక్షోణులఞా ౪౬

వ. అని మధుమాధవమధురాకారులగు దశరధకుమారులు వసంతసౌభాగ్య
వర్ణనావిశ్రాంతస్వాంతులై యా కేళీకాంతారంబునం గొంతవడి యన్యో
న్యసల్లాపసుధాపూరంబు ననుభవించి రంత కించిదవశిష్టదివసప్రవర్త
తనుండగు వికర్తనుం గనుంగొని రాముం డాసౌమిత్రి కిట్లనియె. ౪౭

గీ. గాధితనయుండు యాజ్ఞవల్క్యమునినాధు
తోడి సంసర్గ దిలకించినా డతండు
మరలి చనుదెంచునందాక విరులు గోయు
దము తదీయేశ్వరార్చ[3]నార్థ మిమ్మటన ౪౮

వ. అని యయ్యిరువురు ప్రసవాపచయంబునకుం గడంగి రపు డప్పరమ
పుణ్యుం డనుజన్మునకు నిట్లనియె. ౪౯

సీ. ఆతోద్యనినద హృద్యాంభోధరధ్వాన
కృతమనోహర లాస్యకేళి కేకి
గగనగంగా నూత్నకనకారవింద శం
కాకారి కాంచనకలశ కు(ల)ము

1. వలరాచవారు. 2 జక్రికంకణుల్ వొలయుట 3 నార్థమిచట.

కంఠవేణీబద్ధ కంఠీరవధ్వజాం
చలచా[ల]న చలిత జలదదలము
సేవాసమాయాత సిద్ధసీమంతినీ
మహిత(మా)ణిక్య విమానచయము.
గీ పార్శ్వవేష్టిత నవ(క)దంబక(క)దంబ
కుసుమసౌరభపోషితభసలక(లభ)
మల్లయదె కంటిపే పర్వతాధిరాజ
తనయ వసియించు దివ్యసౌధము కుమార ౫౦

వ. అని తదభిముఖుండై నిండుమనంబున నచ్చండికాదేవిం దలంచి. ౫౧

శా. తల్లీ తెల్లనివేల్పురాణి దివిషత్తాటంకినీదత్తమ
త్తల్లీ చంద్రకళా(వత)ంస ముదయాధారాపరిష్కారదృ
క్కల్లోలంబును హల్లకాభమగు నీకల్యాణరూపంబు నే
హృల్లేఖోపనిషద్రహస్యముగ నా హృద్వీథి భావించెదన్ ౫౨

గీ. సింధుకోటీరదేహార్ధసింహపీఠి
నిండు కొలువుండు నీకు నెవ్వండు మ్రొక్కు
వాని కవనిజయగులక్ష్మి వచ్చు పొదవు
సంతతానందసామ్రాజ్యజనక మగుచు ౫౩

వ. అని సేవాంజలిబంధంబున నద్దేవిం భావించి భావిరావణారి వేరొక్క
దిక్కుపలక్షించి లక్ష్మణుతో నిట్లనియె ౫౪

క కలకల(హం)సో త్తంసిత
జలజాతగళత్పరాగళబలితదిశ మీ
(కొ)లను వలరాజు పుట్టువుఁ
గొలనికరణి నాకు చాల కుతుకముఁ బెనిచెన్. ౫౫

వ. అని మరియుం గౌతుకంబున ౫౬

గీ. కూర్మి ననుకూలదాంపత్యధర్మ మూది
యజ్ఞవీధులఁ దన్నుఁ బాయక చరించు
నాతి బెడబాసి యీ హంసపోతకంబు
చూతవిటపాంతరము దూరెఁ జూడు [1]మిదిగో ౫౭

సీ. అని యాలకించి పంచాయుధభద్రేభ
కనకశృంఖలికానికాయమధుర
రణితానుకారియై రాంజహంసవతంస
కోలాహలము శ్రవఃకూల మొరసె
హంసరావంబుగా దంచల [2]మొరవంపు
టంచుగైకొని సాళగించునట్టి (?)
యీ బ్రోత యిపుడు దా నేపూవుఁబోఁడియో
మిథిలలోపలనుండి మృదునిరాణిఁ
గీ. గొలువ నేతెంచు చుం(డు) నక్కలువకంటి
మంజుమంజీరములఁగల్గు శింజితంబు
చాల బరకామినీముఖచంద్రు నొల్ల
దహిమకరవంశనృపుల వక్త్రాంబుజంబు ౫౮

క. అనునత్తరిఁ దెరమరుఁగున
వినవచ్చె మనోజ్ఞనినదవీచి యొకటి యో
జననాథతనయ యిటయిట
చనుదెమ్మను వచనరచన చతురత వెలయన్. ౫౯

ఆ. వె. అరవంబు మరుని జ్యారవంబును బోలె
భావ మా(డ) రామచంద్రుఁ డర్థి
జూడఁదొడఁగె రాజసుతయచే యిది దీనిఁ
జూడవచ్చు నొరుని సుదతిగామి. ౬౦

1 మిదివో 2. మోరవంపు

వ అని క(మ)లదలవిలాసమాసరంబులు ననురాగధూసరంబులునగు విలో
కంబులు నిగుడించె నప్పుడు. ౬౧

చ పసపురసంబు వా(. .)డి బట్టెడు కాంతులు గ్రుంకి త్రోసిన
ట్లైసఁగి పసిండి లేయరఁటి యీరికపొట్టలఁ గల్గు వన్నియఁ
(బొ)సఁగిన యంగముల్ గల యపూర్వవిలాసిని గానవచ్చె న
ద్దెస నొరగంటిపై నొరసి దిద్దిన చారుసువర్ణరేఖయై ౬౨

వ మరియును. ౬౩

సీ ఒరగంటిపై నిడ్డ గరిగంటిగాని
బంగరురేఖయొక్కొ యీ కంబుకంఠి
చకచకలీను కనకపుష్యరాగంబు
మునుమొల్కయొక్కొ యీ ముద్దులాఁడి
పసలొల్కు జంబేటి యసలున నెసఁగు హ
రిద్రాంశమొక్కొ యీ విద్రుమోష్ఠి
వలరాచ మెచ్చు కల్వలరాచరా యింటి
దీపికయొక్కొ యీ రూపధన్య

గీ చెలిమిఁ బాయని శంకరోష్ణీషభో(గి)
భోగఫలకాగ్రమాణిక్యముల మెరుంగు
లంగములఁబట్టి విడువని యలఁతి చంద్ర
రేఖయొకొ యీ తుషారమయూఖవదన. ౬౪

గీ తొడరి యీపద్మదళనేత్రి తుడముగోడె
లంపు మేయంగఁబోలు నీలంపుశాల
నిజము కాదేని యీ నిగన్నిగదనంపు
నలువు బలువును నెందుండి కలుగనేర్చు. ౬౫

గీ. అతివ సకలాంగకంబులు నర్ఘ్యవస్తు
వితతిచేఁ జేయుచో ధాత చతురుఁ డగుచు

మగుడవైచిన యరచందమామ నిటల
మందుఁ జెందిన కందు కంపారు బొమలు. ౭౭

క. చెలి వీనులు విధిసంజ్ఞల
నలువారెడు కనకశాస(న)ములగుఁ గాదే
నలకాసన్నమహీస్థలిఁ
గలకాలముఁ జెలఁగుచెట్లు కాంతియుతములై. ౭౮

గీ. శబ్దవిన్నిత్యసంసర్గజగతియందుఁ
బెక్కు చూచినయవిగాన ధిక్కరించె
కమలజన్మప్రభావంబు కాంత కన్ను
లెందు వినుకలి గలవారి పొందు దగదె ౭౯

గీ కనకచంపకమోహనాకారియైన
నాసికాలక్ష్మిఁ గెడల నందముగ వీవఁ
బరఁగు పీలి చెరంగుల సురటులనగ
నొనరె తొంగలి రెప్పలీ యుగ్మలికిని. ౭౯

గీ. రతిరతీశ్వరు లుభయపార్శ్వముల నిలిచి
లీలమై నేయు నమ్ములు-గీలుకొన్న
గనకచంపకలక్ష్యంబుకరణి ధరణి
నయనపద్మాంతరంబున నాస దనరె ౮౦

క. ఎలనవ్వుమోము దెలిమొల
కలు దలకొన నొప్పు లచ్చి గప్పిన లవలీ
దళములచెలువున [1]వెల్వడు
కొలదులునే చెక్కు లమరెఁ గుటిలేక్షణకుఁ. ౮౧

గీ. వాసనానర్ఘ్య మార్ఘ్యలావణ్యవారిఁ
జాలఁ బదనెక్కు వజ్రశోభాలవాల

1. వెలదు.

ధాత్రి ము క్తప్రభాదోహదమున మొలచు
దాడిమీబీజరుచి కాంత దంతకాంతి. ౨౨

క రసదాళి చెరుకు రసమునఁ
బిసికిన శీతగుడము లింత బిగిసిన పదనుౘా
బసయును రా మధుసుధ లిడి
బిసరుహాభవుఁ డింతి కధరబింబముఁ జేసెౘా ౨౩

గీ అసమరేఖావిభూతిమై నంబుజాక్షి
కంధరాలక్ష్మి మెరయంగఁ గనియు శంఖ
పూగములఁ బోలఁదలఁచు పేబాగు దలఁప
గుల్లయును గొంటు ననిపించుకొనుటగాక ౨౪

గీ. (శై)లధరుఁ బైడిబిందెల జలకమార్చి
తమ్మి పూమొగ్గ లెక్కించి దాడిమీఫ
లంబు లర్పించి పూజాఫలంబు మహిమఁ
బొలఁతి పాలిండ్లు నేయగాఁబోలు నజుఁడు. ౨౫

క. నాళీకవదన భుజలత
లేలతలో దెలియ శక్యమే (మూ)లములౘా
రాలెడు నును గప్పురపుం బొడి
క్రాలెడు నడుచక్కి మానికపు విరిదండల్. ౨౬

గీ. నడుము చేయడు సతికంచు నలువఁ దూరఁ
దగ దతఁడు నేసె [1]నవహేమతంత్రి నదియ
కాదె యెట్లాడియో నాభికైతవమున
మిన్నదన మెచ్చు సుడిగొన్న(.)యు దిపుడు. ౨౭

క. అరవిందాస్యకుఁ దగు పిరు
దురుజంఘాశరధిసంగమోత్సుకవేణీ

---

1 నవహిమ

ఖరహరిదశ్వాత్మజకుఁ
గరమొప్పెడు సైకతంబుగతి నప్రతిమై. ౭౮

క. ధర కదళి కదళి కరభము
కరభము కరిరాజకరము కరిరాజకరం
బరయ తరళాక్షి తొడలకు
సరి మరి వస్తువులు తక్కు జగములఁ గలవే ? ౭౯

గీ. వినుతగోపుచ్ఛరేఖ భావనతఁ దాల్చు
తరుణి జంఘాద్వయంబుతోఁ బురుడు సేయ
హీనజోచ్ఛిష్టభాజనంబైనయట్టి
కాళె వట్టిన [1]కవి నోరు కాళెవట్టు. ౮౦

క. కన ద(నుప)మేయ మణి మం
డనములఁ గనుపట్టు సతి బెడంగగు పదముల్
కనకోత్సవబేరంబులు
వినుతింపఁగఁ గమరరూప విగ్రహములకున్ ౮౧

క. ఎవ్వనికి దొరకునొకొ యీ
జవ్వని యివ్వని వసంతసంతతలక్ష్మిఁ
మవ్వమగుకంటె నొప్పెడు
నివ్వనితశరీరకాంతి హేలామహిమఁ ౮౨

ఉ. ఈ యళినీలనీలకచ యెవ్వతియో యనుచుండ నీక్షణ
చ్ఛాయలు నల్లగల్వలు వసంతము గోమలపాదపల్లవ
చ్ఛాయలు క్రొత్త లత్తుక వసంతము మోహనదేహవల్లికా
చ్ఛాయలు రంగు బంగరు వసంతము నాడె నతాంతవక్త్రయై ౮౩

ఉ. రాజస మొప్ప నొయ్యన మరాళగతిం జనుదెంచి దాడిమీ
బీజగుణంబు మొల్లలకు బింబఫలద్యుతిఁ గల్గఁజేయుచుఁ

---
1 గవి.

రాజనిభాస్య వల్కు నను రాగమునం దన (బో)టిక త్తెతో
భూజలతావితానముల పోఁడిమి కెంతయు సంతసిల్లుచున్. ౮౪

క సకియ కనుఁగొనుము వన మిది
మకరపతాకానుచరుఁడు మధువు దనక చే
రికనేయు సొబగు బిగువునఁ
బ్రకటితముగ నినుమడించు ప్రభఁ దిలకించెన్. ౮౫

వ. అనవు డప్పడఁతి యోయనవద్యశరీర యీయుద్యానంబు నీ పలికినయట్ల నతిమాత్రశోభాపాత్రంబయ్యె ననిన నమ్మాట శ్రవణతాడితం బగుటయు లతావాటి మాటున నున్న తాటకారాతి యీపాటలామోద తన బోటి కత్తియను సర్వానవద్యశరీరయనక యనవద్యశరీరయనుట చాలునెయని తన యంతర్గతంబున నిర్వేదంబు నొంది యమ్మేదినీతనయం గనుం గొని. ౮౬

సీ. పరువంపు మంకెన విరుల తేనియ సోనఁ
 గురియు లేఁజిగురాకు క్రోవి మోవి
కడవాడి తెల్లమొగలి సన్నరేకుల
 [1]గొనబులు పచరించు కోపు చూపు
మధురమాధూకకోమలకళికాశ్రీకి
 (బు)వ్వంపుబంతి కపోలకాంతి
దాడిమీఫలబీజధాళధళ్యములకు
 వలనైన పేట పల్వరుస తేట
గీ. ఆస్య ముత్పుల్లకనకతోయరుహద త్త
దాస్య మభినవచంపకదళకలాప
నిభము లంగకములు నిత్యశుభములౌర
యీకలాలాపఁ గొనియాడ నెట్లువచ్చు ౮౭

1 కొనబులు

వ. అని ప్రకృతిరమణీయపదార్థపరిశీలనౌచిత్యచాతురీధురీణయగు నా కరేణు
గమనం గ్రమ్మరం గటాక్షించి. ౭౭

సీ. దిగుడుగాఁ జేయు నీ చిగురుటాకుంబోఁడి
యడుగులు మడుగుల యంబుజములఁ
గైవసంబుగఁ జేయు నీ వంజులామోద
కేలు బాలరసాలకిసలలక్ష్మి
నువ్వెత్తుగాఁ గ్రోలు నివ్వరవర్ణిని
యధరంబు మధురబింబారుణిమము
నగుచున్న దీనీలనలినచ్ఛటాలోక
తెలినవ్వు వలక్రొవ్వువలని తెలివిఁ
గీ. కౌఁగిటికిఁ దార్చు నీకంబుకంఠి రుచిర
కుచలికుచవైభవము పుష్పగుచ్ఛగరిమ
నొక్క నడవడిగాఁ జేయనోపు నౌర
దీని గమనంబు మత్తేభయానశోభ. ౭౮

గీ. అనుచుఁ బొదమాటు గొని రాముఁ డవనిజాతఁ
బొగడుతరి బోటికత్తియ పువ్వుబోణి
కలికలోచనురాణి గేహంబుఁ జూపఁ
జూచి యద్దేవిపై నిండుచూపు నిలిపి. ౮౦

చ. సిరి భుజమధ్య[1]వేదికడ శీలము సేసె మురారి మోముదా
మర నజు డిల్లుగా నొసఁగె మాటలబోటికి వారి కూరుముల్
మెరమెర నీ విభుండు నిను మేన సగంబున నిల్పె తల్లి యా
హరునకు నెంత కూర్చితొగదా మును సేసిన పుణ్యసంపదన్ ౮౧

గీ అనుడు జానకి వల్కు వయస్య యాస్య
నీరజారాతి నగవు వెన్నెలలు గాయ

1 వేదికందశిలము తెళ

నమ్మఁదగినట్టి పొగడితివమ్మ శంభు
నర్ధదేహంబు భ(క్తి)రత్నాకరంబు. ౯౨

గీ ఆనగేంద్రజ హరు మేనిలోన మేను
సొనిపె నింతియకాని యో కనకగౌరి
నీవు నీ ప్రాణవల్లభు నిండుమనసు
లోన జొనిపెదు మనసు నీయాన నిజము. ౯౩

వ. అనినం గినుకగాని కినుక నజ్జనకతనయ తన యనుంగు నెచ్చెలిం
గినిసి తొయ్యలి నీ యలీకాలాపంబులు చాలుఁజాలు ననుటయు నక్కుటి
లాలక నిటలతటంబున నంజలిపుటంబు ఘటించి కుటిలశశిశేఖరకు
నభిముఖియై. ౯౪

ఉ ఓ తుహినాద్రిపుత్రి తటిదుజ్జ్వలగాత్రి యభీష్టదాత్రి యీ
శీతమయూఖబింబముఖి సీత మదీయసఖీలలామ చం
ద్రాతపశీతలున్ గుణగణాన్వితుఁ జక్కని ప్రాణనాధు వి
(ఖ్యాత) భవత్కృపామహిమఁ గైకొను గావున నేటిరేపటన్. ౯౫

క నావిని దశరధనందనుఁ
డీవేలఁదికిఁ బెండ్లిఁగోరి యిటు వలికెద రీ
లావణ్యవతులు సమయమ
కావున భావజ్ఞులౌటగావున తారున్. ౯౬

వ. బంధూకాధర వయస్సంధిఁ బ్రవర్తింపుచున్నయదిగదా యని తదానన
విలోకత్రైలోక్యసామ్రాజ్యనందితుండై నృపనందనుండు. ౯౭

గీ. జారెఁ బాల్యంబు రాఁజూచె జవ్వనంబు
జరిగె ముగ్ధత తీండ్రించె జాణతనము
ప్రాయ మెద్దియు మదనమర్మంబు సోక
దింతి తనువల్లి కందర్పు ని[ఖవ]ల్లి. ౯౮

సీ ఇట మున్ను వెడలిపోయినది శైశవముద్ర
యష్టమీశశిరేఖ [1]నసదువోలె
రాఁగాచుకొన్నది రమణీయతారుణ్య
గరిమ తీవకు మధుస్ఫురణవోలె
నుడివోయినది మౌగ్ధ్య ముదితార్కుఁయగు
(తొలిసంజ) నిండుగ పద్మసరసివోలె
వచ్చుచున్నది మంజువైదగ్ధ్యవిభవంబు
వనవాటికకు గంధవహుఁడువోలె
గీ కొమ్మ తనువీథి కపురంబు గుమ్మరించె
ఇంచు రత్నావళికి నావటించియున్న
పచ్చి పవడంపు పెట్టియ భావమంది
చాలఁ జెలువొంది యున్నదీ వేళయందు. ౯౯

గీ అపుడు నెచ్చెలి జనకకన్యకగురించి
గౌరి వీక్షించి యో జగత్కమలసరసి
సరసిరుహాశత్రుశకలశేఖరునిరాణి
వేగఁ బూరింపుమమ్మ మా వెలఁది తలఁపు. ౧౦౦

వ అని మరియు నీశర్కరాధర చిత్తంబు చింతాకర్కశంబు గాకమున్న శుభోదర్కంబు సేయు మన్న నన్నెలంత పలుకులకు నలుక గదుర నుదిరి ధరాతనయ నయరహితయుంబోలె నదలించిన నది యాలకించి యా లక్ష్మణదేవుండు. ౧౦౧

క ఓ రాజహంస కన్యక
వైరస్యముఁ బొందనీకు వలవదు చూశ
క్ష్మారుహావిటపాంతరితా
కారుఁడు నీ విభుఁడు పీడె కదియఁగ వచ్చెౘ. ౧౦౨

---

1 నసుదు.

చ. అన విని సీత యిట్లను వయస్యఁ గనుంగొని యోవిశాలలో
చన మదమంథరద్విరదశాబకకంఠరనినాదమాధురీ
జనకవిరావ మొక్క టిదె సంధిలె వీనుల దీని చంద మె
ల్ల నరయఁబోలు రమ్మని చలత్కలహంసనమానయానయై. ౧౦౩

క ¹గొనబగు నొక లత మాటున
కనుగుం జెలిక(త్తె) వెంట నరుదేర ముదం
బునఁ జనుటయు నతివం
గనుఁగొని డెందమునఁ గోరికలు దైవారన్ ౧౦౪

ఉ ఆ రఘుభర్త పల్కె వినుమా నిను మార్కొని యీ మృగాక్షి బిం
బారుణమైన మోవిఁ జిగురాకులఁ జన్నవఁ బువ్వుగుత్తులన్
గోరకరాజిఁబల్వరుస గోమున వేమరు గ్రిందువేసి చె
ల్వారుటఁ గానవే లతిక యర్హమె మాటున దీని దాపగన్ ౧౦౫

చ ఇనతనయాతరంగముల నీదెడు మత్తమరాళివోలె జీ
వనదఘటాంతరాళముల వర్తిలు మించునుబోలె ఖాలలో
చనమకుటాపగాభినవశైవలవీధులఁ గ్రుచ్చియాడు తి
న్ననినెలవోలెఁ బ్రాయఁపు టనంటుల నీచెలి సంచరింపుచున్ ౧౦౬

వ. అని మరియుఁ గౌతుకంబున నొక్క కొదమ కదళిం గనుంగొని ౧౦౭

క ఓ పూప కదళి వినుము క
లాపిగమన తొడల సిరి వలయునేని నీ
వాపు మొకయింత నీ నతిఁ
బ్రాపించుం గళలు నీకు పరిచయలీలన్. ౧౦౮

వ అను నవసరంబున వసుమతీసుత సుమిత్రాపుత్రుం గనుంగొని యనుంగు
బోటితో నిట్లనియె. ౧౦౯

1 కొనబగు

ఉ. కాకరపండువంటి కనకంబునుఁ బోలెడువాఁడు ముద్దు పెం
గూకటివాఁడు సోగ నిడుగోపుల చూపులవాఁడు పింఛపుం
జీఁకటిఁ బ్రామి క్రొంజివురు చెర్విన పీనులవాఁడు కంతు పే
రాకలి మాన్పువాఁడు చెలువా చెలువొందెడువానిఁ జూచితే ౧౧౦

క ఈ చిన్ని యొప్పులానిన్
జూచిన యప్పటనుగొలె కిశోర స్తని యీ (?)
నా చిత్తము వత్సలతా
వీచీప్రక్షాళనమున వే చెలువందెన్. ౧౧౧

క. [1]వినుమేమీ చోద్యమ్మి
కనకసమానాంగవర్ణుఁ గన్నది మొదలన్
మన యూర్మిళ నామానస
మునఁ [2]దోచుచునున్నయది ప్రమోదం బెసఁగన్ ౧౧౨

క. అన నవ్వల సౌమిత్రియుఁ
దన మది నూహించి యీ యుదారచరిత్రన్
గనుగొన్న మొదలు మక్కువ
బెనగొని(యె సు)మిత్రయందుఁ బ్రియ మొందు క్రియన్. ౧౧౩

సీ అనునంత నెచ్చెలి యవనినందనఁ బల్కు
వనిత యీ చెలువుండు వత్సలద్ది
లాలనీయుఁడుగాగలా డొకానొకనికి
నితని తెరంగెల్ల నెరిఁగివత్తు
నని చేరబోయి యొకనకవర్ణశరీర
యే రాచకొమరుండ పీవు పూర్వ
పరిచితంబులుగాని ప్రమదకాంతారవీ
థులనొంటి జరియింపఁ దలఁక వనుడు

1. వినుమెమిసొద్యముయీ 2. దోపుచు

గీ. రాఘవానుజుఁ డనియె నో రమణి మూర్ధ
హృదయ పదపద్మమునఁ గల మెదుము చల్లి
రాతి సతిఁ జేయు తాటకారాతి యల్ల
వాడె యున్నాడు విను మొంటివాఁడ గాను ౧౧౪

క రామసనాథుఁ డనగు నను
రామా యసహాయుఁ డనగరా దనవుఁడు నా
భామ ప్రియమందె కోరిక
మామిడి నన లొత్తెనన సమాధానమతిన్ ౧౧౫

ఉ ఆయెడ సీత వల్కు సఖి నంగన యింటికిఁబోద మింకనే
లా యిటనుండనంచు నట యల్లన నించుక దవ్వు వోయి యో
రా యిది యెంత వింతగు (ప)రా కల చూతము చంద్రశీతల
చ్ఛాయము జూడఁ గావలయు చయ్యన నేగి యటంచు వెండియున్

క ఈః సహకారకిశోరము
వాసంతీలతికతో వివాహము నేయం
గా సముచిత మగునని తా
రాసపడినవారు తల్లు లంతఃపురిలోన్ ౧౧౬

వ. అని మరలి జనకసుత సంచారి కనకలతయుంబోలె కేళీవనంబున నాళి సహితంబు హరింపం దన డెందంబు తొగ మొగడకుం బూర్ణిమా (చంద్రు) చంద్రికయగు నా రాజకన్యకం గనుంగొని రఘూద్వహుండు.

చ కలువలఁ బోలనిమ్ము తెలిగన్నులు వెన్నెల వేల్పుసంపదన్
నెలకొనఁ జేయనిమ్ము జిగినెమ్మొగ మంబుజకోరకాకృతిన్
వెలయఁగనిమ్ము చన్నుఁగవ [పెంపి]ది యుక్తమె చూడ దీని యీ
[1] యలకలు చిమ్మచీఁకటుల యామిని నీనెడు నేమి చిత్రమో. ౧౧౭

1 కలకలు

ఆ వె అనుచు నలరునంత నాళీ నాళీకద
ళాక్షిఁ గాంచి యో మృ(గాయ)తాక్షి
చూతపోతకంబుఁ జూచితె [1]దీనికి
కలిగియున్న దెపుడు చెలువ మెల్ల. ౧౨౦

క రంగైనది వాసంతీ
సంగమసౌభాగ్యమునకుఁ జాలగ నిదియం
చుం గదియఁబోవుతరి రఘు
పుంగవుఁ డట తొలఁగి యొక్క పొద మాటుకొనన్ ౧౨౧

ఉ. ఆ జనకాధిరాజసుత యాళిఁ గనుంగొని పల్కు చూడు మం
భోజదళాక్షి యీ కొదమ బోదతనంబునఁ బొల్చు చూతధా
త్రీజ(ల)తామతల్లి దనరెన్ దను నేచతురుండొ యంటి వి
భ్రాజితలీల లేఁజివురుపైఁ బచరించిన (గోటి యొ)త్తులన్ ౧౨౨

క. ఆ తెరఁగు గాదు మరుఁడీ
చూతలతన్ గేల నంటి చూడఁగఁబోలున్
శాతోదరి తన విల్లని
చేతోగతిఁ దలఁచి సమతఁ జెలువై యునికిన్ ౧౨౩

క. ఆమూలాగ్రము(గ త)మ
శ్యామలయగు భ్రమరరాజి సంధిల్లుట నీ
భూమిరుహశాఖ సజ్యం
బౌ మన్మథు[2]విల్ల యేల యనుమానింపన్. ౧౨౪

వ. విశేషించియుం బ్రసవశిలీముఖంబుల నాముక్తంబయినయది యిది మదనధనుర్వలయంబ యనునంత నుపాంతలతాంతరితుండగు రఘునందనుం డన్యథావితర్కతార్కికత్వంబున నాకర్కశస్తవిగురించి.

1 దినికె. 2. విల్లయాల.

మ. వనజాతాక్షి మరుండు నీ మృదుతనూవల్లీమతల్లిన్ మదిన్
దన విల్లంచు దలంచి నెన్నడుము చేతం బట్టి తా నెత్తఁగాఁ
గనుపట్టెన్ ద్రిజగద్వశీకరణదీక్షాముద్రలై వ్రేళ్ళసం
దున వ్రత్తిల్లిన రేఖ లీ త్రివళులై నూత్నప్రభావంబునన్. ౧౨౬

వ అను నెడ సఖి జానకిం జూచి ౧౨౭

క గురువింద తీవెఁ గంటివె
కురువిందసమానరదన కొమరున నీ మై
నరవిం దలకొనియెడు దళ
దరవిందనిభాస్య మెత్తుమా కనుఁగొనుమా. ౧౨౮

క. చిరమందిరంబు దనకగు
నరవిందమునందు డెంద మానక యిందిం
దిర మీ గురువింద వలపు
టురులకు లోనయ్యె [1]వింత యొక చూపగుటన్ ౧౨౯

క. అనునపుడు రామచంద్రుఁడు
కనకతటిన్నిర్విశేషకాంతిఁ దనరు న
జ్జనకసుతఁ బొగడు లతఁ ద
త్తనువున నుపమించి సరసతామృదులోక్తిన్ ౧౩౦

చ. కలిగిన శైశవంబు చెలి కౌను విధంబున జీరువార ను
జ్వలనవయౌవనద్యుతి వసంతసమృద్ధి వసంతమాడ లేఁ
గులుకు మెరుంగు చన్నుఁగవ గ్రొవ్విరి గుత్తుల పొత్తుడాయ నీ
చెలువ శరీరవల్లి విలసిల్లె మదీక్షణభృంగసంగతిన్. ౧౩౧

సీ. లవలీవినూత్నపల్లవలీల నవలీల
గీమాడు చెక్కుల కిలకిలలకు
మరలేని పసిఁడి తామర పువ్వు మరపించు
కలికి ముద్దు మొగంబు కలకలలకు

1 దింత

కువలయవలయ(లక్ష్మి)ల నధిక్షేపించు
మించు వాల్గన్నుల మిలమిలలకు
శంపాలతలమీద జంపన[ ] యారి
తావి క్రొన్ననమేని ధళధళలకు
గీ. (లు)లితమదనమదంబులౌ [1]లలితములకు
ప్రహరణంబులు మరునకౌ విహరణముల
(కె)ల్లయగు దీని జవ్వనం బిరవుకొలిపెఁ
బదనుగల ప్రేమ మామకహృదయసీమ. ౧౩౨

చ. అను సమయంబునందు జనకాత్మజఁ గన్గొని బోటికత్తె యి
ట్లనుఁ గనుగొంటివమ్మ మగువా నగవారెడు మాధవీలతఁ
దన కనుమెచ్చువచ్చు పతిఁ దాన వరింపఁగడంగు కన్యయో
యన సహకారభూజము స్వయంగ్రహసౌఖ్యముఁ దార్పఁగోరెడున్

వ. అనుటయు సప్రణయకోపంబుగా నభూమితనయ తన ప్రాణకల్ప యగు మగువ నోయళీకజల్పిని నీతోడి దేమి నిన్ను నేడ కలిసెదనని మదకలకలహంసమధురంబగు బంధురగమనంబున నొక్కింత ముందరికిం జని మంజులంబగు వంజులలతానికుంజంబు సవిధంబున. ౧౩౪

సీ. చిప్పకూఁకటివాని చిన్నారిపొన్నారి
శీతాంశుమంతుని చెలువువాని
వెడఁదకన్నులవాని వికచోత్పలము నేలు
మెరుఁగుఁ జామనచాయమేనివాని
కలభయానమువాని వలుదలై జానువుల్
గడచిన భుజపరిఘములవాని
వెలఁది నవ్వులవాని విజయంపు సిరి యింటి
తలుపుఁ బోలెడు నురస్థలమువాని

1. లిలితములకు

గీ. భద్రకరమూర్తి మరు దండఁ బరగువాని
తరుగువోవని గుణముల తరుచువాని
జముని నేనియు నని వెన్నుఁ జరచువాని
రఘువరుని జూచె సీత విభ్రమసమేత. ౧౩౫

ఉ. చూచి విలోలలోచనరుచుల్ నవరాగకషాయితంబులై
లోచవిఁ జొక్క చెంగలువలున్ బలె కుంకుమమిశ్రఘర్మవా
ర్వీచులఁ ద్రోచి ముత్పులకరేఖలు ఝల్లన నంకురింప న
మ్మేచకమేఘనీలకచ మేనికి దూరము నేసె ధైర్యమున్. ౧౩౬

వ. అప్పుడు. ౧౩౭

చ. కనుఁగొని బోటి కూర్మిచెలికత్తియ నిట్లను మాధవీవిలో
కనకతుకంబు చాలు[1]నొకొ కన్నియ నీమదినన్న సీతయు
న్వినివిననట్లు భూపసుతునిన్ బొగడున్ మదనాస్త్రశంక న
ల్లన మకరాంకమంత్రపటలంబులలోఁ బరియించుకై వడిన్ ౧౩౮

సీ. అపుడు నెచ్చెలి చేరి యవనిజ యన్యచి
త్తయుఁ బోలియున్న - దీతరలనయన
కీమనోవైకల్య మెద్దానఁ గలిగెనో
యనుచుఁ జింతఁ జరించు నధిపసుతుని
వీక్షించి యీతఁడా యీచంద్రముఖి చిత్త
గంధగజముఁ గట్టు (క)ట్టుగంబ
మనుచు సాకూతనిజాంతరంగముతోడ
ధరణీశసుతకుఁ గైదండయొసఁగి

గీ. కన్యకామణి యక్కరగలవు నీవు
చెంగనాడకు మమ్మ నీ చెలుల నెల్ల
కాదకాని మనసు గని కలసిమెలసి
యున్నవారము మ(మ్మేల నొ)ల్ల వనిన. ౧౩౯

1 నొక.

వ. అప్పల్లవాధరి తన యుల్లంబు తెల్లంబుగా నీ హల్లకగంధి యెరింగెఁగదా యని [1]వెలవెల్ల నగుడు పొగడు వడయు జాణతనంబుగల యా ప్రాణ సఖి యా శశిముఖి లజ్జాసలిలనిమజ్జనంబు సేయుడు తన నేర్పును తెప్పం దేలింపుచు నిట్లనియె. ౧౪౦

క పట్టిన చలంబు విడువవు
కట్టా మామీద నేమి కారణమున కో
పట్టాభిషిక్తనందన
కట్టడి యోయమ్మ నీ ప్రకారము దలఁపన్. ౧౪౧

గీ అనుడు వీరలు నా చూచు నతని నెరుఁగు
వారుగా రేను కోపంబు (వచ్చునట్టు)
లురక తలవాంచి యుండ నిట్లూరడించు
చున్న వారని మది సీత యూహసేసి. ౧౪౨

వ. సఖీజనంబుం గలయం గనుంగొని ౧౪౩

ఉ. కూరిమి నెచ్చెలిం బలుకు కోమలి యీ మలినోక్తు లేటికి
నీ్మరలు నేనునా గలుగునే పొరపొచ్చెము లేశమైన నే
నూరక యన్యచిత్తనయి యుండితి నావుడు బోటి యిట్లనున్
జేరిచి తెందుపై నబల చిత్తము సంభృతధైర్యవిత్తమున్. ౧౪౪

వ అనవుడు. ౧౪౫

క. నారీమణి నా చిత్తం
బారామాయత్త మయ్యె ననవుడు నగి యా
కార [2]ప్రకటనమున నా
కారము మాటితివి మేలు కలికీ యనినన్. ౧౪౬

క. చిగురించు సిగ్గు ప్రేగున
మొగ మించుక వంచ నిందుముఖి మదకలమౌ

1 వెలువెల్ల 2 ప్రకటమున

మగతేఁటికొదమ వ్రాలిన
బిగువున నెత్తమ్మి వచ్చు బిసినియ పోలెన్ ౧౪౭

వ. ఇట్లవనతాననయగు నవనితనయం గటాక్షించి [1]యా విలాసవంచిత
పంచశరుండగు నరవరనందనుం డిట్లనియె. ౧౪౮

క ఎత్తు కమలముల మర్మము
లెత్తు భవత్తరలసరళవీక్షణములు భా
(స్వ)త్తనయాభంగతరం
గాత్తంబై దివి చెలంగ నమలతమాంగీ. ౧౪౯

వ అనునప్పుడు సప్రణయస్మితంబుగా బోటి సీత కిట్లనియె. ౧౫౦

క తలఁచిన పనులగు నిక నో
యలికులనిభచికురనికర యపలాలింపన్
దలఁపకు నీ మనసంతయుఁ
దెలిసితి కరకలితమణిగతిన్ దెల్ల మిగన్. ౧౫౧

ఉ. శ్యామలనీరజచ్ఛదవశంవదకోమలవర్ణునందు ని
స్సీమవికాసమానరకుశేశయహారివిశాలలోచన
శ్రీమహనీయునందు నునుఁ జీఁకటి కూఁకటిఁ బొల్చు రాముఁడన్
గామునియందు నిల్పితివిగా మది ప్రేమ దిదృక్షఁ బెంపగన్ ౧౫౨

చ అనవుడు సీతయిట్లనియె నాత్మసఖిం గని కంటివే సఖీ
జనమణి లేఁత మావి దిగజారెడు పువ్వుల తేనెసోన లోఁ
గొని మదనప్రియాచరణకోకనదార్పితనూపురధ్వనిన్
వినికి యొనర్చుచున్నయది వీనుల కింపుగ తేఁటి మాటికిన్. ౧౫౩

వ అని యాత్మగతంబున ౧౫౪

ఆ వె. కన్నులార మీరు గైకొనుడీ ప్రియ
జనముఖారవిందసౌరభముల

1 యీ

మేలు చంచలములు మీ రేడ యతఁ డేడ
యాస పెద్దగాన నంటిఁ గాక. ౧౫౫

చ. తొలఁగకు మింక నో కలికి తుమ్మెద యన్యమధుప్రియంబులుం
బలె బహువల్లివల్లభతఁ బట్టకుమీ యతిసౌరభద్రుని
ర్గళ(ద)మృతాంబుధారగల కమ్మదనంబులు నీకుఁ గల్గు నే
కెళవుల సత్పరిగ్రహసుఖిత్వము మెత్తు రుదాత్త మానసుల్. ౧౫౬

వ. అని లక్ష్మణాగ్రజుం దన మనంబున భావించు మించుబోఁడికిఁ బ్రాణ
సఖి యిట్లనియె. ౧౫౭

ఉ. ఓ లలితాంగి చూడు వికచోత్పలపత్త్రసమానకాంతులన్
(గ్రా)లుచునున్న[1]నీ కలికి కన్నుల చేరువ మాటిమాటి కు
న్మీలితపక్షపాతకమనీయత నీ యలిపోతకంబు మం
దాలసయానలీల నసియాడెడు భద్రము నీకు [2]నయ్యెడున్. ౧౫౮

వ. అనుటయు జనకతనయ తద్వచనంబు లాకర్ణించి కర్ణాంతవిశ్రాంతంబు
లగు తన కన్నులకు నవిచ్ఛిన్నంబుగాఁ దదాలోకనకౌతుకంబు గలుగు
టకు సుపశ్రుతిగా నూహించి కటాక్షాంచలంబుల నా రఘువంశశిఖాభర
ణంబు నారాధించె, నక్కాంతం గలయం గనుంగొని రామాలి లోచవులం
జొక్కుచు నంతర్గతంబున నిట్లనియె. ౧౫౯

సీ. సాంద్రయౌవనకళా(సర్వ)స్వగర్వంబు
నిఖిలభోగానందనిలయభూమి
భూరివిలోచనాంభోరుహభాగ్యంబు
బహుళబిబ్బోకసౌభాగ్యలక్ష్మి
భువ(న)త్రయీపరిస్ఫురితైకసారంబు
సాక్షాదభివ్యక్తజన్మఫలము
కుసుమశరాసనాకూతవిశేషంబు
కమనీయరాగసాగరహృదయము

---

1 పి 2 నయ్యెడన్.

గీ. తత్త్వ మభి(మ)తరతిమహోత్సవమునకును
హారిశృంగారమహితరహస్యముద్ర
కౌతుకామృతవాహినీస్నాతమైన
చంచలాలోక చూచు ముయ్యంచుఁ జూపు ౧౬౦

శా. వ్యావల్గత్కలశాంబురాశిలహరీవ్యాపారదృగ్ధారచే
నీ వామేక్షణ యే ముహూర్తమున నన్నీక్షించె నాయీ ముహూ
ర్తావిర్భావమ యెప్డు నాకు నగుగాకంచున్ విచారించి యే
లా వచ్చున్ దమ యిచ్చ దైవకృతము ల్భావింప నెవ్వారికిన్. ౧౬౧

వ. అని రఘూద్వహుండు నిరీక్షించు సమయంబున. ౧౬౨

గీ. అంతిపురమున విహరించునట్టి చేటి
యచ్చటికి వచ్చి రాజకన్యకగురించి
పలుకు విడివడ్డ రతికేళి చిలుకబోటి
నెలమి శారిక నలయించు కెలవు నిగుడ. ౧౬౩

సీ. తల్లి నీ కూరిమి తల్లులు నిన్ను దో
డ్కొనితేర నన్నిట పనిచినారు
నానావిధాభరణముల నీ నెమ్మేను
శృంగారితంబుగ నేయఁగోరి
చేయని శృంగార మీయున్న యునికని
యెరుఁగరా తారేమి యెన్నఁడైన
ముద్దియ య(ను)రాగముగ్ధలౌటయె కాదు
కేవలముగ్ధ లాహూవుఁబోఁడు
గీ లహహ స్వాభావికద్యుతి ననుపమాన
చంద్రకళయైన నీ తనూజాతిలతకు
క్రమనేపథ్యమను కళంకంపు తేఁటిఁ
దెచ్చి సంధించు వలవని తివుటకతన. ౧౬౪

వ. అది యట్టిదయగు నెట్లం టేని. ౧౬౫

ఆ వె. భామ నీ మొగంబు పరిపూర్ణశశి దంత
కాంతి కాంతచంద్రికావిభూతి
లలిత కువల(సుమ) పలాశఖఖూరికా
మృష్టదుగ్ధ[1]ధార దృష్టి దలఁప ౧౬౬

వ. అని యద్దాసి భూసుతం దోడ్కొని యంతిపురంబునకుం జనియె నంత
నక్కాంతగురించి. ౧౬౭

క. సప్రత్యూసుం డగుచు ర
ఘుప్రభుఁ డీక్షణపథంబు గురిఁ గడచిన (తా)
రాప్రియవదనఁ దలంచుచు
నప్రియుఁడగు మదను చేత కలయుచుఁ బలుకున్. ౧౬౮

ఆ వె ఈ సుధాకరాస్య యీమాట గ్రమ్మర
వచ్చునొక్కొ ప్రొద్దు వాలఁ దోచు
చంద్రలేఖవోలె చపలంబులైన నా
దృక్చకోరకముల తృష్ణ దీర ౧౬౯

గీ. అపుడు లక్ష్మణుం డిదెవచ్చె ననఘ యనుడు
రాముఁ డానందజలధినిర్మగ్నుఁ డగుచు
నింటి కేగిన యవ్వాలుగంటి మరలి
వచ్చెనో యను బుద్ధి నవ్వలను జూచి. ౧౭౦

వ. ఇది పైదలిగా దీతండు వేరొం డుద్దేశించి పలికె నను సమయంబున
లక్ష్మణుం డిట్లనియె. ౧౭౧

మ. మురజిత్తుల్యవిలాస చూడు మిదిగో ముగ్ధాంగలీలాజిత
స్మరబాణాసనయష్టియై పొడము నీ సారంగభృన్మూర్తికిన్

1. ధారా.

గరువం బిచ్చుచు రాగలక్ష్మి యొసఁగంగాఁ దారకాశ్రీమనో
హరమై లబ్ధపతింవరాప్రతిమసాయంసంధ్య వచ్చెం దగన్ ౧౭౨

వ. అనుటయు నది యట్టిద యగునని రామనరేంద్రుం డిట్లనియె. ౧౭౩

ఉ. ఈ రవిఁ జూచితే జగము లన్నియు నోలిఁ బ్రబుద్ధముగ్ధనీ
రేరుహకోరకంబులుగఁ గ్రీడయ పోలె నొనర్చి యిప్పుడీ
వారిధిగర్భసీమ కనివారణ నేగెడు తత్తపుత్తదై
త్యారిగభీరనాభివసదంబుజబోధమనీషనో సుమీ. ౧౭౪

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. ౧౭౫

క ఓ రఘువర చూచితె సం
ధ్యారాగము [1]గొంచెపడఁగ నలతితమము పై
జేరఁగ గగనాభోగము
నేరేడుం గలకపంటి నెరిఁ దులకించెన్ ౧౭౬

వ. అనిన రామచంద్రుఁ డది యట్టిదయగు నిపుడు. ౧౭౭

శా. జారస్త్రీనయనాంజనంబగు తమోజాలంబు ప్రాగ్దిక్తటీ
ప్రారంభింపఁగ బంధకీహృదయనిర్బంధంబు లిందుప్రభా
ధారల్ వెన్దెసఁ బర్వె లోక మిది యర్ధశ్యామలాశ్మార్థము
క్తారమ్యంబయి గాంగయామునపయోదాంపత్యముం దెల్పెడున్. ౧౭౮

వ. అని యాయవసరంబున సుమిత్రాసూతికి మిత్రుకులపవిత్రుం డపర
దిశాలి కవల మలయజతిలకవిశేషంబగు నిందుఖండంబుఁ జూపి
యిట్లనియె ౧౭౯

సీ. ఇదిగదా కవరాశి నెరియు జక్కవపుల్గు
ల మనంబు వేఁడి గాలాపుఁ గొంకి
యిదిగదా చాకోరవదనారరము వెడ
లించు చొక్కఁపు వెండి [2]కుంచెకోల

1. గొంచపడగ 2. కుంచకోల.

యిదిగదా దంపతీహృదయాల హాల్యాళి
మొలచు మన్మథశాఖి మొదటి మొలక
యిదిగదా యువకోటి యెదల మానఁపుఁ జలి
వదలింపఁజాలు జవాది [1]పంకి
గీ. యిదిగదా లోలకల్లోలహేలకలన
తన తనూలగ్నపంకంబు దలఁగఁ ద్రోచి
వాలికగు నీటి వశమున వంక వోయి
తనరు హరు మౌళి మిన్నేటి తమ్మితూఁడు. ౧౮౦

గీ. ఆకసము పేరి తామరపాకునకును
సలిలకణమగు నీ చంద్రకళ దనర్చె
కమ్మ పన్నీరు నించిన కంతు నింతి
కప్పురపు గిండి నాళరేఖయును బోలె ౧౮౧

వ. అని యింక నతిప్రసంగంబు వలదని మనుజపతితనయుండు గాధిసూతికిం
ద్రిదశార్చనోచితంబులగు పువ్వులు గొని చనవలయునని యందరుం
గూడి నిర్గమించి రప్పుడు. ౧౮౨

* * *

క. నందేలతిమ్మరాజపు
రందరచిహ్న ప్రసన్నరాఘవనాట్యా
మందప్రబంధరాజము
నందు ద్వితీయాంకమయ్యె నార్యస్తుతమై. ౧౮౩

★

1 హంకి ? వంకి.

# ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము

## తృతీయాంకము



క. శ్రీవె[ల]య నంత వచ్చిరి
యా వైదేహక్షితీశు నంతిపురములోఁ
గావలి దిరుగుచు నితవరు
లై వర్తిలు కుబ్జవామనాహ్వయు లెలమిన్. ౧

వ. అందు వామనుం డిట్లనియె ౨

శా. ఈనా యంగము లెంతయుం బొడవులై యిట్లున్కి మై ద్రిమ్మరం
గా నీ ద్వారము నుత్తరాసి [1]విరుగుంగా మస్తకాఘాతమై
యానా నిందులకుం గలా దొక యుపాయం బెట్టులన్నన్ వపు
ర్మానాకుంచన మర్హ మిట్టియెడఁ బల్మారేల చింతింపఁగన్. ౩

వ. అని తన యంగకంబులు ముడింగించి చరించు వామనకుం గాంచి
కుబ్జుం డించుక నవ్వి నివ్వెర గదుర నిట్లనియె ౪

గీ. ఓయి చెలికాఁడ నిఖిలగుణోత్కరంబు
నొదవె నీయందు నెటులన్న మొదల వామ
నుండవయ్యును నిపుడు కుబ్జుండవైతి
వనిన సక్రోధుఁడై యతఁ డతనిఁ బలుకు. ౫

క. ఔరా మూర్ఖా నాపై
నారోపించెదవు నీదియగు కుబ్జత యీ
ద్వా(ర)శిఖరభంగభయము
గూరుట యిమ్మాడ్కి మేను గొంచెపరచితిన్.

---

1 విరుగంగా

సీ. అనుడు కుబ్జుఁడు వల్కె హాసార్ద్రవదనుఁడై
కటకటా [1]జిట్టెడుగాని లేదు
నీదు శరీరంబు నింగి మోచిన ద్వార
శిఖరంబు నిది యెట్లు శిధిలపరపఁ
గలదు దబ్బరలాడఁగానేల యేను కు
బ్జుండని నీకు నెవ్వండు దెలిపె
రూపధన్యులఁ జూచి రూపహీనులు నింద
గావింతురన్నుట నీకడన గలిగె
గీ. ననుడు వామనకుఁడు వల్కె నహహ యొరులు
దెలుపఁగానేల నీ కల దేహరేఖ
[2]వృషభకకుదంబునుంబోలి వీపునందు
గుంతవోయిన యీపెద్ద [3]కంతి ప్రేల. ౯

గీ. అనుడు కుబ్జుండు వలుకు నోరన్న మిన్న
కిటుల వోనాడవలవ దీవెరుఁగ వింత
గంతి గాదిది సౌభాగ్యకమల యొరఁగఁ
బొందుపరచిన యుపధానకందుకంబు. ౧౦

చ. అనవుడు వామనుండను వయస్య పురే నిలు రాజవల్లభా
జనగృహరక్షణాక్షణవశంవదులౌ మనవంటివారికిన్
జనదు స్వరూపవర్ణనము సల్పుట యేలినవారు విందురేఁ
గినియుదురన్న గుబ్జకుఁడు గిర్భున నిర్భయవృత్తి నిట్లనున్. ౧౧

క. వామనక మనకు వలవదు
రా మది భయమంద నిపుడు రాజున్నా డే
మేమియొ గ్రంథవిశేషము
లోముచు ధ్యానంబుసేయ నోవరియింటన్. ౧౨

1 జుట్టెడు 2 వృషభకకుదంబుబ్బుబోలి వీపునందు 3 గంతి

వ. ఈ చేర్వ సుర్వేశ్వరుండు లేడనిన వామనకుం డిట్లనియె. ౧౧

ఆ. వె అటులు గాదు రోరి యధిప (వీ)డెవ్వఁడో
యొకమహర్షి వచ్చుచున్కి దనకు
వీనుబండువైన వెసఁ దదాగమనంబు
వార్చి వెడలివచ్చె వాడె కంటె. ౧౨

చ. అనవుడు కుబ్జు డక్కటకటా యిది మిక్కిలి గస్తి వచ్చె నీ
జనకుఁడు యాజ్ఞవల్క్యమునిచంద్రునిచే నొక డెట్టివిద్యయో
కని పనిమాని రేవగలు కన్నులు మూసియ యున్నవాఁడు ని
ర్మనుజగృహాంతరాళమున మజ్జనభోజనచింత లేదెదఁ. ౧౩

గీ ఇందు మీఁదట నితనిచే నెద్దియైన
నొక్క యుపదేశ మందెనే నుజ్జగించు
నిల్లు ముంగిలి రాజితం [డె]ట్టి(డై)న
క్షపణకుఁడువోలె మన నేవ జారవిడుచు. ౧౪

వ. అనవుడు వామనుం డిది సత్యంబ ఈ వచ్చు నీవారముష్టింపచుం డష్ట
మూర్తిధనుర్దర్శనంబు కోరి కాని యుపదేశకారియై వచ్చువాఁడుకాడనిన
కుబ్జుండు వెండియు నిట్లనియె ౧౫

ఉ. మేదుర(హో)మధూమపరిమేచకలోచనుఁడై నిరంతరా
హ్లాదమునఁ జపంబ పనియై మనువానికి నేల మన్మథ
చ్ఛేదిశరాసనంబుపయి చింత తలంపఁగ నిట్టి వీతమ
ర్యాదములౌ ప్రయోజనము లర్థ్యములే మహిదేవజాతికిన్. ౧౬

వ. ఐనను వేరొండు గలదు. ౧౭

గీ. కేవలబ్రాహ్మణుండుగా డీవరర్షి
క్షత్రియబ్రాహ్మణుండేమొకాని యనుడు
వామనుఁడు వల్కు నీ మేని వడువున[ను] భ
వన్మనీషయు వక్ర గావలయు నోరి. ౧౮

వ. ఇమ్మహానుభావుండు సత్యంబు క్షత్రియబ్రాహ్మణుండ యగు సందియం
బేల బేలవే యనిన కుబ్జుం డిట్లనియె ౧౯

క. వామనక యిట్టిదేనియు
నీముని బహువిధముగా ననేకతపంబుల్
కామించి సేసి దప్పిన
గామిడి మనరాజు సిరికిగా [1]నరుదెంచున్. ౨౦

ఆ. వె. అతఁడు కఠినహృదయుఁ డత్యంతమృదుమతి
యీ ధరాధినాథుఁ డేమియగునొ
యనిన జెవులు మూసికొనుచు శాంతంపాప
మనుచుఁ గుబ్జతోడ నతఁడు పలికె. ౨౧

ఉ. ఈవిటులాడ కుగ్రతప మీతఁ డొనర్చి విధాత వల్కు వా
చావిభవంబుచేఁ దనదు క్షత్రియభావము నుజ్జగించి భూ
దేవతయైనవాఁ డనిన దేశములో నివి గొన్ని బద్దులా
వావిరి నీదు మేని క్రియ వామని నీ మతి యోరి వామనా! ౨౨

గీ. నమ్మదురె లోకవృత్తాంతనాటకంబు
నెందు నొకఁడాడు మాటచే నెవ్వఁడేని
విప్రుఁడయ్యెనయేని వేవేగ నీవు
బ్రాహ్మణుఁడవగు మామకభాషణమున ౨౩

ఉ నావుడు వామనుం డనియె నవ్వుచు నౌనవు లెస్సమాట యో
రీ వినువారు నవ్వ నిటు లెవ్వఁడు వల్కుర ప్రేల నేర్చితే
నీవును బ్రహ్మదేవునకు నీకును నెంతటి యంతరంబు దు
ష్టా విడు మోరి వెక్కసము జాలుఁ బురే యనఁ గుబ్జుఁ డిట్లనున్. ౨౪

క. తగవా నిక్కపు బ్రాహ్మణుఁ
డగునేనియు చాపయష్టియందలి తమకం

1. నరుదలచున్

బగణితవిజ్ఞానకళా
నిగమజ్ఞున కితని కధికనిష్ఠానిధికిన్ ౨౫

వ అనుటయు ౨౬

ఆ. వె వామనుండు వల్కె నీ మహాత్ముఁడు వచ్చు
కార్యమునకుఁ గలదు కారణంబు
రాజపుత్రయుగళ మీ జటిలవతంసుఁ
గొలిచియున్న దస్త్రకోవిదంబు. ౨౭

క. ఆ రాకొమరులకుం బుర
వైరి ధనుర్లతిక చూపువాఁడై మునికం
రీరవ మీతఁడు జనక
క్ష్మారమణునికడకు వచ్చెఁ గౌతుక మెసఁగన్ ౨౮

గీ. అనిన గుజ్జకుఁ డీవిమలాంతరంగుఁ
బోవనాడుట పాపంబు పొదివెఁ దన్ను
ననుడు వామనకుఁడు వల్కె నధికపాప
మెలసె విను పాపమాత్రమాములనకాక(?) ౨౯

వ అనవుడు. ౩౦

ఉ కోపకషాయితా(క్షుఁడ)యి కుబ్జుఁడు వామనుఁ బల్కె మూర్ఖ రా
(రా) పరిహాసపేశలత నర్మిలి వియ్యమువారితో(డ స)
ల్లాపము లాడఁ బాతకములాయవి నన్ వెరపించనేల నీ
వోపవు ధర్మమర్మమహిమోదధియందలి మేలుఁ గానఁగన్. ౩౧

క. భూతలపతిసుతు లిద్దరు
సీతనివారగుట మన మహీనాథతనూ
జాత లిరువురును మనవా
రై తనరుట నవ్వఁబోలదా సంబంధిన్. ౩౨

వ. అనిన వామనకుండు మనకు నీదృశంబగు పుణ్యపరిపాకంబు సిద్ధించు
నొకొాయని నిట్టూర్పు నిగుడించె నంత నేపథ్యాంతరంబున ౩౩

ఉ తోరఁపుఁ జిప్పకూఁకటులతో నిజబాల్యదశాసమర్థ్యాశ్ర్యం
గారముతోఁ దనుం గొలుచు [1]గాదిలి తమ్మునితోడఁ దాటకా
వైరి సరోజబంధుకులవర్ధనుఁ డర్మిలి తజ్ఞ భజింపఁగా
వారని వేడ్కఁ వచ్చె గుణవారిధి గాధితనూభవుం డొగిన్ ౩౪

వ అని వినవచ్చుటయు వామనకుండు హర్షవిస్మయోత్కర్షంబున. ౩౫

ఉ. హాటకశైలసారఁ గటుహాసమహారభటీహృతాష్టది
జ్ఞాటకఁ దాటకం గెడపినాఁడట చయ్యన రామభద్రుఁ డీ
మేటియ మేల్మివిల్తువిలు మిన్నక యెక్కిడనోపు భట్టినీ
కోటికి మేలువార్త శ్రుతిగోచరఁగా నొనరింపఁగాఁ(ద)గున్. ౩౬

క. అని కుబ్జసహితుఁడై వా
మనకుఁడు డెందమున సంభ్రమము ననురాగం
బును బెనఁగొనఁగా నయ్యెడఁ
జనియెన్ శుద్ధాంతమునకు సత్వరగతిమై ౩౭

ఇది ప్రవేశకము

క. ఆయెడ సరామలక్ష్మణుఁ
డై యల గాధేయుఁ డచటి కరుదెంచి ప్రమో
దాయత్తచిత్తుఁడయి (రఘు)
(నా)యకుతో ననియె సూర్యునకు నభిముఖుఁడై. ౩౮

శా. ఆ సూర్యుం గనుఁగొంటె కైరవకులాయాసంబుఁ జక్రద్వయీ
శ్వాసంబున్ జలజాతకోరకముఖవ్యాసంబుఁ దారాగణ
గ్రాసంబున్ దిగరాళదృక్కుచతటీప్రత్యగ్రకాశ్మీరవి
న్యాసంబున్ శితభా(ను)మండలపరీహాసంబుఁ జేసెన్ బ్రభన్. ౩౯

1 కాదిలి.

వ. అని చూపిన కృతాంజలియై రఘుకుంజరుండు. ४०

క. నాళీకకాననంబుల
లాలింపుచుఁ గోకమండలములఁ దయచేఁ
బాలింపుచు జగములు సం
క్షాళింపుచు వెలయు నీకు సన్నుతి హేళీ. ४౧

వ. అను సమయంబున కుశికతనయుం డంతర్గతంబున నిప్పు డేఁ దోడ్కొని వచ్చు రామచంద్రునకు జనకుండు తన తనూజాత సీత నొసంగునో యనునెడ లక్ష్మణుండు రామున కిట్లనియె ४౨

చ. తెలివిఁ బ్రభాతకాల ముదధిం గొనితెచ్చు త్రిలోక(ర)త్నముఁ (జల)రుహబంధుబింబము నిజంబుగ [1]నెప్పుడు నిల్పె నంబర స్థలవిపణిఁ సరోవరము దా నటమున్న తల(ంచి) యీడుగా వెలయును దెచ్చె నందదరవిందవనేందిర పేరఁ జూచితే. ४३

క. అన విని సంతోషంబు(న)
తనలోఁ గౌశికుఁడు రాముతమ్ముఁడె యూహిం
చి(నప)నికి నుత్తరం బి
చ్చెను దైవవశంబుగాదె శిశువాక్య మిలఁ ४४

క. ఆయెడ రాఘవుఁ డో గా
ధేయా! యీపట్టణంబు ద్విరదరథభటా
శ్వాయత్తమయ్యు శాంతం
బై యున్నది కంటె మునిజనాశ్రయనిభమై. ४౫

గీ. అనవు డిదియేమి చోద్యంబు వినమె యాజ్ఞ
వల్క్యహితశిష్యజనకని(వా)సమగుట
ననుడు యోగీంద్రుఁడనగ విఖ్యాతిఁ గన్న
యమ్మునీశ్వరుఁడా గురుండతని కనిన. ४౬

1 నొప్పుడు

గీ. జలజహితపాదసేవాప్రసాదమహిమ
నలఘుయోగీంద్రకీర్తికి నిలయ (మయ్యె)
పద్మకలసద్మమనఁగ నేభవ్యమూర్తి
యా మహాత్ముఁడే దేశికుం డతనికనఘ. ౪౭

వ. అని మన మింక జనకమందిరంబునకుం జనవలయునని యనుమోదం బెసంగ బిసరుహాసనకుం బ్రిసరమణు లేర్పరించి నించిన పసిండి హరివాణంబునుంబోని దివాణంబు ముంగిటి [1]మానికపు నెలకట్టుం జుట్టు బయ లల్లంతన నయనగోచరంబగుచుండఁ జనునప్పుడు ౪౮

క. చల్లుడు కుంకుమరసములు
మొల్లమిగా ముత్తియముల ముగ్గులు దీర్పుం
డెల్లెడ నెరపుడు పువ్వులుఁ
బల్లవములు పౌరసతులు పట్టణవీథిన్ ౪౯

క. అని వినఁబడుటయు కౌశికుఁ
డనియె న్మన రాక చూచి యలరు శతానం
దుని వాక్యము లవి యీతని
యనుమోదము గంటె చిత్రమైనది తెలుపఁగా. ౫౦

గీ. మగుడఁ గై సేయు మనియెడు నగర మిట్టి
వాఁడు గలఁడొకొ యనునంత వచ్చి తనకు
వందనము సేయు నా శతానందుఁ జూచి
మనుము చిరకాలమనుచు దీవన యొసంగ. ౫౧

గీ. ఆ శతానందుఁ డోమహాత్మా విదేహ
రాజు దె(ందం)బులోన (మీ రాకఁ)గోరి
యెదురు చూచుచు నున్నవాఁ డిప్పు డనవు
డనియె గాధేయుఁ డా గౌతమాత్మజునకు. ౫౨

1 మానెకపూనెలకటుంజుట్టుబయల

క విను మీజనపతి యా రే
డెనిమిదియగు నంగములఁ ద్రయిన్ రాజ్యరమన్
ఘనయోగవిద్య నెంతయుఁ
దన వశముగఁ జేసి (మను)ఁగ(దా) యెల్లపుడున్. ౫౩

వ అను సమయంబున [1గృతాంజలియై ప్రవేశించి జనకుండు శతానందుం
గనుంగొని యిట్లనియె] ౫౪

గీ కడిమి నెవ్వాఁడు విజతపోగాఢవహ్ని
నాత్మ బంగారమునుబోలె నరగఁ గాచి
మొదలి వన్నెకుఁ దెచ్చి తా నెదురులేక
యొసఁగు నల గా(ధి)త(న)యుఁడా యీ తపస్వి ! ౫౫

గీ అనుచు దగ్గరఁ (బో)యి యో మునివరేణ్య
కామితైకఫలోదయారామమగు బ్ర
ణామ మిదె నీకు నావు డో భూమహేంద్ర
రమ్మ సంకల్పసిద్ధుఁడు గమ్మటంచు. ౫౬

క 2చేసె తన దీవన నుచి
తాసనముల నందరు(ను) సమాసీనులరై
భాసిలుచు నపుడు కౌశికు
నా సీరధ్వజుఁడు వల్కె హర్షం బెసఁగన్ ౫౭

వ. ఈ మహేంద్రసాధారణంబు నాకు నవరేణ్యంబగు నది యెట్లంటేని.

క. ఏసీ పదవందనవిధి
చే నందిన సౌఖ్య మల శచీరమణమహో
ద్యానీభవమై(న) నవస
న్తానంబున నందఁ గుశికనందన వింటే. ౫౮

1 గృతప్రవేశుండగు శతానందుం గనుంగొని యిట్లనియె. 2 చెసెతనదివని

ఆ. వె. అనిన గాధితనయుఁ డవనీశ సహజసౌ
ఖ్యాబ్ధిమగ్నుఁ డయ్యు నలరె దస్మ
దాగమమునఁ బొడము నానందశీకరా
వళికి నీదు చెలిమిఁ దలఁప వశమె ౬౦

ఆ. వె. నావు డిట్టులనియె మావంటి రాజ్యోప
రాగయుక్తహృత్కురంగచిహ్ను
లైనవారి కేల యానందచంద్రిక
గలుగనేర్చునయ్య గా(ధి)తనయ. ౬౧

క అన విని యా మునిపతి యో
జనకక్ష్మానాధచంద్ర జగమున నితరా
వనిపాలుర కగు నీ విపు
డను నర్థము మీ చరిత్ర మటుగాదు సుమీ. ౬౨

మ. వరసింహాసనలక్ష్మి రాజ్యము నఖ(ర్వ)క్షాంతిఁ బద్మాసనేం
దిరయుం దెల్ప గుణాహతిప్రణవముల్ దేరన్ భుజాస్తంభకం
ధరలన్, క్షాత్ర[1]చిదేకతేజము(లు) గోత్రాహృత్తులన్ మీర నే
నరనాధుల్ విహరింతు రట్టి నిమిసంతానంబు మీరే కదా ౬౩

వ. అనిన శతానందుండు కుశికనందనుం జూచి యిట్లనియె ౬౪

గీ. ఆతపత్రాబ్జములు వధూహస్తచలిత
చామరోర్ములు గల రాజ్యసరసి యందు
నమలయోగీంద్రచంద్రసుగమపదంబు
నందు వర్తించు నీ రాజహంస వితతి ౬౫

క. అన విని లక్ష్మణుఁ డా రా
ముని గని నృపులయ్యు వీరు మునివరుల తెరం

---

1. చిద్రైక

గున బ్రహ్మవిద్యచే ఘను
లని విని నా మదికిఁ జోద్య మయ్యెడు ననఘా. ౭౭

వ అనిన లక్ష్మణాగ్రజుండు లక్ష్మణుం జూచి యిది యేమి చిత్రంబు
వినుము. ౭౮

చ. చలమున నే వెలుంగుఁ జలచామరవాయువు నార్పఁ గాదు చి
ప్పిలు కరిదానపంకమషి పేరి కలంకముఁ జెందలేదు వె
న్నెల వలి దెల్పు ఛత్రముల నీడయు నాపఁగఁ జాల దా మహో
జ్వలరుచి నీ నృపాలమునిజాలము లీల భజింపు నెప్పుడున్ ౭౯

గీ. అనుడు గౌతమసూతుతో ననియె గాధి
తనయుఁ డీ విశ్వ[1]కువలయోత్తంసరాజ
హంసతతి రాజహంసచయంబె తప్ప
దహహ యుచితంబు వలికితి వనఘ నీవు ౮౦

క. నావుడు విశ్వామిత్రున
కావేళం జనకుఁ డనియె నస్మత్ప్రాచీ
నావనిపతులకుఁ దగు గా
కీ వినుతులు దగునె పల్లె లేలెడు మాకున్ ౮౧

క. అనుటయు గాధితనూభవుఁ
డనఘా జనకక్షమాధవాధ్యక్ష! మహా
వినయివి గావున నీ విటు
లనుకొనుటలు సహజమైన నటుగాదు సుమీ! ౮౨

చ. వసుమతి నెంద రేలినను వారికి భూపతికీర్తి గల్గ దీ
వసుమతి నీక తక్క నొక వాలిక కన్నుల ముద్దు పట్టి న
వ్వసుమతి గాంచి నిన్ భువన(వా)టికఁ గూతులఁ గన్నవారిలో
మిసిమిగఁ జేసెఁ గావున నిమిక్షితిపాన్వయ రాజశేఖరా! ౮౩

---

1 కుతల

గీ. నావు డిట్లను మునినాయకా (వి)నూత్న
లోకనిర్మాతవై యొప్పు నీకు నిట్టి
నవ్యవచనైకరచనాచణత్వ మెంత
యనుపమేయంబు నీ మహిమాతిశయము. ౭౩

మ. కినుకం గెంపు వహింపు చూపు కణికం గీర్వాణచిత్రంబు మి
న్నను భిత్తిన్ రచియించు నీకు మునుసేయం బోల్చు గల్హారవ
ర్ధనసంవర్ధనమండలంబులు సుధా[1]లాక్షారసాపూర్ణభా
జనముల్గా నరవిందనందననుతిస్థానంబవై యొప్పవే. ౭౪

క. అనుడు శతానందుం డో
జనకక్ష్మానాథ భువనసన్నుతుఁడగు ని
మ్మునినాథుఁగూర్చి నీ ప
ల్కిన పల్కులు సత్య మితనికిన్ బ్రతి కలరే. ౭౫

ఉ. సంచితమన్యుఁడై యల త్రిశంకుని స్వర్గము వెళ్ళిపొమ్మ హు
మ్మంచు బలారి గర్వితపదాబ్జుఁడుఁగా ననివార్యలీల గ
ర్వించె సురల్ కరాబ్జములు ప్రేమ మొగుడ్ప [2]మొగిడ్చె నీ తపః
కాంచను నవ్వె దేవపురికా[3]రచనోద్యమ మేమిచెప్పగన్. ౭౬

వ. అను సమయంబున సుమిత్రానందనుండు కౌసల్యానందనుం గనుంగొని ప్రతాపితభువనవితానంబగు నిమ్మహాత్ముని తపోవిధానం బిట్టిదియె యనిన రామచంద్రుం డిది జగద్విదితం బెట్లంటేని. ౭౭

గీ. శక్రపదహతి వ్రాలు త్రిశంకుఁ జూచి
కినుకఁ గెంపగు నితని చూ పనిమిషాలి
చేత (స)ంధ్యయుఁబోలె భజింపఁ బడియె.
కుట్మలీకృతకరపద్మకులము(గా)ఁగ. ౭౮

---

1. రాక్షారసా 2 మొగిడ్చు 3. రచమోద్యమ

సీ అనిన విశ్వామిత్రుఁ డంతట మిథిలాపు
రీనాథ వినుము నీ మానసంబుఁ
గై సేయునే రత్నగర్భాసముద్భూత
మైన కన్యారత్న మనుదినంబు
నావు డిట్లను మీ కృపావిశేషంబున
నేతత్క్షణంబ జామాతృమణియు
శంక యింతయులే దలంకరించు నటంచు
రామచంద్రునిఁ జూచి యో మునీంద్ర.
గీ సకలలోకవిలోచనోత్సవనిదాన
మగుచు మరకతమయసుధాహారభూరు
హాభిరామాకృతిఁ [దగ] నతిశయిల్లు
నీతఁ డెవ్వాఁడు వివరింపవే తెలియను. ౭౯

వ అనునెడ శతానందుఁ డిట్లనియె. ౮౦

చ వెలదుక కంటి చెంగట చెవిం దవిలించిన తేఁటి దాయ పూ
గొలకయుఁ బోలె కుందనపుఁ గ్రొంబస లామెత సేయ మేన ను
త్పలదళవర్ణుఁడౌ నితని దండనె చూపులపాలి పండువై
వెలిఁగెడు నీతఁ డెవ్వఁడొకో వెన్నెలఁ దేరెడు మోము చిన్నెలన్.

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౮౨

గీ. రామలక్ష్మణు లీ కుమారకుల నామ
మనవు డాశ్చర్యమును జెంది జనకనృపతి
నవసుధాధార యయ్యెఁ గర్ణముల కనవు
డనియె నాంగీరసుఁడు గాధితనయుఁ జూచి. ౮౩

గీ ఇపు డొకానొక స్వజనత్వ మీ స్వభావ
బాంధవోదారరూపసంపన్నులందుఁ

1 డంతక.

గానవచ్చుచు నున్నది కౌస్తుభామృ
తాంశుబింబంబులకుఁ బోలె నభినవముగ. ౭౪

వ. అనిన జనకుం డిట్లనియె. ౭౫

ఆ. వె. భశిర ప్రత్యగాత్మ పరమాత్మలకుఁ బోలె
ప్రకృతిరమ్యరూపబాంధవములు
గలుగు వీరియం దొకానొక (యా)ంతర
సన్నిధాన మెసఁగుచున్న దిపుడు ౭౬

మ. అనినం గౌశికుఁ డోయి యోగివరశిష్యామేలుమే లట్టి నూ
తనగంభీరవచస్సుధాజలనిధిన్ దానంబు గావించు నీ
మనసే యచ్చెరు వీ కుమారకుల సమ్యగ్బంధుబావంబు చూ
చినఁ గాన్పించదె నావు దైన మునిహస్తి భ్రాత లేమోకదా ౭౭

క. సలలితహేమప్రసవో
త్పలవర్ణులు కనకనీలధాత్రీరుహపే
శలు లక్షిసుఖవిధాద
ఘలు లక్ష్మణలక్ష్మణాగ్రజులు శుభమూర్తుల్. ౭౮

క. అని వెండియు డెం(దంబున
న)నురాగం బెసఁగ రాము నభినవకామున్
గనుఁగవ పండువు చేయఁగఁ
గనుగొని యిది యేమియొక్కొ గాధితనూజా ౭౯

గీ. సమధికోత్సవసుభగభోగముల నమరి
భవకథాపథదూరుఁడౌ పరమపురుష
నందుఁబలె నందదుత్పలశ్యాముఁ(డై)న
రా(ముపై నా మ)నంబు విరాళిఁ గొనియె. ౮౦

గీ. అనిన నమ్మునీంద్రుఁ డాత్మలో నిది యుక్త
మఖిలనేత్రశీతలాంశు[1]వైన

---

1. శైన

నెలకుఁ బార్వతీశు తలనున్న క్రొన్నెల
కెన్నఁ గలదె భేద మింతయైన. ౯౧

వ అని ప్రకాశంబుగా నిట్లనియె. ౯౨

గీ. భూతలాధీశ వింటె రూపా(తిశయము
మహిమ యి)ది నావు డీ మహామహులఁ గాంచి
పుత్రవంతులలోపలఁ బొగడు గన్న
యాతఁడెవ్వాడొ చెప్పుమా యనఘ యనుడు ౯౩

చ ఇవి హిమరుఙ్మరీచులొ మహేంద్ర[1]నదీవలమానవీచులో
ధవళసరోజరోచులొ యుదంచితకేతకసూచులో యటం
చవిరళమోదమేదురత నామరతామరసాయతేక్షణల్
పొవడఁగ నేనృపాలకులపుంగవు కీర్తులు ద్రొక్కి దిక్కులన్. ౯౪

క. అనునెడ రాముఁడు లక్ష్మణుఁ
గనుగొని యో వత్స సుగుణ[గణ]గణ్యుండొ
మన యయ్యం గొనియాడెద
రనవు డతఁడు మరియుఁ బొగడునది విను మనఘా! ౯౫

వ. అనుచుండ విశ్వామిత్రుండు జనకజనకాంతున కిట్లనియె. ౯౬

ఉ. ఏ నృపదంతియేని మదమెత్తి కరంబునఁ ద్రిప్పు వింటి లీ
లానటనంబు భ్రూయుగవిలాసము దానవరాజకాంతలం
బూనఁగనీక [2]గొప్ప శచి ముద్దుల గోరి మిటారి దారిచే
మై [3]నిశితాంకురక్షతరమణ బురుహూతుఁడు దాల్చు నిచ్చలున్. ౯౭

క. ఆ వనజమిత్రకులవసు
ధావరకోటీరమణికి దశరథునకు నీ
లావణ్యజితమనోజులు
భూవలయోద్ధరణదక్షభుజులు తనూజుల్.

1. నిది. 2. గొప్పఁ. 3. నిశితాంకుగరక్షతరమన్

వ. అనిన జనకుండు కౌతుకాయత్తచిత్తుఁడై యిట్లనియె. ౯౯

చ బలిమిఁ దెమల్ప నంటిన విపక్షవధూనయనాంజనంబునా
నెలవగు శింజినీకిణవినీలిమ నెవ్వని కేలు దాల్చు నే
బలు దొర చాపటంకృతులు పానము నేసె ననంగ శాత్రవీ
కలమణిమేఖలాక్వణనగర్వము సర్వము డుల్లు నెల్లెడన్. ౧౦౦

వ. మరియును ౧౦౧

ఉ. ఎవ్వని బాహు లింద్రవిమతేంద్రజయేందిరతోడఁ గూడగాఁ
జివ్వన నారి వాపి బలు సింగిణి ధారుణితో ధరింప దా
గ్రొవ్వుల కొండలైన శచి గుత్తపు గుబ్బల[1] నొత్తు క్రొత్త గో
రువ్విళు లూరఁజేయఁ గనుచుండి బలారి దలంచు చాపమున్. ౧౦౨

క ఆ యినకులవార్ధినిశా
నాయకుఁడగు దశరథేంద్రు నందనులే యీ
కాయద్యుతిజితమేచక
తోయదకాం(చను)లు దురితదూరు లుదారుల్ ౧౦౩

సీ. అను హలాంకునకు విశ్వామిత్రుఁ డౌనన
నా మిథిలాధీశుఁ దజతనూజు
పుణ్య మేమన నిట్టి పుత్రుల నీక్షింప
చక్షువుల్ రెండును జల్లఁగావె
యనిన శతానందుఁ డంతమాత్రమె కాదు
చల్లనౌ రెండు దిశలును మిగుల
నన గాధిసుతుఁడు రెండననేల చల్లనౌ
నాల్గు దిక్కులు [గూడ] నా జనకుఁడు
గీ. తనయు లిఁక నిద్ద రున్నారె తరుణికులన
కనిన కౌశికుఁ డీబాలు రట్టివార
(క)లరు రశరథు తొడలపై మెలఁగువారు
భరతశత్రుఘ్ను)లనువారు పార్థివేంద్ర. ౧౦౪

1. నెత్తు

సీ. నావు డిట్లను శతానందుండు నిశ్చయం
బీ నల్వు రా ఋశ్యశృంగమౌని
చరుభాగముల విలాసములు నా మిధిలేశుఁ
డజసూను భాగధేయములును (గాక)
యన గాధితనయుండు [నట్లయగు నతఁడ
కద యయ్యె నవధి] భాగ్యాధికులకు
నన హలధ్వజుఁడు మాహాత్మ్యవంతులకు న
య్యనఘుఁడేకాడె మర్యాద యనిన
గీ కుశికతనయుండు నే మెరుంగుదుమె మీ మ
హిమలు మీకునే[1]తెలియు నా నిమికులుండు
పలుకు దశరధు మహిమంబు గలదె నాకు
వనధిమహిమంబు కాసారమునకుఁ (బో)లె ౧౦౫

గీ. అనిన గాధేయుఁ డధ(రీ)కృతాత్మమహిము
లైన వినయాన్వితుల వాక్య మనృతదూర
మయ్యు పొగడొందు నో నృపాలాగ్రగణ్య
విను మదెట్లన్నఁ జెప్పెద విశదముగను. ౧౦౬

క వనధి శశిఁ బోలె రాముని
గనియెఁ దశరధుఁడు కొలను కైరవిణిబలెఁ
గనినాడ వీవు జ(న)లో
చనగాహనశీత శీతజనిపదసీతఁ. (?) ౧౦౭

వ. అనునెడ లక్ష్మణుం డీ మునీంద్రచంద్రారోపితకుముదాప్త కుముదినీ
దృష్టాంతంబువలన నొకానొక కూటంబు దేటపడియెడునను మాట
కాతాటకారాతి యనుసూతిం గని యనుంగుఁగినుక నియ్యశీకాలాపంబులు
మానుమను సమయంబున జనకుం డంతర్గతంబున నిట్లనియె. ౧౦౮

1 తెలుసు.

గీ. ఈ పరమపుణ్యుఁడే తదాలాపసరణి
ప్రకటముగఁ జేసెఁ దా నొకానొకటి దలఁప
రభసరసపూరమగ్నుఁడై రాజధరుని
మార్గణాసన మాత్మలో మరువఁబోలు. ౧౦౯

వ. అని ప్రకాశంబుగా నిట్లనియె ౧౧౦

క. మునినాయక రెండవ హర
ధనువుగతిఁ వక్రరేఖఁ దగు నీ వచనం
బున నా డెందము హరుషం
బున జెందెడు నావు డుల్లమున నతఁ డనియెఁ. ౧౧౧

క. ఈ పుడమిరేడు శంకర
చాపారోపణము దా ప్రసంగవశమునం
దీపింపఁగఁ బలికెడు గా
నీ పలికిన నేమి యనుచు (నృప)వరుతోడఁ ౧౧౨

గీ. ఓ మహాభాగ భళిభళి యొప్పుఁ దలఁపు
నేసి తిప్పుడు మాకును చిత్త మలరు
చున్నయది శంభు విలు చూడ నోపు గలుగు
నరుల ననుపుము వడిఁ దదానయనమునకు. ౧౧౩

క. కాదే నెవ్వరు నేటికి
యీ దశరథరాము ననుపు మీవన విని యా
వైదేహుం డో పరమా
మోదాత్మ యిదేమి నీవు ముగ్ధవిధమునన్. ౧౧౪

గీ. బాలుఁ గోమలతావాలు లాలనార్హు
రామచంద్రుని నల సు(ధా)ధామఖండ
మకుటకాండాసనముఁ దెచ్చుటకు నదెట్లు
ననుపుమనియెదు ఎరుఁగవే మునివరేణ్య. ౧౧౫

చ చలిమల యీ శరాసనము చక్రి గుణం బురుచక్రి సాయకం
బల నె(ల)తాల్పుచేత నతమయ్యును విండ్లకు నిద్ది యైశమై
వెలసియునుం (బు)రత్రమరవేణుల కన్నుల నీటి చిత్తడుల్
(బ)లియఁగ నైంద్రమైనయది పట్టి తెమల్ప వశంబె యేరికిన్. ౧౧౬

వ. అనిన విశ్వామిత్రుం డేనెరుంగనె యని యిట్లనియె. ౧౧౭

చ పనివడి సేవకై దివిజపంక్తులు (సూ)రెలఁ జేరి పీచు తి
న్నని (స)వరాల గాలి వలనన్ బలుపారెడు నారి వోప ను
క్కున గుది(మీరు)చుఁ శివునకుం బనియించిన నేద దీర్చు నీ
(ఘ)నగిరిసారమైన విలుఁ గ్రమ్మెడు దట్టఁపు మంచు సోనలఁ. ౧౧౮

క. అన జనకుం డా సంయమ
ధనునకు నిట్లనియె శంభు ధను వింతటిదౌ
నని యెఱిఁగియు రాముని దె
మ్మని యనుమనియెద రిదేమి యన్న నమ్మునియుఁ ౧౧౯

క. కేవలము దెచ్చుమాత్రకు
నే వంచుటకొరకుగాక యిపు(డని) రాముఁ
లావణ్యధాముఁ గనుగొని
యో వత్స లెమ్ము బిగియు మొల్లియ వేగఁ. ౧౨౦

గీ. తాటకఁ గఠోరభేటకఁ [గీటడంచి
దురి] తగేహు సుబాహుఁ దుత్తుమురు నేసి
నీచు మారీచు నేచి మున్నిటఁ ద్రోచి
చెలఁగు నీ విల్లు లక్ష్మణు చేతి కిమ్ము. ౧౨౧

క. అనుటయు జనకక్ష్మాపతి
యనఘా బాలునకుఁ దగని[1]యది బల్కెద వె

1. యద.

ట్లనిన వినవె నృపాలక
యినవంశోత్తంసమైన యీతని సేతల్ ౧౨౨

క అక్షయధనురాగమములు
దక్షత నా వలన నేర్చి దానవశిక్షా
దక్షిణుఁడై యీతఁడు గురు
దక్షి[ణ] మత్సవనరక్షితం గావించెన్ ౧౨౩

క. అనవుడు సవిచారుండై
జనకుఁడు నిట్టూర్పు నిగుడ సంయమివరుతో
ననియె నితఁ డివ్విధము సే
సినయది నిక్కంబయైన జెప్పెద వినుమీ. ౧౨౪

శా మారీచాదినిశాచరేంద్రపరిషన్మౌళిస్థరత్నాంకురో
దారాంశుస్ఫురదంఘ్రిశంభునగరీధౌరేయుఁడైనట్టి య
వ్వీరుండున్ మునిలోకచంద్ర వినుమీ విల్వంపఁగా లేక ని
(స్సారాత్మీయ)భుజావలేపుఁడయి లజ్జం బొందె మున్నీయెడన్. ౧౨౫

చ. అనవుడు దానికేమి యిది యట్టిదకావున రామచంద్రునిన్
బనిచెద నంచు మౌని నరపాలకబాలకుఁ జూచి వత్స లె
మ్మనయము మా మనంబు ముదమందఁగ జేయు నగేంద్రధన్విధ
న్వనమనచాతురీగరిమ నా జనకక్షితిపాలుఁ [1]డాత్మలోన్. ౧౨౬

మ. త్రిజగత్ఖ్యాతి వహించె నెవ్వని తపశ్శ్రీ లీలమై నట్టి (గా)
ధిజుఁడి ట్లీతనియందు సత్యుఁడగు బుద్ధిన్ జూడఁగా బాలుఁడీ
యజపౌత్రుండు త్రినేత్రువిల్లు గహనం బత్యంతమున్ దీన న
క్కజమై డోలిక నూగుచున్నయది శంకన్ నా మనం బెంతయున్.

వ. అని యవనీతలంబుఁ గనుంగొనుచు వెండియు నిట్లనియె. ౧౨౭

---

1 నాత్మలోన్.

చ జనులకు నేత్రపర్వమగు చక్కదనంబునఁ జొక్కమైన యీ
తన యనుగుం గుమారి రతి తానని తెల్పెడు రూపసారుఁడై
తనరెడు నీ కుమారుఁ దల దర్పకుఁ బోలెడు నీ శరాసనం
బును ననవింటి వంటిదయి పొల్చినఁగా సమకూరు నిన్నియుఁ. ౧౨౯

సీ అనువేళ జనకుతో ననియె శతానంద
మునియిదేమీ నీవు మూఢలీల
పలుమారు చింతించె దల గాధిసుతు మాట
గావింపుమన విదేహావనీశుఁ
డంగీకరించితి నని రాముఁజూచి యో
వత్స సేయుము గురువాక్య మనిన
లేచి రాముఁడు తొంగలించు వేడుక పరి
కరము గట్టుచునుండ కడు రయమున
గీ. వచ్చి దౌవారికుండు దేవరఁ గనంగ
నొక మహీసురుఁ డేతెంచి యున్నవాఁడు
నగరి వాకిట నిటకు రాదగునె యాతఁ
డనిన మిథిలేశుఁ డిదియు న న్నడుగ వలెనె. ౧౩౦

వ. అనుటయుఁ బ్రతీహారిప్రముఖుండు ౧౩౧

క పనివడి చని యాతని దో
డ్కొని వచ్చిన జనకుఁ డెదురుకొని విప్రా వం
దన మనుటయు సుమతివి గ
మ్మని యతఁ డాశీర్వదింపఁగా నిమికులుఁడుఁ. ౧౩౨

గీ. చిత్తమున నీతఁ డొర యాశీర్వదించు
రీతి యొక రీతి యున్న దేరీతియైన
నేమి కానిమ్మటంచు నయ్యెడ వసుంధ
రామరునిఁ జూచి కూర్చుండు మనిన నతఁడు. ౧౩౩

క సందేశహరుఁడ దనకుఁ
(బ)ందమె కూర్చుండ ననిన జనకుం డవనీ
బృందారకుతో నెవ్వని
సందేశహరుండ వెద్ది సందేశ మనన్. ౧౩౪

చ. తొలచి సమస్తభూధవవధూనయనాంజనకాలకూటమున్
గళమునఁ ద్రావి లోకములు కప్రము గట్ట యశోట్టహాసమున్
గొలుపుచు నిప్పుడున్ (హరునకున్) బత్తియై నటియించు నెద్ది యే
నల భృగురాము కైదువు ధరాధిప నిన్నిటులంచుఁ బల్కెడుఁ. ౧౩౫

వ. అనిన జనకక్ష్మానాథుఁ డంతర్గతంబున నహో గర్వాంకురవక్రత్వంబుఁ గంటె కానిమ్మని ప్రకాశంబుగా నది యెయ్యది యనిన నతం డిట్లనియె.

ఉ బాలకి ని మ్మొకానొకనృపాలకుమారునకుం జిరాయువుం
దాలుపు మీవు మాకు నహితంబు పురాంతకు విల్లు వాపుటల్
బోలదు పాప మా తెరువు వోవకు పోయితివే మదీయధా
రాలఘువారియే శరణ మారయ నీ భవపంకముక్తికిన్. ౧౩౬

క. అనుటయు మిథిలాధిపుఁ డొ
య్యన నగి యిటులైన జెప్పనగు బరశువుతో
మునివర మా మాటయు నీ
వన నతఁ డది యెద్దియనిన నతఁ డిట్లనియెఁ. ౧౩౭

ఉ. ఓజమదగ్నిరాముకడనున్నకురారమ నీవు మాకు నే
యోజలఁ జుట్టవౌట విను మొప్పఁగఁ జెప్పెద కన్య నిత్తు నే
భూజనులెల్లఁజూడ మును పూనిన పూన్కిన పోయు మీవు ధా
రాజల మల్లుఁడైన యల రౌద్రశరాసనహర్త ముందటఁ. ౧౩౮

గీ. అనుమనిన సమ్మతించి యమ్ముని చనుటయు
జనకుఁ డింతకె భృగురామచండకోప

వీతిహోత్రస్ఫులింగంబు వెన్ను బ్రాకు
నావు డామాట విని శతానందుఁ డనియె. ౧౪౦

గీ ఆయిన నగుగాక రఘురాముఁ డతిగభీర
చండదోర్దండసారకాసారమునకుఁ
గైరవారామ మనవుడు గాధితనయుఁ
డా విదేహాధిపతితోడ ననియె నపుడు. ౧౪౧

క. వీరలు నా(నా)మణికో
టీరులు నిబిరీసభుజపటీరు లుదారుల్
వీరెవ్వ రనేకులు పరి
వారవృతు లగుచునున్నవా రవనీశా ! ౧౪౨

మ. అన వైదేహమహీమహీంద్రుఁ డహిరాజాకల్పకోదండరా
జనిరస్తస్వభుజాబలుల్ మగధపాంచాలాంధ్రచోళాదిదే
శనరేశుల్ విను మీమహామహులు నా సంప్రార్థనంజేసి ని
ల్చినవారల్ నృపపూజ గైకొనుచు హాళిం గొన్ని నాళ్ళిచ్చటన్. ౧౪౩

క అనునెడ విశ్వామిత్రుం
డనియెఁ రఘురాముతోడ ననఘా యీ భూ
పనికాయము చూడఁగ నా
మన మనుమోదమున దేల్చుమాయన నతఁడుఁ ౧౪౪

గీ గాధిసూతికి మ్రొక్కి వే కదల జనకుఁ
డను శతానందునకు నంధకారివిల్లు
నిలుపునెడ రాముఁ డెరుగఁడు నీవు వెంట
నరిగి చూపు మటంచు నిట్లనియె మరియు. ౧౪౫

గీ. అమలగుణనీత సీత స్వయంవరావ
నికిఁ గరంబున వరణమాలిక ధరించి

వచ్చునట్లుగ గన్యకావాసమునకు
ననుపు మొక సౌవిదల్లుని ననిన నతఁడు. ౧౪౬

క. కానిమ్మని చనుటయు నపు
డానంద మ్మెసఁగ వచ్చి యల హెగ్గడి యో
భూనాయక చేసితి మీ
యానతియని మరియు ననియె నందరు వినఁగన్. ౧౪౭

క. దండిన్ రామయశోధ్వజ
దండముతోగూడ నెగసె దహనేక్షణకో
దండంబని యా కంచుకి
వెండియు మిథిలేశు బలికె విస్మయ మెసఁగన్ ౧౪౮

క. (బాలు)ండగు రఘురాముని
చే లీల న్నమితమయ్యె శివువిల్లు వియ
త్కూలాభీలవిహారో
త్తాలస్థితి నమితమయ్యెఁ దద్గుణరవమున్. ౧౪౯

వ. అను సమయంబున సుమిత్రాపుత్రుండు విశ్వామిత్రునకు నిట్లనియె నది
యవ్విధంబయగు నెట్లంటేని. ౧౫౦

మ. హరబాణాసనకైతవాద్రి(వరగూ)ఢానేకగంభీరగ
హ్వరబంహిష్ఠ [1]రవప్రతిధ్వనులు వెన్నాడంగ (మౌర్వీభ)వ
చ్చిరనాగాననజాతవాక్యరచితశ్రీరామకీర్తిస్తుతుల్
బెరయం దిక్కులు నిండె చండగుణవల్లీ(ప్రో)ల్లసద్ఘోషముల్ ౧౫౧

క. ఆపలుకులకు విదేహ
క్ష్మాపతి దిశ లనఁగనేల కలయఁగ నిండెన్
మాపూనికయును గోర్కులు
నోపిన్నాళ్ళకును దద్గుణోద్యధ్వనులన్. ౧౫౨

1. తర 2 నోప

క. అనుసమయంబున గంచుకి
ననియెఁ బ్రతిహారి కంటివా యిపు డొక (మో)
హన మీ(సీ)తారాఘవు
లనువు పరచి (రీశ)కార్ముకారోపణముఁ ౧౫౩

వ. అనుటయు నక్కంచుకి యొక్కించుక విచారించి హర్షించి యెలనవ్వొ
లయం దెలిసెనని యిట్లనియె ౧౫౪

గీ పాణిపల్లవలీలచే రాణ మీరు
నీశబాణాసనము రాముఁ డిచ్చుఁ బాప
మేదినీజాత పుంఖించె మెల్ల నల్ల
(గల్వ)సరివంటి తన కడగంటి చూపు ౧౫౫

క అని పలికెడు నెడ లక్ష్మణుఁ
డనియెఁ గాధేయుతోడ నలరుచు నిపుడో
యనఘా యొక యద్భుత
మనయము వర్తింపుచున్నయది కనుఁగొంటే. ౧౫౬

మహాస్రగ్ధర.
హరి నిద్రం [1]ద్రోలుచుం బాయక భుజధరశౌర్యంబు గూర్కింపుచున్ ని
ర్భరదిగ్దంతిశ్రవోంతప్రచల[న]కలనం బట్టుచుఁ గూర్మరాజుఁ
దిరుగల్ గావింపుచుఁ ధింధిమిధిమియని వాదిత్రముల్ [2]ముజ్జగంబుల్
మొరయఁ జృంభించెఁ బెల్చం బురమథనధనుర్ముఖ్యభంగోత్థగర్జల్.

వ. అనుసమయంబున బ్రతీహారి యిట్లనియె. ౧౫౭

చ జగములు దాటుచుఁ గిరివిశాలగుహాంతరసుప్తజాగ్రదు
గ్రగజవిరోధియూథకటుకంఠరవప్రతినాదమేదురం
బగుచు నజాండభాండమవియఁ రఘునందనభజ్యమానభీ
మగరళకంఠధన్వవలమానకటాత్కృ(త) ముల్లసిల్లెడుఁ. ౧౫౮

1 గ్రోలుచుం 2 ఆ జగంబుల్.

వ. అనినం గంచుకి యిట్లనియె. ౧౬౦

ఉ. వారనిలీల శంభు విలు వ్రక్కలుసేసి ధరాసురార్పితాం
భోరుహదామకం బరుతఁబూని త్రపన్ దలవాంచి వీరశృం
గారసరోజసద్మలకుఁ గందువయైతగు రాముఁజూచి యు
ర్వీరమణుల్ ఘటించి రెద విస్మయరోషవిషాదమోదముల్ ౧౬౧

క అనువేళ శతానందుఁడు
చనుదెంచి నరేంద్ర నీవు సంతోషమునన్
దనరుము తనరక మానుము
కనిన తెరం గే నిజంబుగా నెరిఁగింతున్. ౧౬౨

ఉ అంగుళిపల్లవంబుల శరాసనమున్ జెవి సోకఁ బాప త
ద్భంగమెకాని భ్రూయుగళభంగము చెందదు రాముమోము కన్
పొంగు నహంక్రియారవము పు(ట్టదు) తద్గళసీమ భజ్యమా
నాంగజశత్రుచాపరవ మప్పుడ కప్పె నజాండభాండమున్. ౧౬౩

క. అన విని జనకక్ష్మాపతి
యనఘా యిటు మేర మీరు నల దశరథనం
దను వారింపఁగవలదే
యనిన శతానందుఁ డప్పు డలవియె మాన్పన్. ౧౬౪

శా. కౌసల్యార్పితమ(ంగ)ళప్రతిసరాంకంబున్ సదా కందుకా
భ్యాసోల్లాసియు శోణపంకరుహనాళాభంబునౌ రాము కే
(ల్మా)నో కించుక సంచ(రి)ంచునెడ ముల్లోకంబులున్ భగ్నది
గ్వాసోధన్వకఠోరఘోరరవసంవర్తా(బ్ధి) మున్గె న్వడిన్. ౧౬౫

గీ. నావు డ(వ)నీశ్వరుఁడు శతానందమౌనిఁ
బలుకు నీకఁ జాలు కాలయాపనము మేది
నీసుతారాఘవులకుఁ బాణిగ్రహంబు
సేయ గాధేయు ననుమతిఁ జెందవలయు. ౧౬౬

వ. అనవు డమ్మనుజేంద్రునకు శతానందుఁ డిట్లనియె. ౧౬౭

గీ. అపు డటు విఘటమానమౌ హరుని విల్లు
ఘటన యొనరించె జానకి కౌసలేయ
హస్తముల నింక నమ్మౌని యాజ్ఞ వలయు
నూర్మిళాలక్ష్మణుల పాణియోగమునకు ౧౬౮

ఉ. నావుడు గాంధినందనుఁడు [1]నవ్వి మరొండు గలాదు మైథిల
క్ష్మావరకన్యకామణుల సమ్మతిఁ దమ్ములసొమ్ము సేయుచుకా
దా వరియింపఁగోరెడుగదా రఘురాముఁడు సీత నాఁ బ్రియం
భావుకచిత్తుఁడై జనకమండలనాయకుఁ డప్పు డిట్లనుకా ౧౬౯

గీ. మాళవీశ్రుతకీర్తుల మౌనివరుఁడు
భరతశత్రుఘ్నులకుఁ బ్రేమఁ బరిణయంబు
సేయ నూహించె నవిన గౌశికుఁడు నట్ల
కాక మరియేమి యన మహీకాంతుఁ డనియె. ౧౭౦

క. ఔనేని తావకాజ్ఞా
సూనము మస్తకమునందుఁ జొనిపితి నిష్టం
బైనది గూర్తుము రమ్మని
యానందముతోడ వెడలి రందరు వరుసకా ౧౭౧

* * *

క. నందేల తిమ్మరాజపు
రందరచిహ్నప్రసన్నరాఘవనాట్యా
మందప్రబంధరాజము
నందు తృతీయాంకమయ్యె నార్యస్తుతమై. ౧౭౨

★

1. నవ్వికయొండు

# ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము

## చతుర్థాంకము



గీ. శ్రీకరంబైన మణిదీపశేఖరంబు
జనకభూ(నాథు)మంటపంబునఁ జెలంగ
ఘోరదుర్వారజంఝూసమీరణంబు
కలయవీచినఁ దనకేమి గలదు ఫలము. ౧

క. అని ధ్వని దోఁపఁగ రఘునం
దను నాక్షేపింప జామదగ్న్యుఁడు కడఁకన్
జనుదెంచి విఫలుఁ డగునని
వినఁదగు ధ్రువ వాడఁబడియె వెసఁ దెరలోనన్ ౨

వ. మరియును దెర మరుంగున ౩

మహాస్రగ్ధర కినుకన్ బాలార్కదీప్తుల్ గెరలెడు నిజదృక్కేళిచే గొడ్డలి న్నేఁ
డును రాజాస్రంబులోఁ గూడుట దెలుపుచు నాడుంబలెన్ లోకపంక్తిన్
బొనిగింపంబూను నిట్టూర్పులను [విడు]చు నుప్పొంగు చాపంబు దోస్తం
భనియుక్తంబై చెలంగన్ బ్రకట[1]విజయియై భార్గవుం డేగుదెంచెన్ ౪

గీ రాజవరులార దృష్టిమార్గమున నుండ
వలవ దెటకైనఁ జనుడంచు పలుకఁ(బ)డియె
నవ్విధంబున సంభ్రమం బతిశయిల్ల
చండతేజుండు రైణుకేయుండు వచ్చె. ౫

గీ. వచ్చి సాటోపనటనంబు వరల నౌర
జనకు దంటతనం బీశచాప(న)మన

1. విజయియో

మోలిఁ గావించెఁ దన కూఁతు [1]నొసఁగుపొంచె
నని కుఠారంబు నీక్షించి యాగ్రహమున. ౬

క. నరపాల(క)రినకంఠో
త్కరగళితాస్రప్రసిక్తధారంబగు నీ
పరశుధరు చేకుఠారము
ధరణీస్థలి జనకవిరహితంగాఁ జేయున్. ౭

వ. అని విచారించి ౮

క. పుట్టితి వర్జునభుజవని
మెట్టితి నానావిరాడమితవంశములన్
వట్టి నిమికులతృణంబున
దొట్టుట యే డాక కోపధూమపతాకా ౯

చ. అని మరియుం దలంచి యహహా యిటుగాదు మనోరథోపనీ
తనిజసుతాధినాథభుజదర్పముచేఁ దల గ్రొవ్వియున్న యీ
జనకుని మీఁద నింక తెగఁజాలక యుండఁగ నేమి వీఁడు దా
మునుప పరశ్వధంబునకు మొక్కల మొక్కటి చెప్పి యంపడే. ౧౦

వ. అది యెట్టిదంటేని. ౧౧

ఉ ఓ జమదగ్నిరాముకడ నున్న కుఠారమ నీవు మాకు నే
యోజలఁ జుట్టవౌట విను మొప్పఁగఁ జెప్పెద కన్య నిత్తు నే
భూజను లెల్లఁ జూడ మును పూనిన పూన్కిన పోయి మీవు ధా
రాజల మల్లుఁడైన యల రౌద్రశరాసనహర్త ముందటన్. ౧౨

వ అని పరించి యహో వీని దురవలేపనంబని మరియును. ౧౩

సీ ఎవ్వాని బాహుమహీరుహవ్రాతంబు
బంధించె నర్మదాపంక్తిముఖుల
నా యర్జునుని స్వధారాహతభుజసహ
స్రప్రోత్థరక్తధారానిషిద్ధ

1. నొసగ

బాలార్కకిరణుఁగాఁ బాటించి దివ్యాంగ
నలకుఁ దదీయాంగనల కశోక
శాఖియు ఘనశోకశాఖియు నగునట్లు
గావించి క్రుంకించి క్షత్రసతుల
గీ యశ్రుధారాంచలంబున నాత్మకీర్తి
(లలర వికసి)ంచు మేదిని నట్టి నాదు
రౌద్రముద్రావినిద్రపరశ్వధంబు
మించి ధారాంబువులఁ గ్రుమ్మరించు నిపుడు ౧౪

క. అని కని యితఁడు శతానం
దనిజాంతేవాసియైన తాండ్యాయనుఁడో
యనునెడ నతఁడు ప్రవేశం
బొనరిచి రామునకు వినతి యొనరుప నతఁడుఁ ౧౫

క ఆయుష్మంతుఁడు గమ్మా
నీ యొజ్జకు దాతయైన నృపవరునకు నీ
తైర్థియక్షకార్ముకానమ
నాయతపణవాదనియమ మది వోయెనొకో. ౧౬

గీ. అనవు డాతనితోడఁ దాండ్యాయనుండు
వోయెఁబోయె (న)నుండు నొంపున భృగూద్వ
హుండు నిక్కమెయనఁ బోయె నొండు గలదు
కొండవిలుకాని వింటి[1]తోఁగూడఁబోయె. ౧౭

క. అనవుడు భార్గవుఁ డతనికి
నను నెఱుటుర కృతాంతహరచాపముతో
డన వోయెనంటి తెలియఁగ
వినుపింపుము నావు డతఁడు విను మొక్కనిచేఁ. ౧౮

1. కొం

గీ ఫణధరాధీశనీకాశబహుళసార
మండితాఖండచండిమోద్దండబాహు
దండపీడితమై భృగూత్తంస ! మాంస
లాద్రిశయచాప మిరుఁవయ్య లయ్యెనయ్య. ౧౯

వ అనిన జామదగ్న్యుం డవ్వీరుం డెవ్వండో యనిన దాండ్యాయనుం డిట్లనియె. ౨౦

గీ. గాధినందనమఖవిఘ్నకర్తలౌ సు
బాహు మారీచముఖ్యక్షపావిహారు
లెవ్వనికిఁ జిక్కిరన రాముఁ డింకఁజాలు
తెలిసె నవ్వల నతఁడు దైతేయరాజు ౨౧

క అనఁ దనఁలో దాండ్యాయనుఁ
డను నీతఁడు పంక్తికంఠుఁడని యూహించెన్
మనమున నూహింపఁగని
మ్మని యూరకయుండె రేణుకాత్మజుఁ డలుకన్. ౨౨

ఆ. వె. క్షోణిపాలతనయ సుకుమారగళనాళ
దళననిపుణమైన (త)న పరశువు
కరినపంక్తికంఠకంఠపీఠిచ్ఛిదా
కౌశలంబు నిపుడ గాంచుఁ గాత ౨౩

వ అని విచారించి యిది యెంతపని యెట్లంటేని ౨౪

ఉ. అర్జునభూజబాహువిటపావళిఁ గొట్టి మహేంద్రపాటనో
పార్జితకీర్తియైన పవి యగ్గలికన్ గని సిగ్గు దాల్చు భూ
పార్జునకీలికీలమగు నస్మదుదారకుఠార మీ దశా
స్యార్జవికంధరాకదళికాటవిఁ గొట్టెడు పెంపు మెచ్చునే. ౨౫

వ అని మరియును. జింతించి మం(తు)మంతుఁడగు నీ రక్షఃపతి నుపేక్షించుట గాదు కావున. ౨౬

గీ. గణన కెక్కిన యల్ల దక్షిణపయోధి
నడుమ నెనిమిది(యు)వ కోంకణం బొనర్చి
శాతతరమద్విపాటసంజాతవహ్ని(?)
లంక కొనగూర్చుఁగాత యాతంక మిపుడు. ౨౭

సీ. అని జామదగ్న్యుండు సాటోపముగ నటి
యింపఁ దాండ్యాయనుఁ డిచ్చలోను
దైవవశంబున ధాత్రీశవంశంబు
బ్రతికె బొమ్మనగ నేపథ్యసీమ
నోహో వినుండు నియోగిజనంబులు
వైవాహికాకల్పవంతులైన
జనకాత్మజారామచంద్రుల కిదె స్వస్తి
వాచనం బొనరింపవలయు వేగ

ఆ. వె. ద్విజులఁ బిలిపింపు మనుమాట విని భృగూద్వ
హుండు తాండ్యాయనునిమీఁద నురికి యోరి
ధూర్త యూరక దశకంఠు కీర్తి వొగడి
నన్ను భ్రమయించితివి నిన్ను నమ్మఁదగునె. ౨౮

గీ. జనకజామాత వేరొక్కఁడనిన నతనిఁ
బలుకు తాండ్యాయనుండు నావలనఁ దప్పె ?
యే వచింపగఁ దమకించి తీవ నడుమ
ననవు డది యంతయును జెప్పుమనిన నతఁడు. ౨౯

గీ. గాధినందన మఖవిఘ్నకర్తలౌ సు
బాహుమారీచముఖ్యక్షపావిహారు
లెవ్వరికిఁ జిక్క రతినిశాతేషుభీష
ణాగ్నిలవమున లివ చెడి యతనిచేత. ౩౦

గీ. ఫణధరాధీశనీకాశబహుళసార
మండితాఖండచండిమోద్దండబాహు

దండపీడితమై భృగూత్తంస మాంస
లాద్రిశయచాప మిరు వ్రయ్య లయ్యెనయ్య ౩౧

వ. అనిన నమ్మారీచమథనుం డెవ్వండొకో యనినఁ దాండ్యాయనుం
డిట్లనియె ౩౨

ఉ. ఐందుమతేయసుందరులయందు విభాండకమౌనినందనా
స్పందితమంత్రపూతచరుభాగవిలాసములై జనించు న
న్నందనులందు ముందు గను నందనుఁ డప్రతిమానుఁ డీక్షణా
నందుఁడు రాముఁడా కుశికనందనశిష్యుఁడు భార్గవోత్తమా. ౩౩

వ అనిన భార్గవుండు. ౩౪

ఉ. ఖేచరభూచరాదులకుఁ గిమ్మనరాని పురత్రయంబు ధూ
ళీచయమయ్యె నెద్ది విధిలీల కడుంగడు వక్రమైన ద
ద్గోచరచాప మీశిశువు గూల్చెనయేని మదీయశస్త్రధా
రా[1]చలదంబుపూరముల ద్రమగ్గనపో రఘువంశ మంతయుఁన్. ౩౫

వ అనుటయు. ౩౬

క. ఆ తాండ్యాయనమౌనియు
సీతని సంరంభసరణి యెరిగింపఁదగున్
వే తమ యొజ్జకు నని చన
నాతరి జమదగ్నిరాముఁ డట కనుగొంచున్. ౩౭

గీ నవ్య(పరిణయశోభ)నోన్నతిఁ దనర్చు
నతఁడు రాముఁడు గాఁబోలు సానుజున్మఁ
డనుచు హర్షంబుతోఁ జూచి యర్థముగ్ధ
మీ జనంబని యూహించి యిట్టు లనియె. ౩౮

క. కోమలనీలపయోరుహ
దామశ్యామాభిరామతం దగు నితనిన్

1. చలనంబు.

కాముఁడని యనక యకటా
రాముఁడనం దగునె యనుచుఁ గ్రమ్మరఁ గనుచున్. ౩౯

మ. చెలిమిం బాయక యీ రసప్రతతితో శృంగారవీరాద్భుతం
[బులు]దా మీతని రూప మయ్యెనొ మరున్ ముక్కంటి ముక్కంటియో
దలపై చందురు రూపబాహుబలముగ్ధత్వంబులం గేళిమై
పలుచం జేయుచుఁ గ్రేణిసేయుచును జప్పంజేయుచున్ మీరెడున్ ౪౦

వ. అను సమయంబునఁ గృతప్రవేశంబగు రామలక్ష్మణద్వితయంబునందు సుమిత్రాపుత్రుండు భృగుపుత్రుం గనుంగొని సకౌతుకంబుగా నిట్లనియె.

చ నునుపగు మౌర్వి [1]మౌంజియు ధనుస్తనులం గనుపట్టఁ బూనెడున్
మొనలగు గంకపత్రకుశముల్ విమలోజ్జ్వలధార (నె)ంతయున్
దనరు కురారకుండికలు దద్దయు నొప్పెడు చేతులందు నీ
ఘనుఁడల వీరశాంతరసకల్పితవిగ్రహుఁడో తలంపఁగన్. ౪౧

గీ. అను సుమిత్రాతనూజాతుఁ డగ్రజాతుఁ
బలుకు నెయ్యదియో మ్రోల బ్రహ్మబాహు
జాత్మ కంబైన చిత్రంబునట్ల యున్న
దనవు దెరుఁగవె భార్గవాహ్వాయుని వత్స. ౪౨

ఉ. క్రౌంచధరాధరోదరముఁ గట్టిగనేసి [2]కుమారు బీరమున్
గంచుక [3]మూడఁగోసి ప్రియకారుణిధారుణి ధారబోసి ద
ర్పించి పురాతనే[4]తరధరిత్రికినై జలరాశిఁ ద్రోచి శ
స్త్రాంచితధార నర్జున[5]భు(జా)శనిజేసి [6]యెసంగువాఁడనన్. ౪౩

గీ. అనుడు సౌమిత్రి యట్టిద యయ్యెనేని
యీతఁ దద్భుతశీలుండువో తలంప

---

1. మంజియు. 2 కుమారబిరవున్ 3 మూడు 4. తక 5 కు(జా)సని.
6. యెసంగువాండనన్

నావు డద్భుతశీలశిఖావతంస
మనఁగఁదగునని రాఘవుఁ డనియె మరియు. ౪౫

ఉ ఏకసువర్ణశృంగమున నేచిన ధేనువు నిచ్చురీతి దా
నేకసువర్ణశృంగియుత నిద్ధరఁ గశ్యపుఁ జేర్చి మెచ్చుఁ డా
కేకితురంగశ_క్తిహతి గెంటిన క్రౌంచము పత్రికోటికి
న్వాకిలి నేసి యీ ఘనుఁడు నాన వహించు నుదా_త్తచిత్తుఁడై ౪౬

వ. అని సన్నుతించి. ౪౭

సీ. అనుజన్మసహితుఁడై మనుజేశ్వరుఁడు జామ
దగ్న్యుని జేరి హ_స్తములు మోడ్చి
రతిఁ బరమోన్నతిరమణీయపరిణామ
మగు (బణా)మము నీకు నవధరింపు
నావుడా భార్గవుం డో వత్స సంగర
జిష్ణుఁడౌ దనుచు నాశీర్వదింప
రాముఁడో భృగుగోత్రరత్నాకర[1]త్రయ
యంగీకరించితి నవ్విధమున

ఆ. వె. ననుడు పరశురాముఁ డాత్మగతంబునఁ
గొంత కనికరంబు కొంత గినుపు
కొనలువారఁ జూచి తన్రమోలఁ జూపట్టు
నినకులీను మరియు నిట్టు లనియె ౪౮

శా. బాలేందుద్యుతిధాము రాము నని జంపణజాల హుం వీఁడుగా
డా లోకేశ్వరు విల్లు ఫెల్లున రసాలాభంబుగాఁ ద్రుంచె న
య్యో లక్ష్మీ(స)మ నాథుఁ బాయఁగలదే యుర్వీతనూజాత యౌ
రా లీలాహతరేణుకాగళము నా యస్త్రంబు సన్యస్తమే. ౪౯

గీ. అని ప్రకాశంబుగాఁ బరశ్వాయుధుండు
రామ నీయెడ మా మాటలే మృదువులు

1 త్రెయ

నావు డొక్కింత నవ్వి మీ భావ మెట్టి
యదియొ యనవుడు భార్గవుం డనియె మరియు. ౫౦

శా. భాలాక్షప్రశరాసభంజనవిధాపాండిత్యచండంబులై
గ్రాలు న్నీ యిరుగ్రేలులే యనుటలుఁ ఖండించి తన్మాత్ర కీ
లాలాంభోనిధి దప్పి యార్చెదఁ గరాళ(క్ష)త్రతేజో(న)ల
జ్వాలాచర్వణజాతగాహమగు మచ్చంచత్కుఠారాస్త్రముఁ. ౫౧

చ. అన విని రాముఁ డో గుణగణాఢ్య యనుగ్రహనిగ్రహంబు లీ
వొనరుప నేము లోన, కినుపూరుటకుం గత మెద్ది నావుడుఁ
పనివడి చేసి తీవు, బహుభంగుల నేను[వచింప దోషముఁ]
(గ)ని యది యెట్లహో (మ)దముగా కిది యోరి వినీతకృత్యమే ౫౨

గీ. ఏది వట్టించె పురు శరదిందుముఖుల
విరహవీరవ్రతం బట్టి విరుగు లేని
మృడుని వి ల్లీవు విరిచితి యింతకన్న
గలదె హేతువు కోపాగ్ని మొలచుటకును. ౫౩

ఉ. నావుడు రాఘవుండు భృగునందనుఁ బల్కు నశీకలోకవా
ర్తావిభవంబుచే నిరపరాధుఁడనౌ నను గోపగింతురే
నీ వన నాతఁ డైన శిఖినేత్రుని వింటికి షేమమే యనం
గా విని లేదులే దనిన గల్గదు తప్పిఁక నెట్లు నియ్యెడఁ. ౫౪

వ. అనిన భృగురామునకు రఘురాముం డిట్లనియె ౫౫

క. ఆలస్యముఁబలె నంటితి
[1]నో లేదో పెలుచనై తనుం దానయ య
న్నీలగళు విల్లు విరి గిల
వ్రాలె న్నే నేమిసేయువాఁడం జెపుమా. ౫౬

1. నోతెలొదొ పెలుచనై తనుదానయయ

క. అనవుడు భార్గవముని చం
దనదిగ్ధంబైన యమ్మ నాటి హృదయ మొ
య్యన జల్లఁజేయ వచ్చెద
వని కినుకఁ బరశు వెత్తి యనియెఁ మరియున్. ౫౭

గీ. రామ కామారికార్ముక[1]ప్రతివిఘాత
జాతపాతికజనకజాసంగవిరహ
మిత్రమగు [2]మత్కుఠారంబు మెరయు నీ క
ణంబ కంబువు నగు నీ గళంబునందు ౫౮

వ. కావున బ్రవీరుండవుగ మ్మనవుడు రామభద్రుం డిట్లనియె ౫౯

శా. హారంబైన కురారమైన గళనా[శా]గ్రంబునం జెందనీ
నీరేజేక్షణ కంటికిఁ జలముగానీ కజ్జలంబైనగా
నీ రానిమ్ము సుఖంబుఁ గాలముఖముఁ మీరంగరా దెందుఁ బెం
పారఁ బారులకుఁ బ్రవీరులముగా మైనట్లు గాని మ్మికఁ. ౬౦

క. అన విని భార్గవుఁ డాహా
వినుతులకే పాత్రమైన ద్విజమాత్రముగా
నను దలపోసెద వవులే
యని విలయానలశి[ఖి]సఖాలోకనుఁడై ౬౧

శా. ఓరీ భార్గవరాము నీ కెరుఁగరాదో యెక్కటిం బోరుచో
గౌరీపుత్రు నతండు చండభుజవిక్రాంతిఁ వడి న్నొక్కిన
న్నారం బేది ముఖానుసారిభుజముల్ నాకీవు మున్నుంచుఁ దాఁ
గ్రూరాకారతఁ జూడఁడే హరకరక్రోడాజమస్త్రాబ్జముఁ. ౬౨

వ. అని మరియునుం గోపించి. ౬౩

శా. ఏమేమీ మును పారులం గడవఁగా నే నేరఁ బొమ్మంటివే
భూమీనాయకజాతగర్వితుఁడవై భూదేవజాతిం దృణ

---

1 ప్రతతిఘాత 2 మత్కృపాణంబు 3 నిట్లు

స్తోమంబట్లు గణించె దిప్డ మన జాతుల్ రెం(టికి)ం దెల్పు సం
గ్రామంబన్ తుల తారతమ్యములు నా రామానుజుం డయ్యెడన్. ౬౪

ఉ. మేరకు మీరి పాఱులగు మి మ్మెదిరించుట నీతి గాదు వి
స్మేరభుజాబలాధికులు మీరలు లేఁతల మేము భూమిభృ
ద్దారకులైన మాకు మనఁ దావ(ల) మేకగుణాశుగాసనం
బారయ మీకు నన్నవగుణాన్వితమౌ నుపవీత మూఁతగన్. ౬౫

క. అను సమయంబున రాఘవుఁ
డనుజన్మా! మాననీయుఁడగు నిమ్ముని దు
ర్వినయవిదగ్ధతకుం దగఁ
డనవుడు భార్గవుఁడు వీనియది నేరంబే ౬౬

ఉ. కోకలు కొప్పులున్ విడిన కొమ్మల నిమ్ముల నీఁగి దాఁగు నా
రీకవచున్ వధింపక నికృష్టఁపు గొడ్డలి నాఁడు గావఁగా
దీకొనె నేఁడు నా చెవిఁ దదీయుల దుర్వచనంబు లింక నీ
పోకల రాచవాండ్రయెడఁ బుట్టెడు నక్కటికన్ దహింపనే. ౬౭

గీ. అనిన రాఘవుఁ డో మౌనిజనవరేణ్య
కలఁగఁ దగునయ్య యీ పయఃకంఠుమీఁద
ననిన నితఁడు పయఃకంఠుఁడా తలంపఁ
గరళకంఠుఁ డనంగ లక్ష్మణుఁడు వలికె. ౬౮

ఉ. అట్టిద యయ్యెనే మునికులాగ్రణి యక్కుఠకంఠశిష్యుఁడై
నెట్టన మన్న నీకు నను నిక్కము గావఁగఁ బాడి నేఁడు నా
పుట్టిన కోపతాపమున నోరి! హలాహలకంఠనామసం
ఘట్టన నా గురుండవ జగంబున నీవన రాముతమ్ముఁడున్. ౬౯

గీ నవ్వి యే వేర పలికితి నవ్విధంబు
వినుము నిసుఁగైన నెల యల వెండికంటి

వేల్పుతల యెక్క నోర్వక విడిచినాడె
కాన తచ్ఛాత్రులగు మీకు శాంతి వలయు. ౨౦

క. అన దనలో మునిపాలుఁడు
జనపాలకబాలువచనచతురత్వ మహో
యని లక్ష్మణ యే నోర్చితిఁ
గనలెడు నీ పరశు వోర్వఁగాఁ జాలదుగా. ౨౧

చ అరయవె దీని వృత్త మకటా వికటారివసుంధరాతలే
శ్వరుల సపుత్రమిత్రముగఁ జంపి తదీయకచాస్రకీకసా
కరమగు ధాత్రికిన్ మడువుగా నొనరించెఁ ద్రివర్ణతన్ గృపా
విరహితనంచు నెంచి ముని వెండియుఁ బల్కె కురారశీలముల్. ౨౨

శా. సారక్రూరతరారలూననిఖిలక్షత్రోరుకంఠాస్రవే
ణీరాశిన్ జతురంబురాశివసన న్నిరేణుకంజేసి త
ద్వీరక్షోణివరస్వయంవరపరాదిత్యాంగనాహ_స్తనీ
రేరుణ్మాల్యమధూళిఁ జేసె నభమున్ రేణూత్కటంబై తగన్ ౨౩

గి అనిన సౌమిత్రి నీ కురారాంచలమున
నవని [1]నిరేణుక నిజంబాడి తనుడు
భార్గవుఁడు గంటె రేణుకాభంగవార్త
[2]నెంచె మర్మంబు వీడు కాని మ్మటంచు. ౨౪

వ. ప్రకాశంబుగా నిట్లనియె. ౨౫

క. ఓరీ క్షత్రియహతక కు
[రారం]బున నిరపరాధుఁడవు నిను జంపన్
సైరించితి కటువచనో
ద్గారిభవద్గళము [3]గావఁ దగ దనఁ దెరలోన్ ౨౬

1. రేణుకయని 2 నెంత 3. గావంగదనం దెరలోనను

గీ. ఓయి భార్గవ భార్గవ యురక నేల
సంభ్రమించెద విదె భవత్కాసనంబు
నకు శరాసన మందెఁదా నా నతండు
నవ్వ దళుకొత్త వీఁడు జనకుఁడె యనుచు. ౭౭

గీ. స్వరము నిక్కంగ నో యాజ్ఞవల్క్యశిష్య
నీకు బాణాసనం బేల నీరజాస
నంబెకా కని పోల్లుంరనంబుగాగ
నవ్వి యవ్వీరమౌని జనకున కనియె ౭౮

ఉ. తామ(ర) పూస పేరు లరుతన్ ధరియింపుచు రాచయొజ్జలై
నేమముతోడ నుండెదు మునిప్రతిమానులు మీకు నేల సం
గ్రామము భీమఖడ్గలతికాశితధార నపారవై రిరా
ట్సామజదానధారల నడంచు నృపాళికెగాక మేదినిన్. ౭౯

క. అటుగాన నీకు నిది గా
దట నుండుము ధాత్రి క్షత్రియాంగారము లీ
వటువులె యార్చెద ననునెడ
నట వెండియుఁ బలుకఁబడియె యవనికలోనన్. ౮౦

సీ. భృగురామ ! శమధనుండగు జమదగ్నికిఁ
బుట్టి శాంతము త్రోవఁ బోవవైతి
నా భార్గవుఁడు శతానందుఁడా యితఁడని
యో శతానంద మేలీ శమంబుఁ
జెప్పు మింతకు నీకుఁ జెప్పెనే జనకుండు
గౌతమవ్రతియొ సంక్రందనుండొ
యన నాత డాత్మఁ బూనిన కోపమున నోయి
క్షత్రియాపుత్ర దోషస్వభావ

గీ. కన్నతల్లికిఁ దెగిన ముష్కరుఁడ ' జాతి
కింగలమ కాన నీ తపస్తుంగమైన
యంగిరసు వంగడము చెడనాడఁ దగునె
యనవు డతఁ డప్పు డాగ్రహవ్యగ్రుఁ డగుచు. ౮౧

వ. ఔరౌర ఓరి కులపాంసన పాంసులాపుత్ర పవిత్రులగు భార్గవుల యెదుటనుం బరతపోనై పుణ్యంబు గణ్యంబగునే యను సమయంబున రాఘవుండిట్లనియె. ౮౨

గీ. భార్గవాంగిరసుల తపోబలము లోక
వినుతమైన విశేషించియును లలాట
నేత్రశిష్యుండవై మన్న నీకు నొక్క
విన్నపము (చేయను)న్నాడ వినఁగ వలయు. ౮౩

చ మునులగు మీకు ధ్యానమును (మౌ)నము దానము నిస్పృహత్వముఙా
వినికియు నక్షమాలికయు [1]వేల్మియుఁ దాల్మియు దండకుండికల్
వినయము నొప్పుఁగాక పెను విల్లును భల్లమునుం గురారముఙా
గినుకయుఁ బోటుమాటలును గేరడ(ముల్ ద)గునయ్య యియ్యెడఙా

మ. సడికి న్నోర్చు కురార మెక్కడ యతిస్వచ్ఛంబు నీ వంశ మె
క్కడ యుగ్రంబగు చాప మెక్కడ యుదగ్రంబైన నీ శీల మె
క్కడ సంగ్రామభయంకరప్రదరవర్గప్రస్ఫురస్ఫూర్తి యె
క్కడ నీ పర్ణకుటీర మెక్కడ పరీక్షాబుద్ధి నీక్షింపగన్ ౮౪

క అన విని భార్గవరాముఁడు
నను నొకమునిమాత్రుఁగా మనంబున బలుమా
రును దలఁచెద వెరుఁగవులే
మును దా నొనరించు కర్మముల మర్మంబుల్. ౮౬

---

1 విల్మియు

శా. కృత్తక్షత్రకరోరకంఠవిగళత్కీలాలధారానదిన్
ముత్తానంబును జేసి తత్కచ(కుశం)బుల్ పూని రక్తాంజలుల్
బత్తిన్ దా నొసఁగన్ గృపాస్మిత జుగుప్సాత్రాససంతోషసం
పత్తిన్ దత్పితృపంక్తి గైకొనదె రామా భీమజన్యస్థలిన్. ౮౭

ఉ. కావున దొల్లి విశ్వమహికాంతుల నిర్వదియొక్కమారు ని
ర్జీవులఁగా హరించి పచరించిన నేనిక (నేడు)మారు లీ
భూవరకోటిఁ జంపి తలపుర్కలు గూర్చి యపక్షదక్షర
క్షోవరవైరిభైరవునకున్ జపమాలికఁగా నొనర్చెదన్ ౮౮

వ. అనుటయు రఘుకుంజరుండు కృతాంజలియై యిట్లనియె. ౮౯

మ తొలఁగం జేయుము కిన్క నా మదికి సంతోషంబు పోషింపు వె
గ్గలమై భూరితరప్రయాసవశమై కాణాచియుంబోని నీ
కల కీర్త్యర్థము నొక్కమాట చెరుపంగానేల దుష్టాగ్రహా
కులచిత్తంబున జూదగానికరణిఁ గోల్పోకకుం [1]దాఁచుచున్ ౯౦

గీ. అనుడు భృగునందనుం డోరి తనదు కీర్తి
తొలఁగనేర్చునె మాటల వలతులైన
యిట్టి మీతోడ మాటల కేమి(గా)దు
నా శరంబుల నోర్వఁ డిందరును గడఁగి. ౯౧

వ. అనుటయు. ౯౨

ఉ. ఆ రఘునందనుండు విను మందరకుం బనియేమి తాన యా
హారధనుర్లతానతిపణాగతభూమిసుతాకరార్పితాం
భోరుహదామరంగదళిపుంగవమంగళకీర్తి[పూర]క
ర్పూరసుగంధి(వక్షమున)న యూధిగ నోర్చెదఁగాక నావుడున్ ౯౩

చ. పరశుధరుండు శంకరుఁడు పారఁగవైచిన ప్రాతవింటిపెం
పురవడిఁ గూర్చి గర్వమున నుబ్బెదు పీవన నెంత రామ నా

1. దాఁచుచున్

శరముల నోర్వ నీ గురుఁడుఁ జాలఁడు మున్ను తదస్త్రసాధ్వసా
కరమ(తి)నే యతం డడిగెఁ గంజజుఁ జేరి ధరామరత్వమున్ ౯౪

వ అనిన నప్పరమపురుషకందళంబు డెందంబున జగద్వందనీయుండగు కుశికనందను నితండు నిందింపం దొడంగె నింక నోర్వనని ప్రకాశం బు[గా] నిట్లనియె. ౯౫

చ పరశుధరుండు శంకరుఁడు పారఁగవైచిన ప్రాతవింటిపెం
పురవడిఁ గూల్చి గర్వమున నుబ్బెడు నేనన నెంత రామ నీ
శరముల నోర్వ నా గురుఁడు జాలఁడె మున్ను తదస్త్రసాధ్వసా
కరమతినే యతం డుడిగెఁ గంజజుఁ జేరి ధరామరత్వమున్ ౯౬

వ. అని మరియు సాటోపంబుగా నిట్లనియె ౯౭

చ కులిశముబోని యల్ల విలు గూల్చితి కూల్చితి(నేన నీ మన)
స్థలమును వాఁడి శల్యమున [1]దాల్చితిఁ దాల్చితి దీన నేమి యా
మలహరు వింటినైన శతమన్యుసహోదరు వింటినైన మ
[2]ద్బలవదభంగతుంగభుజదర్పము లెప్పము సేయనేర్చునే. ౯౮

గీ. అనిన గోపించి [ . ]పాణి
యోరి యోరోర క్షత్ర[ఖ]ద్యోతపోత
శ్రీమదృగురామనామోష్ణధాము నెదుట
మెరయుచున్నాడ విప్రని మరియుఁ గినిసి ౯౯

వ ఏమంటి వేమంటివి యని కులిశముబోని యల్ల విల్లను పద్యంబు పరియించి యిట్లంటివే యనిన రాఘవుం డిప్పుడ పరియించెద వినుమని.

చ. కులిశముబోని యల్ల విలు గూల్చితి కూల్చితి నేన నీ మన
స్థలమును వాఁడి శల్యమున దాల్చితిఁ దాల్చితి దీన నేమి యా
మలహరు వింటినైన శతమన్యుసహోదరు వింటినైన మ
ద్బలవదభంగతుంగభుజదర్పము లెప్పము సేయనేర్చునే. ౧౦౦

1. ద్రాల్చితిం ద్రాల్చితి. 2. ద్వలదభంగ.

వ. అనిన బరశ్వాయుధుం డౌరౌర లెస్స తలపించితి వనిన గౌసలేయుం
డది యెయ్యదియో యన నతం డిట్లనియె. ౧౦౨

ఉ ఆల్లియఁ దట్టుచో వనరుహాక్షుని పేరెదఁ దూలు మాలికా
వల్లిక నాడు తేఁటుల రవంబుల [1]నిమ్మడులౌ ని(శాటికో)
ద్వేల్లితకుంత(లా)రుదితవేదములప్రఘణవై కటంకృతిన్
మొల్లమియై[న] విల్లదె కనుంగొను మీవన బ్రేమ రాముఁడున్. ౧౦౩

క హరికరపంకేరుహమున
నిరవై వర్తించునదియె యీ విల్లన నౌ
నురవడిఁ గైకొను మోపిన
దొరకొను మని నేయ నను నెదుర్కొను మనుడున్. ౧౦౪

క రాముఁ డల విల్లు గైకొన
నా ముని మీబంధుజనము లదరెద రిట సం
గ్రామోచితవసుధకుఁ జన
నౌ మనమని యిద్దరును రయంబున నరుగన్. ౧౦౫

గీ. అపుడు [2]లక్ష్మణుఁ డీక్షించి హర్ష మెసఁగ
కమలనేత్రుని వింటి ముక్కంటి వింటి
పగిది చెడ(కు)ండ నొయ్యన బవరిపరచె
రాఘవుఁడు లీల ని(జ)భుజాలాఘవమున. ౧౦౬

వ. అను నవసరంబున దెర మరుంగున. ౧౦౭

స్రగ్ధర. నింగిన్ దివ్యాళి వాయ న్మెరసి పరశుపాణిన్ దివిన్ ముట్టకుండన్
బొంగారం జేసి దేవీస్ఫుటకరవిగళత్పుష్పసౌరభ్యలుబ్ధ
దృంగీసంగీ[త]భంగీ(కృత)వినుతియశఃక్రీడ విల్వాయు తూ పో
లిం గేళీహంసమై వ్రాలె [3]రఘుపశరధిన్ [4]లెందు చూడుం డనంగన్

1 నిమ్మణులౌ. 2 లక్ష్మణు నీక్షించి 3. రఘువంశరధిం 4 లెడు.

క ఆ రామజామదగ్న్యులు
ఘోరన చను దెంచి రందు పురుషోత్తముఁడౌ
సౌరాన్వవాయుఁ గని భృగు
వీరుఁడు దనలోన దా[ను] విస్మయ మగుచున్. ౧౦౯

క ఈతఁడు (మునిమానసకం
జా)తములకు లోకకోకజాతంబులకున్
గౌతుక మొసఁగెడు (భు)వన
జ్యోతియకా కరయ రాజసుతమాత్రంబే. ౧౧౦

వ. అని మరియును. ౧౧౧

చ. ఇతఁడు పురాణ[1]పూరుషుఁడదే నిజమౌ నలనాఁడు బాణమై
యతనువిరోధి వింటి కొరతంతయు మానిచె నేఁడు బాలుఁడై
యత(లర)పాతలావనితలాదిచతుర్దశలోక[పాల]సం
హతి నుతియించ వంచె సముదంచితలీలఁ దదీయచాపమున్. ౧౧౨

క. అని వత్సా రారమ్మని
యన రాముఁడు నాన నా(న)నాబ్జము వంచెన్
ముని యతని చుబుక మెత్తుచు
ననఘా సిగ్గేల పడియెదని యిట్లనియెన్ ౧౧౩

క. నీ మహిమోన్నతిచే నగు
వామనతయ నాకు మిగుల వట్రిల్లెఁ జుమీ
తామరసబంధులోచన
రామా [2]యామరకిరీటరాశికిఁ బొడవై ౧౧౪

గీ. అనిన రాముఁడు సాంజలి యగుచు నో మ
హాత్మ యీ రీతిఁ బలుకుదురయ్య మీరు

1. పూరుషుండయే 2 యమర

నాకు నంతక [మీపా]దనఖమయూఖ
జలధిఁ గడుగంగనగు మనోమలిన మిపుడు ౧౧౫

క. చండాంశుకాంతియందుఁ
జండతయే చంద్రుశోభ శైత్యంబే యీ
రెండు గుణంబులు గల నీ
మండిత తేజమున కే నమం బొనరింతుఁ ౧౧౬

వ. అని వందనం బొనరిం[చిన] భృగునందనుండు జనకజామాతఁ జేత
నెత్తి యో కల్యాణగుణమాల్యాలంకార నీకు నొసంగు నాశీర్వాదంబు
కేవలపునరుక్తం బయిన నిట్లని దీవించెద ౧౧౭

ఉ రాసి భవచ్ఛరాగ్రముల రావణమస్తము లుత్తరింపు మా
యాసము మాన్పు లోకముల కబ్ద(సహస్రము) లాయు వొందు మ
భ్యాసము [సే]యు కీర్తిధవలాక్షికి నబ్జభవాండ మండల
గ్రాసము కామినీనయనకైరవచందిర ధైర్యమందిరా. ౧౧౮

గీ. అని మదీయాశ్రమంబున కరుగవలయు
ననుపవే యంచు భృగురాముఁ డరుగుటయును
గోచరించిన యందాకఁ జూచి యతఁడు
గడచిపోయిన డెందంబు గలఁగుచుండ. ౧౧౯

క తమ్ముని గనుగొని లక్ష్మణ
యిమ్ముని బెడబాయు ఖేద మింతయు మన చు
ట్టమ్ముల డాయక పాయదు
రమ్మని చని రిద్దరును కరము వేడుకతోఁ. ౧౨౦

* * *

క. నందేల తిమ్మరాజపు
రందరచిహ్నప్రసన్నరాఘవనాట్యా
మందప్రబంధరాజము
నందు చతుర్థాంక మయ్యె నార్యస్తుతమై. ౧౨౧

★

# ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము

## పంచమాంకము



క శ్రీసాంద్రసుధాశృంగా
రాసారసమానితాంతరాళలతాశో
భాసందోహము దనరం
గా సరగున వచ్చి రంత గంగాయమునల్. ౧

వ అందు ౨

క. గంగ కడు నెయ్యమున యము
నం గని యిదియేమి యింత నలఁకువ యో సా
రంగాయతలోచన యని
నం గారణయుగము గలదు నా చిక్కుటకున్ ౩

గీ. నావు దది యెట్టి దనఁగ సుగ్రీవుఁడనఁగఁ
గలఁడు నా కొక్క తమ్ముఁ డో కాంత యనుడు
గంగ తనలోన నెట్లొకో కపికులుండు
దీని యనుజన్ముఁడని యూహచే నెరింగి. ౪

గీ వీర లిద్దరకును దండ్రి సీరజాప్తుఁ
డగుట యిది యుక్తమేయని యతివ యతని
కిప్పు డేమయ్యె తెలియంగఁ జెప్పు మనిన
గంగ కిట్లని పలుకుఁ బతంగతనయ. ౫

క. ఆలంబునఁ గాలుండన
వ్రాలిన యవ్వాలిచేత వడి చెడి యొక కు
త్కీలము శరణంబుగఁ దన
యోలగ మంతయును గుదిఁచియున్నాఁ డనినన్. ౬

గీ. అమరనది పీర లిద్దరు నన్నుదమ్మ
    లేలకో పోర కలదులే యిరువు రొకటి
    యందు నభిలాష మొనరింప నదియు వైర
    తరువునకు బీజ మిది ప్రసిద్ధంబు గాదె. ౭

సీ. అది యటు లుండని మ్మంతకు రెండవ
        హేతువు చెప్పఁగదే యనంగ
    గంగతో నిటులనుఁ గాళింది యొకనాఁడు
        మదనవసంతులమాడ్కి వారు
    ఘనజటాభారవల్కలధారు లిరువురు
        నొక చక్రకుచయు న న్నొయ్యఁ దాఁటి
    దక్షిణంబున కేగి రక్షణంబ యనుండు
        మిన్నేరు మరి యటమీఁద నేమి
గీ యనిన [నో] కొమ్మ యట పొంచి నను గురించి
    కేలు [1]మొగుడించి యో చండకిరణతనయ
    యేము గ్రమ్మరి మావారి నెల్లఁ జూచు
    వేడ్క దయ సేయుమీయంచు వేడుకొనియె. ౮

క నావుడు వారెవ్వరుగా
    భావించితి వనిన జహ్నుపట్టికిఁ జెవిలో
    నీ విధమని చెప్పిన యమ
    నా వినుమీ యిది నిజంబ నా రా*[దనియుజా]. ౯

క. [ఆవర్తచలితహృదయవు]
    గావున నీ వెద్దియైన [2]గడియిం తనుచున్

---

1 మొగిడించి    2 ఘడియెం

*౯ నుండి ౧౮ వరకు పద్యములున్న తాళపత్రము (౭౬) మొదట బెత్తెడు విరిగిపోయినది అందుచే నీ భాగములు నష్టములై పోయినవి.

భావించి యెవ్వఁ డెరుఁగున్
దైవం బెవ్వారి కేమి దలఁచునొ యనుడున్. ౧౦

చ. ఇనజ మరున్న[దీ! జరిగెనేని యొకింతయు నీ వెరుంగ]వే
యన నెరుఁగన్ సరస్వతి సహస్రదళాసను బెంకినుండి రా
[1]గానకౌను వేడ్క నుంటి మనకున్ సరయూముఖవార్త నిన్నియున్
విసన[గు చెంతనే గలదు వేగమ పోవుద మం]చు నేగినన్. ౧౧

గీ. సరయు వేతెంచి యా యిరువురకు మ్రొక్క
నలమి మాయమ్మ కల్యాణివగు మటంచుఁ
బలికె మిన్నేరు తత్పాణిఁ [బట్టి కేల]
[నిట్లు తపియించు] నీ మే నిదేమి యనుడు ౧౨

గీ. సరయు వో గంగ విపరీత సరణిఁ బల్కె
దకట మందాక్షపంకంబునందు మునుఁగు
నాకు సంతాప మొ[ందు టర్థైకసిద్ధి
కని]నఁ దెలియంగఁ జెప్పవే యనుడు నదియు ౧౩

ఉ. ఆరయ వేఁడియై తొరుఁగు నైందుమతేయపురాంగ[2]నాశ్రువా
ర్ధారలచేత నుబ్బి ప[రితఃపరితాపమహోష్ణమైన యీ]
భారపు మేనుఁ దాల్చి మను బ్రాఁతికిఁ జొచ్చిన నాకు సిగ్గు గా
దా ఋభువాహినీ యనిన నాత్మఁ గలంగుచు గంగ యిట్లనున్. ౧౪

క వారల బాష్ప[విసృష్టికిఁ
గారణ మెదియొక్కొ] యనిన గంగకుఁ జెవిలో
నీరీతి యనుచుఁ గనికర
మారఁగ సరయువు వచింప నాకె యడలుచున్. ౧౫

క. హా యాచకహరిచందన
హా యు[ద్ధవిశారద . . . . . . . స్వ

1. గానుకౌను వేట్క 2. నాస్ర.

ర్కా]యకహృదయానందన
హా యిందుమతీశనందనా పుణ్యనిధీ ౧౬

క. [1]అన సరయువు తనలో నిది
తనుదానే తెచ్చుకొనియె దశర[థుఁడన గం
గానదితో యమునయు] నతఁ
డనఘుఁడు వగపేల మానుమా[యని] యనుడున్ ౧౭

క. మందాకిని సరయువు నను
నిందరకుం బొత్తు సువ్వె యీ తాపము దీ
నిం ది[గఁద్రావంగలమా
కుంద]యకుఁడు రామచంద్రు గొడుగుల నీడన్. ౧౮

క. అన నుస్సురనుచు సరయువు
ఘనముగ జల మున్నయపుడుగా మది చెలువం
బనఁ దెలియఁ జెప్పు మనవుడు
తన పెదవులు గదలఁజేయు తరి జాహ్నవియున్. ౧౯

ఆ వె. చాలుఁజాలు నింక సరయువ దవవహ్నిఁ
గ్రాఁగినట్టి తీవఁ గత్తిఁ గోయఁ
బూనె దకట యైనఁ గానిమ్ము చెప్పు మీ
వనిన సరయు వప్పు డాత్మలోన ౨౦

ఆ. వె సుజనులైనవారు స్వజనుల దెసఁ జూడ
లేరు చూడకుండలేరు వినఁగ
లేరు వినకయుండలే రిది చోద్యంబు
గాదె తలఁపఁగా జగంబునందు. ౨౧

వ. అని ప్రకాశంబుగా సరయువు సురనదితో నీ వృత్తాంతంబు మొదలుకొని
చెప్పెద వినుమని. ౨౨

1. అని

క. రాముని నతులితతేజో
ధామునిఁ బట్టంబు గట్టుతరి దశరథధా
త్రీమండలనాయకుఁ ద
ద్భామిని కేకయతనూజ వలికెన్ దౌలుతన్. ౨౩

గీ పార్థివోత్తములకుఁ బ్రజాపాలనంబు
నైజసంధానుసంధాననై పుణియునుఁ
గాదె వాదించి చూడంగ గడియ లిడని
గవని వాకిలి లేఖలోకంబునకును ౨౪

క అన భాగీరథి తనలో
నన యిది యశుభాంకురంబునకు మూలము వొ
మ్మని ప్రకటంబుగ సరయువ
వినుపింపుము మీఁదనైన వృత్తాంతమనన్ ౨౫

వ. సరయు విట్లనియె నబ్బరతమాత యాత్మమనోనాధు గురించి. ౨౬

ఉ. ఆయెడ నీకడన్ వరము లందితి రెండవి నెల్లె నా సుతున్
రాయనిఁ జేయు రాముని వనస్థితుఁజేయు మటంచుఁ బల్కె నా
హాయని గంగ యో సరయువా మరియోయన నాకె వల్కెఁ ద
త్ప్రియసి మాటకుం బొగులు రేనికి ప్రొక్కుతఁ దేగె కానకున్ ౨౭

గీ. అనిన సవిషాదముగ గంగ వొనిఁగె రఘుకు
టుంబమన సూర్యసుత తత్కుటుంబ మేల
సమృగవనదేవతామునిజనము దక్క
రామచంద్రుండు లేమి సర్వంబుఁ బొనిఁగె. ౨౮

వ. అనిన నది యట్టిదయగునని సరయు విట్లనియె ౨౯

క. హిమకరుఁడు లేమి చెలులగు
కుముదంబులె యనఁగనేల ఘోరతమంబౌ

తమమునఁ బడి క్రమమున లో
కము లన్నియు మునిఁగి పోవుఁగాక తలంపఁ౯ ౩౦

సీ. అన విహాయసలోకధుని రామచంద్రు చెం
తన చంద్రికాప్రసాదములు చంద్రు
నలముచందమునఁ బాయరు జానకీసుమి-
త్రాత్మజుల్ వారి వృత్తాంత మేమి
యనవు డా సరయు విట్లను చంద్రునకుఁ జంద్రి
కాప్రసాదంబులకరణి నైరి
యన గంగ హర్షంబు పెనఁగంగఁ దనలోన
నతని వెంటనె యేగి రనుట యయ్యె
గీ. ననుచు నీ వాక్సుధాధార మనఁగఁ గంటి
రామచంద్రునిఁ బాసి సీతామృగాక్షి
యోర్వఁ జాలదు నా సరయువు నిజంబ
గాముఁ డా వేళఁ దనలేమఁ బ్రేమఁ జూచి ౩౧

ఉ. అత్తల సేవమై కతిపయాబ్దము లుండుము నావు డంతలో
నెత్తిన మూర్ఛ సీత చెలు లీరిమి గొల్వనఁ దేరదయ్యె నా
నత్తరణిప్రసూత మరి యచ్చెలి దేరెనె తేరెఁ జుమ్మ లే
కిత్తరి వెంట రమ్మను హృదీశువచోమృత సేచనంబున౯. ౩౨

క. అని సరయువు వచియింపఁగ
ననిమిషనది యిది వసుంధరాత్మజ ప్రేమం
బునకు నుచితంబ యనునెడ
ననియె౯ దిననాధతనయ యా సరయువుతో౯. ౩౩

వ. ఆ సమయంబున రామచంద్రుండు సౌమిత్రికి నేమేనియుం బలికెనే యనిన సరయు విట్లనియె. ౩౪

గీ. తవిలి తమ్ముఁడ శీలశీతలుఁడ వగుచు
భరతు శుభరతు ననుఁ గొల్వు సరణిఁ గొలువు

(స)మము లోకకొన్ని నిమిషార్ధసమములుగ జ
రపుము కనుమోడ్చి యని రాముఁ డపుడు వలుక ౩౫

క. సౌమిత్రి పలుకు యుగములు
జాము లగుఁ‌‌గా నాకు నీదు సన్నిధి గలుగ‌ఁగా
నీ మోము చూడకుండిన
నౌ మన్వంతరము లేతదబ్దము లధిపా ౩౬

గీ అనియె నావుడు గంగ యిట్లనియె రాము
నపుడు కౌసల్య యేమైన ననియెనే య
నవుడు సరయువు వల్కెఁ నన్నాతి రామ
చంద్రుతో సీత [1]యనుచుఁ దా సగము బలికి. ౩౭

క. కన్నీరు దొరుఁగఁ గ(డిఁ) ది[ం]
కన్నిమికులజాత సీతఁ గావఁగ గుణసం
పన్నుఁడు లక్ష్మణుఁ డున్నా
డన్నా ని[న్నొ]క్కఁ టిప్పు డర్థింతుఁ జూమీ। ౩౮

గీ కరము వేడుక రాజ్యభోగములకంటె
వింటె నీ సేవ మది నంటి వెంట వచ్చు
గోల నీ పాలబుగ్గల కొమరు శుభగు
ణాఢ్యు లక్ష్మణు మోమోట నరయుమయ్య. ౩౯

వ అనిన జనకజామాత నిజమాత కిట్లనియె. ౪౦

క. చొలవక తమతమ ప్రాణం
బులపై మోమోట గలుగ బోధింపంగా
వలయునొకో యెవ్వారల
కలకాలము నంతకన్నఁ గలవే ప్రియముల్. ౪౧

1. యనుగు.

గీ. అనిన జాహ్నవి రామున కది మొదలుగ
నైజసౌందర్యమే భూషణంబు గాఁగ
వలయు నా విని సరయువు గలదు వేరె
యొక్క భూషణ మదిదాల్చి యునికి వినుము ౪౨

చ. అతఁడు విరక్తుఁడై తొడవు లన్నియు నూడ్పఁగఁ గోసలాధిరా
ట్సుతి యిది జానకీసతతశోభనలక్ష్మికిఁ బట్టుగొమ్మ సు
మ్మీ తనయ తాల్పుమంచు నొక ముద్రిక నిల్పెఁ బ్రవాళఖండకాం
తితతికి వియ్యమై నగు తదీయకరాంగుళి పల్లవంబునన్ ౪౩

వ వేరొండు చెప్పెద ధీరచిత్తవై యాకర్ణింపు మనిన నిలింపస్రవంతి యింత విననేర్చి యోర్చిన నన్నుధీరయని చెప్పం జొప్పడునే చెప్పు మనిన సరయు విట్లనియె ౪౪

ఉ ఉల్లము సంచలింపఁగ నయో యని పొక్కుచు జంపుఁ దెంపుమై
నల్లెఁ బ్రసన్నవక్త్రుఁడగు నన్నకుఁ గుంతలసంతతిన్ జటా
వల్లిక మల్లికాముకుళవారసమామలినాశ్రుబిందువుల్
జల్లుచు లక్ష్మణుం డపుడు సర్వము నక్కటికం గలంగగన్ ౪౫

గీ. అనవు డినజాత సీత కేమైన బుద్ధి
గరపిరే చుట్ట లపుడన సరయు విట్టు
లనియె నిదియేమి యో! కళిందాత్మజాత!
యజ్ఞకై వడి విపరీత మాడె దీవు ౪౬

ఉ. వేడుకఁ గాన కేగు పతివెంటనె యేగుచు బంధుకోటి కీ
జాడ పతివ్రతానియతి చక్క వినుండని యొప్పఁ జెప్పె తా
నాడక జానకీవనరుహాననకోమలపాదపంకజ
క్రీడద[1]నూనరత్నపరికీలితలాలితనూపురధ్వనిన్ ౪౭

---

1 నూత్న

గీ అప్పు డుప్పొంగి పతి పజ్జ నరుగు సీత
మించు పదపల్లవంబు లీక్షించి వంచి
రక్షితోయంబు పెక్కు తోయముల శీత
లంబు నుష్ణంబుగా స్వజనంబు లనిన ౪౮

క. అంబరనది హర్షవిషా
దంబులయది యిట్టి యొప్పిదంబన సరయూ
జంబాలిని యను రాఘవు
నిం బలికిరి బంధు లపుడు నెనరు దలిర్పన్ ౪౯

ఉ. గోల విదేహబాల కడు కోమలమూర్తులు మీరు రాక్షసో
ద్వేలము కాలదిక్కటము వింటె కుమారక యందుఁ బోవఁగాఁ
బోల దటంచు పల్కరనఁ బుష్కరగంగ వచింపు మీఁదు నా
వేలుపుటేటితోడ సరవిన్ సరయూనది పల్కుఁ గ్రమ్మరన్. ౫౦

గీ. దివిజమురజవ్రజధ్వనిద్విగుణగుణని
నాదకోదండపాణియై నల్లగల్వ
సరుల పౌరాంగనాకటాక్షములు దన్నుఁ
బూన్ప నతఁ దేగె దక్షిణంబునక యనుడు. ౫౧

గీ రవిజ పనియేమి యప్పుడు దివిజమురజ
సమితిమ్రోయంగ నన గంగ సఖి [1]యెరుఁగ[వె]
నీవు [నే]తద్గభీరవిరావసరణి
వలన గంభీర మొక్కటి ధ్వనితమయ్యె ౫౨

చ. అని మరియున్ విషాదమున హా యజరాజతనూజవంశపా
వన గుణసంపదల్ గలుఁగువాఁడవు నీ వొక భాగదేయమున్
గని మనఁజాలవైతి వనఁ గంజవనీహితుపట్టి యట్టి నం
దను తృణలీలఁ బోవిడుచు తద్విభునిం గొనియాడఁ బాడియే. ౫౩

1 యెరుంగ.

వ. అనిన శాంతం పాపంబని సరయు విట్లనియె. ౫౪

గీ. అతఁడు కేకయసుతచేతి వెతకు మోహ
రోషముల సంధిఁ బరచి చోరులకు వెరచి
మేను దనసొమ్ము బడి విడువానికరణి
విడిచెఁ బ్రాణంబుఁ దృణలీలఁ గొడుకు బడిని ౫౫

చ అనిన కళిందజాత యిది యా భరతుండు సహింపఁడో సుమీ
యన విను మాతృమాతులగృహంబుననుం డిట వచ్చినట్టి యా
తనికిని దల్లికిం గలుగు తర్కము దానికి నుత్తరంబు వా
మ్మన సరయున్ సుపర్వనది యవ్విధ మెట్టిది చెప్పవే యనన్. ౫౬

వ సరయు విట్లనియె ౫౭

శా అంబా తాత యెటేగె దేవపురికిన్ హా హేతువో పుత్రశో
కంబే యే సుతుఁ డీవు దమ్ముఁడవుగాఁగన్నాతఁ డేమయ్యెఁ గా
నంబొందెన్ బనియేమి రాజువలుకన్ భాషించెనే యిట్లు నే
సంబాధింప ఫలంబొ నీ వసుమతీస్వామిత్వమే యక్కటా! ౫౮

క అన విని లోకత్రయపా
వనియగు గగనస్రవంతి వత్స భరత రా
ముని తమ్ముఁ డౌదువన న
ల్లని నది మానసజ నవ్వలఁ దెలుపు మనినన్. ౫౯

క. అనియె నయోధ్యాంతికవ
ర్తినియగు నది యవల నాకు దెలియదు తెలియం
జనియె నొక యంచ యమునం
తన యదియు న్వచ్చి తమకు దండము వెట్టన్ ౬౦

గీ. తారు మువ్వురుఁ గమలావతంస హంస
శోభనావాస మగుమని సొగయఁ బలికి

రందు బృందారకాపగ యా సితచ్ఛ
దంబుఁ గనుఁగొని యనియె మోహంబుతోడ. ౬౧

క మావారి పథికచరితము
లో వారిజగర్భవాహనోత్తమ ! నాకున్
నీ వానుపూర్విఁ దెలుపుము
నా విని యా రాజహంసనాయకుఁ డనియెన్ ౬౨

ఉ. వెంటనె వచ్చు చుట్టముల విఘ్నములుంబలె నంటు వాపి వె
న్వెంట విభూతిభాతిఁ దరుణీమణి రా సుఖలాభలీల నా
వెంటనె భక్తిమై వినయవేది సుమిత్రసుతుండు గొల్వఁ గీ
డంటక రామచంద్రుఁడు నయక్రియ ముందట నేగె నావుడున్ ౬౩

క. బృందారకనది యవ్వలి
చందము వివరింపుమనిన జలఖగ మనియెన్
కొందరు పథికులు మీవా
రిం దెరువునఁ గాంచి పలికిరి ముదం బొదవన్. ౬౪

చ అదె సమసైకతైకపద మల్లదె తిన్నని శాద్వలస్థలం
బదె పొదలం దనర్చు నది యల్లదె చల్లని చాపరాలనే
లదె విరిగల్వతమ్మినెల వల్లదె పూచిన కన్నె[1]మావిచా
లదె యొక చెంచుఁ బల్లి చను డల్లదె యింకని వంక చేరువన్. ౬౫

గీ అనిన మిన్నే రహో సంతతాధ్వఖేద
నోదనములయ్యె పథికుల నొడువు లనిన
యమున యటమీది కథ చెప్పుమనుడు హంస
మనియె జానకి పతివెంట నరిగి యరిగి ౬౬

క. భీరు చమూరువుఁ జూచి కృ
పారసలీలాత్మయగుచుఁ బయ్యెదఁ బతి వి

1 మాని.

ల్లా రమణి గప్పి చెవి కే
దారయవాంకూరలవము దానికి నొసఁగెన్. ౭౭

వ. మరియును. ౭౮

ఉ. ఆ కరభోరు వొక్క కమలాకరసైకతసీమ సామియౌ
కోకము నింతయేం దడవు కూరిమిఁ బాయుటకున్ సహింపఁగా
లేక మెలంగు కోకసతి లీలఁ గనుంగొని నెమ్మనంబునన్
దా కొనఁజేసె మోదమును దాపము నావిని జహ్నుజాతయున్. ౭౯

క. అనుకంపనీయవత్సల
మన జానకి యనుచు నసుఁగుమై మా[మ]కవ
త్సనికాయపథికశీలము
లనుపమనయశీతలంబు లాహో యనినన్. ౮౦

వ. పతంగపుంగవంబు భాగీరథీ! పథికనీతి యేరీతి యనిన విష్ణుపదజాత
యిట్లనియె ౮౧

చ. నడచుట వీను లర్కకిరణంబులఁ జుర్కను దాఁక, నంతటన్
విడియుట నీడ నెండవడ పీడగఁ బారినదాఁక, క్రమ్మరన్
నడచుట ప్రొద్దు గ్రుంకుమల నట్టున కేగినదాఁక, యామెయిన్
విడియుట మంచి చెంకి నరవిందము మేల్కనుదాఁక మానవుల్. ౮౨

క. అన జాలపాద మిది యె
ట్లనువగు నెడతెగక నడచు నధ్వగుల కనన్
విని భాగీరథి యకటా
కనలెడు కష్టెండ కోర్చెఁగా జానకియున్ ౮౩

చ. అనుటయు నీడజంబు వగ నందకుమమ్మ తపింపదయ్యె న
జ్జనకజ నావుడున్ ముద మెసంగ మరున్నది యెట్లొకో తపిం

పనియది [1]ప్రోదియంచ యను మంజులనీలపయోజదామసాం
ద్రుని రఘురామచంద్రుని కనుంగవ పండువు సేయఁజూచుటన్ ౭౪

క నా విని సురనది ప్రియతము
పై వేడుకఁ జల్లనైన పార్థివి దనలో
నావంతయుఁ గలఁగదు మన
మా వెలఁదికి వగవఁబోల దన సరయు వనున్ ౭౫

క కేవలము వగపు మానుట
యే విను బ్రతికితిమిగాక యిపు డనపుడు భా
షావల్లభవాహన మను
నా వాహిను లాదరమున నాకర్ణింపన్. ౭౬

గీ. చండచండాతపస్ఫూర్తి మండునట్టి
ధరణిఁ గరకులఁ బోలె నీ తెరువు సీత
శీతలంబుగఁ బ్రేమార్ద్రచిత్తయగుచుఁ
దలఁచె ప్రాణేశు నడుగుల కలిమిఁ జేసి ౭౭

వ. అనిన దినకరజాత దినకరుం జూచి ౭౮

చ. విను తగునయ్య తండ్రి రవి వే[ఁడి]మి నై జకుటుంబకంబునం
దనయముఁ జూప నా సరయు వంబుధిమేఖల నీ కుమారియం
దునె దయమాలి తీ వనిన ధూర్జటి యాదలయేరు నవ్వి యి
ట్లనఁ బనిలేదు భూతముల కవ్విధి సాజము నావు డంచయున్. ౭౯

గీ అ[ధి]పకరపద్మచలితవల్కాంచలైక
[3]పీతఘర్మాంబుముఖలక్ష్మి సీత దనరె
నవనితనయావిలోలనేత్రాంచలైక
[4]పీతఘర్మాంబుముఖలక్ష్మి ధాతఁ దలరె ౮౦

1 ప్రోదియంచయన 2. శీత 3. పీత 4. పీత

క. అన విని జాహ్నవి యౌరా
వినిమయకమనీయభావవిభవం బనినన్
దిననాథతనయ యవ్వల
వినుపింపుమనన్ విహంగవిభుఁ డిట్లనియెన్ ౨౧

చ విడిదల యంతనింతఁ గని వేగమ ముందర నేగి నాలుగే
నడుగు లెదిర్చి భక్తి విశిఖాసన మందుచు సీత నీతి చొ
ప్పడ ననుజన్మయుక్తుఁడగు భర్తకుఁ బల్లవఝల్లరిన్ క్రమం
బెడలిచె తన్ బతివ్రతలకెల్ల శిరోమణియంచు నెంచగన్. ౨౨

చ. జనకసుతాకరాంతరవసత్కుసలవ్యజనప్రభూతమౌ
ననుఁదనుగాడ్పు లా నృపతనూజుల మోములఁ గ్రమ్మ ఘర్మజీ
వనమె హరించెఁగాని మరి వారలకున్ వగఁ బుట్టు నేత్రజీ
వనము హరింపలే వకట వచ్చియుఁ బోయియు నేమిచెప్పఁగన్ ౨౩

గీ. విడియుచోనెల్ల నూర్మిళావిభుఁడు సేయు
సేవచే రామచంద్రుండు సేదఁ దేరె
తను నోకించుక యెదవాయుటనె కృశించు
నన్ను కరుణార్ద్రదృష్టిచే నతఁడు దేరె ౨౪

వ. అనిన సరయు విట్లనియె. ౨౫

క. ఎన్నాళ్ళకు రఘురాష్ట్రం
బన్నిసుఁగులు దాటి రనుడు హంస బనియెన్
[1]సన్నమె రాఘవరాష్ట్రం
బెన్నంగానైన నెరుఁగవే విను మనుచున్. ౨౬

శా. ఆ రాజుల్ [2]స్వశరావనమ్రనిఖిలక్ష్మాధీశకోటీరకో
టీరత్నద్యుతిమాంసలాంఘ్రినఖవాటీదీప్తు లేపారఁగా

1 వన్నమె 2. స్వరసావనమ్ర.

దూరోన్ముక్తచతుస్సముద్రలహరీస్తోమప్రకీర్ణాచ్ఛము
క్తారాజద్వలయావనీవలయమున్ గైకొన్నవా రున్నతిన్. ౮౭

గీ. కాన రాఘవరాష్ట్రంబుఁ గడవ వళమె
కడచి యుత్తరకోసలాఖ్యం దనర్చు
దేశములు మూడునాళ్లు దివసములవ
నా జగత్పావనులు తదనంతరంబ ౮౮

క ఫాలవిలోచనజూటీ
మాలికసురనదిఁ గళిందమహీధరమదళుం
డాలకటదానధారన్
గాళిందిం దాటిరనిన గగనాపగయున్ ౮౯

క. యమునానదితో నేకాం
తముగా నీ వనినమాట తార్కాణయ్యెన్
గ్రమమున ననునెడ మానస
కమలాకరజాత వలికెఁ గట్టాయనుచున్ ౯౦

గీ. జాహ్నవీసూర్యతనయలు చపలవిపుల
వీచికరములు గలిగియు నోచరైరి
వల్లికాలింగితాంగియై వడఁకు జనకు
పట్టి చేపట్టి నిలిపెడు భాగ్యమునకు. ౯౧
వ అనుటయు. ౯౨

క. గగనాపగ యొక్కించుక
నగి మొగమొగమునవె యిట్లనంగా నీకున్
దగునే యన యమునానది
ఖగమా యటుమీఁదు తెలుపఁగదె యన నదియున్. ౯౩

మ. చని యా ముప్పురు దాఁటి రాటవికరాజభ్రాజదిష్వాసము
క్తనిశాతప్రదరప్రభిన్న(గ)జమస్తప్రస్తముక్తాఫలా

భినవాకోరకితప్రతీరలతికాబృందాంతసంక్రీడమా
ననిరాంధ్యోదయవింధ్యశైలతటనానాసీమజజ్ఞా సోమజన్ ౯౪

వ మరియును జనిచని. ౯౫

శా. చేరం బోయిరి వార లంత సుమన(స్సి)మంతినీగాహినిన్
పారస్ఫారవనీవిహారమునిదంపత్యున్నతోత్సాహినిన్
వారాన్నిధ్యనుకూలగేహినిఁ బయోవాహౌఘసందోహినిన్
గ్రూరాన్యేహితవస్తుదోహిని మహాగోదావరీ(వాహినిన్) ౯౬

వ. అనిన యమున యిట్లనియె ౯౭

గీ అచట లంకాధినాయకు ననుజ యగుట
మత్తయై చుప్పనాతి గ్రుమ్మరుచునుండు
హంస మతిమత్తయది లక్ష్మణాసికృత్త
నాసికారక్తసీధుపానమున నుండు. ౯౮

ఉ. అనిమిషస్రవంతి భయమందుచు దాని నెరింగి యా జన
స్థానవసద్విశృంఖలనిశాచరు లప్పు డెదిర్చిరో యనన్
మానసగేహి వాహరథనాగభటోత్కటులై యెదిర్చి ర
మ్మానవనాథుఁ గూర్చి వలమానకృపాణరుచుల్ భ్రమింపఁగన్ ౯౯

వ అనుటయు. ౧౦౦

క. గంగానది ఖేదమున వి
హంగమ యటుమీఁదు దెల్పుమన నదియున్ రా
ముం గరుణాధామున్ బ్రే
ముం గని సౌమిత్రి వలికె ముద మొప్పంగన్., ౧౦౧

క. ఆసురిపేశలనాసా
గ్రాసము పదనగుట ముష్టిఁగడలెడు నిదె నా
చేసురియ సాళవము సమ
దాసురభటకరినకంధరామిషమునకున్. ౧౦౨

చ అన విని రామచంద్రుఁ డదియట్టిదయౌ బ్రకృతిప్రభీరువుల్
వనితలుగాన నీవు కరవాలకరుండయి కావు పర్ణశా
లన మహిజాతనుంచి పదిలంబుగ [1]నే నిదె యంచు మాటలో
నన దనుజాళిఁ దాఁకెనన నాకతరంగిణి లోఁ గలంగుచున్ ౧౦౩

వ. శకుంతంబ యనంతరం బెరింగించవే యనిన నంచ యిట్లనియె. ౧౦౪

శా సౌమిత్రిం బిలిచెన్ క్షణంబున జయోత్సాహప్రసర్పద్గభీ
రామందధ్వనిశాలి నా సరయు వౌరా రాముఁడే పిల్చువాఁ
డీమై నా నటుగాదు (నా) యమున హా యేఁ జెల్ల నో గంగ పూ
ర్వామర్త్యాళియె పిల్వఁ జెప్పదుగదా హంసంబు నాఁ బక్షియున్. ౧౦౫

వ. తెలియఁ జెప్పెద వినుమని. ౧౦౬

శా. సౌమిత్రిం బిలిచెన్ క్షణంబున జయోత్సాహప్రసర్పద్గభీ
రామందధ్వనిశాలియై చటులదావాటక్షపాటాధిప
స్తోమాదృగ్గలకించిదంతరితరుద్ధామాంకమైనట్టి యా
రామక్షోణితలాధినాయకు ధనూరాజంబు తేజంబునన్ ౧౦౭

సీ. అనిన మానససరోజని దైవవశమునఁ
బ్రతికితి ననుడు సుపర్వతటిని
యీ విధం బరయంగ నెండ బెట్టుగఁ జూపి
యమృతంబు వర్షించినట్టిదయ్యె
ననవు డా సుగ్రీవు ననుఁగుఁ దోఁబుట్టు వో
ధాతృవాహనకులోత్తంస హంస
[2]యటు తరువాతి వృత్తాంతంబు వినుపింపు
మన నంచ వలుకు నయ్యనఘమతు[లు]

గీ. త్రిదశరిపుమర్దనక్రియాముదితసకల
సంయమీశ్వరముఖపంకజాతజాత
సాధుభాషణవిరచనాశ్రవణపరతఁ
గోరి యచ్చోట నుండిరి కొన్నినాళ్లు. ౧౦౮

1. నేనిది 2. యది

వ తదనంతరంబ. ౧౦౯

ఉ కిమ్ములఁ బూతపూ వలుకు కెంపుల కన్నులు మిన్న చుక్క తం
డమ్ముల నీను ముత్తెపుఁ బొడల్ విడి గప్పులు గుప్పు నీలవా
లమ్మను నిమ్మపంటి పసలం గసరెత్తు పసిండి మేని యం
దమ్మను గల్గు నొక్క మృగతల్లజ మల్లనఁ దోఁచె ముందరన్. ౧౧౦

ఆ. వె. అనవు డంతరంగమున గంగ యిది యన
ర్థాంకురంబు నిక్కమనుచుఁ దలఁచి
యండజాధినాథ యటమీఁద నేమయ్యె
తెలియఁ బలుకు మనినఁ బులుఁగురేఁడు. ౧౧౧

ఉ నీలపయోజధామరుచి నిక్కి వినిర్జితపుష్పకార్ముక
భ్రూలతికామనోజ్ఞమగు భూసుత తిన్నని కన్నుఁ(గో)నయుం
బోలి మృగాక్షి లేఁబొమలఁ బోవఁగనాడెడు వింత నెంతయున్
గ్రాలుచు రాముఁ డా జిగి మెగంబు బడిన్ వడి నేగె నయ్యెడన్. ౧౧౨

చ భయమునఁ గ్రమ్మ నమ్మెగపు బాగున దూరము వోయె సీత బు
ద్ధియు, నుటజస్థలం బెడలెఁ దీవ్రత లక్ష్మణుఁడున్ ధనుర్ధరుం
డయి, యట కొక్క భిక్షుకుఁడు నప్పుడ వచ్చె ననంగ గంగ యా
పయి నయినట్టి దేమి యనఁ బద్మజు మోహనవాహనం బనున్. ౧౧౩

చ. ఇట దయమాలి రాముఁ డల యేణము నేయుట లక్ష్మణుండు దా
నిట తమ యన్న యున్నెడకు నేగుచునుండుట సీత ప్రీతిమై
నిట యతి కేల మాధుకర మిచ్చుటఁ దెల్లమిగాఁగ గంటి నొ
క్కట గగనావకాశపరికల్పితచారువిహారవై ఖరిన్. ౧౧౪

వ. అనిన సరయువు తరువాతి వృత్తాంతం బెరింగించు మనవుం డంచ
యిట్లనియె ౧౧౫

ఆ. వె. పసిఁడి మెగముమీఁదఁ బారు నారాచంబుఁ
జూచి దాని పాటుఁ జూడలేక

కన్ను మొగిచి నీదుకడ కేగుదెంచితి
రామచంద్రు కథలు ప్రేమఁ దెలుప ౧౧౬

క ఓ తల్లులార యాతా
యాతంబులచేత శ్రమము నందితి నిఁక న
న్నీతరి మన్నింపఁగరా
దే తోయవిహారమునకుఁ గృప దలిరింపన్. ౧౧౭

వ అనుటయు ౧౧౮

ఉ గంగపతంగపుంగవ వికస్వరసారసహంస సంసదు
త్తుంగతరంగరంగమగు తోయనికాయము నీదు నేదవా
యంగ పురాంగనాచరణహాటకనూపురజాతజాతని
ర్భంగఝళంఝళారవవిరాజిత[రాజత]లీలఁ బ్రవాలుచున్. ౧౧౯

వ అనిన సితచ్ఛదంబా నదుల పదంబుల కెరఁగి యరిగెఁ దదనంతరంబ
యంబరనది సరయువుతో నిట్లనియె. ౧౨౦

శా ఈ వార్తాశ్రవణంబునన్ మనసు నా కెంతేనిఁ జింతాకులం
బై వర్తిల్లెడు నావు డా సరయు వంబా యింత సంతాప మే
లా వైదేహికినై తలంపొదవె నాహా నూపురంబంచు నీ
చే విన్నప్పుడ యొందుదాని వినుమా చిత్తంబు రంజిల్లఁగన్. ౧౨౧

క ఆ పరమపతివ్రత కుల
దీపిక గుణవతి యరుంధతీరమణీమణీ
నూపురము లడవి కేగు మ
హీపుత్రికిఁ జూపి ప్రేమ నిట్లని పల్కెన్. ౧౨౨

క. ఈ లాలితనూపురములు
గిలింపుము పీనిఁ దాల్చు గృహిణీమణు లే
వేళం బతులం బాయరు
వాలాయము సుమ్ము నమ్ము వనరుహనేత్రీ. ౧౨౩

గీ. అనవు డా సీత యందె నయ్యందె లనుచుఁ
బలుకు సరయువుతో గంగ పలికె [మగుడ]
మగుడ బ్రతికితినమ్మ యిమ్మాటవలన
నా యరుంధతి పలుకు సత్యంబు గాన ౧౨౪

సీ. మన మందరముఁ బోయి మనువంశవత్సలుం
డైన యా నీరాకరాధి(పతికి)
(వినుపింప)[వలయు నీ వృత్తాంత మంతయు
ననుచు ముప్వురుగూడి యచటి కరిగి
రమర]స్రవంతి యారౌరా ప్రవాహవే
గ మ్మిది నిమిషమాత్రమ్ములోన
నెంత దూరముగాఁగ నేతెంచితిమి వా(ఁడె)
గోదావరీనదిఁ గూడిమాడి

గీ. యంబునిధి యేమియో మాట లాడుకొనుచు
నెదుటఁ గనవచ్చె ననఁగ నయ్యెడఁ బ్రవేశ
మయ్యె నయ్యేటితోడఁ బుణ్యాకరంబు
హరివిహారాకరంబు రత్నాకరంబు ౧౨౫

వ. ఆ సమయంబున సరయు విట్లనియె. ౧౨౬

క. గోదావరి జలనిధితో
నేదియొ వృత్తాంతశేష మెఱిఁగించు తెఱం
గాదటఁ [1]దోఁచుచున్నది
నా దినకరజాత [2]నూతనంబగు తెలివిన్ ౧౨౭

గీ. అట్టె తప్పదు మనకు నయ్యంచవలన
నవగతము కాని కతయవో యనుచుఁ జెలఁగు
చోట గోదావరీనది యేటిమగనిఁ
బలికె నవమాధురీధుర్యలలితఫణితి ౧౨౮

1. దోంపుచు 2. యూతనంబగు

స్రగ్ధర రామోన్ముక్తైకబాణప్రహతహృదయమై వ్రాలె నేలం గురంగం
బా మారీచాఖ్యదైత్యుండయి యురమున రక్తాంబుపూరంబు లొల్కం
గా మాయాభిక్షుకుండుఁ క్షణమున మణిరుగ్జాలఖేలత్కిరీట
స్తోమోద్దామోత్తమాంగస్ఫురణదశశిరశ్శక్రశిష్యేంద్రుఁడయ్యెన్. ౧౨౯

క అనుటయు జాహ్నవి యకటా
యని వగచుచు దానికేమి యల నూపురమం
దన మున్నదిగా యనునెడ
వనవిధి మన జనకసుతను వాఁ డంటెనొకో. ౧౩౦

వ. అనిన గోదావరి యా దేవి వంటం దరంబె యని యిట్లనియె ౧౩౧

చ. కిరిహరిపుండరీకపరికీర్ణ మహాగహనాంతరంబులన్
సురరిపు లంటకుండ ననసూయ నవోత్పలశీతసీత క
బ్బురముగఁ బూయు కమ్మ మయిపూఁత దవానలకీలజాలపిం
జరమగు నొక్క తేజమయి చండతఁ జూపుచునుండె నయ్యెడన్ ౧౩౨

క. నావుడు వననిధి యౌరా
పావనియగు నత్రిమౌనిభామిని వ్రతచ
ర్యావైభవ మనవుడు గో
దావరి యిట్లనియె నంత దశకంధరుఁడున్ ౧౩౩

క వారుణమంత్ర [ధ్యానా
కారితనూతనవలాహకాంచలనిచుల
స్ఫారకరుఁడౌచు జానకిఁ]
జేరం జని పట్టె నేమి చెప్పెద ననఘా ! ౧౩౪

ఉ. ఓ జననాథ యో రమణ యో రఘుకుంజర యో కృపావిధీ
యో జగదేకవిక్రమ యయో ననుఁ గన్నదు వేల నేసెదం

[1]చా [జ]వరాలు రాలు గరఁగై పరపన్ మొరవెట్టఁ గొంచు సం
ధాజయిదైత్యుఁ డంబరపథంబునఁ బోయె రథంబు మ్రోయఁగన్ ౧౩౫

క. అను సమయంబున సరయువు
మన భాగ్యమునన్ వసిష్ఠమానిని వచనం
బును దవ్వే (చ)నియెఁగదా
యన దివిషన్నది యచేల యగు ననుమండన్. ౧౩౬

గీ కడలి సవిషాదముగ మీఁది కథ వచింపు
మనిన గోదావరీనది యనియె నంతఁ
బంక్తికంధరు నరికట్టి పక్షినాథుఁ
డగు జటాయువు కుపితుఁడై యతనిఁ బలికె. ౧౩౭

ఉ ఏర దురాత్మ నా యెదుటనే రఘువీరపురంధ్రిఁ జోరతన్
హారశిరశ్శశాంకకళయట్ల హరింపఁగఁ జూచెదౌర నా
ఘోరనఖాళి నోరి మణిగుంభితచూడుఁడవైన నిన్ సుధా
పారణఁ గోరు పాము నల పక్షివిభుండన దుండగించెదన్. ౧౩౮

వ. నావు డా దైవశైవలిని యిది పదకటకప్రభావం బనునెడ నంబుధి హర్షం
బున మీఁదటి వృత్తాంతంబుఁ జెప్పు మనిన గోదావరి యిట్లనియె ౧౩౯

క. దైతేయదళననఖముఖ
ఘాతంబున రథమ విరిచెఁ గాని ఖగము త
త్ప్రతాలాభమనోరథ
మాతరి విరువంగ నోపదయ్యె నధీశా ౧౪౦

సీ. అనుడు పారావార మటుమీఁద నేమయ్యె
నో వార్త యనిన గోదావరియును
పటుకఠోరనఖాస్త్రపాతభీషణమైన
రణరంగవీథి రావణునిచేతఁ

---

1 చ్ఛావరాలు

జిక్కి భీతిఁ దలంకు సీత మంజీరంబు
దయపుట్ట మ్రోయుచు ధరణిఁ బడియె
నావు డా గంగ యింతటఁ దేరెఁబో యాస
యనఁగ గోదావరి యనియె నంత
గీ వెడఁగు దానవ నా బారిఁ బడితి వింక
యెందు వోయెదు నిలునిలుమీ యటంచు
వీరమునఁ జేరి తత్ఖడ్గధార నజ్జ
[టాయు] వాయెడఁ గూయుచు నవనిఁ బడియె ౧౪౧

క. నా విని శై[వ]లినీపతి
యో వత్సా సీత యాస లుడిగితెయని మూ
ర్ఛావశుఁ డగుటయు జాహ్నవి
యావేళన్ విభునిఁ గదిసి యనుఁగు వెనంగన్. ౧౪౨

గీ. వలుద గుబ్బల మీఁది దువ్వలువ సురటి
నా రఘూద్వహవత్సలుండైన భ(ర్త)ఁ
దేర్ప నాతండు కన్నులు దెరచి యీ వి
యచ్చరాపగ యెప్పుడు వచ్చె ననిన. ౧౪౩

క. ఏనొ(క)తె వచ్చితినె సర
యూనలినాప్తజలు వచ్చియున్నారనఁ బా
థోనిధి నను నరయుఁడు చిం
తానదిలో మునిఁగినాఁడ తడయక యనుడున్. ౧౪౪

వ. జహ్నునందన యిందులకుం గొందలం బందనేల వినుమని. ౧౪౫

క. కాపురుషులకగు సంపద
యాపదకే మూలమై[న]యది విదితముగాఁ
గాపురుషేతరులకు నగు
నాపద సంపదకు మూలమగుఁ జింతింపన్. ౧౪౬

మత్తకోకిల
నావు డా సరయూతరంగిణి నాకుఁ జెప్పుఁ గదమ్మ గో
దావరీ యల నూపురంబు విధంబు నా నదియున్ వనీ
దేవతామణి నాకు నంతయుఁ దెల్పె నొక్కఁడు ఋష్యమూ
కావనీధ్రముఁజేరెఁ దద్వలయంబుఁ గైకొనియం చనన్. ౧౪౭

గీ. అంబునిధి రామచంద్రుఁ దేమయ్యెఁ జెప్పు
మనిన గోదావరీనది యతఁడు జనక
జావియోగార్తిఁ దమ్మహస్తమ్ము వూని
యరిగె నల్లన నాశైలమునక యనుడు ౧౪౮

వ. ఆ సమయంబునం దెర మరుంగున. ౧౪౯

క. ఆళీ కాళిందీనది
మేలందే వనిన యమున మెచ్చెవ్వరొకో
తూలెడు తన మెయి శీతసు
ధాలవనవదృష్టిచేతఁ దడిపెడువారల్. ౧౫౦

క. అని పొంగఁ దుంగభద్రా
ధుని గొబ్బున నేగుదెంచి తోయధి జేజే
యన వారిధి యేగతి న
య్యినసుత మేలందుఁ జెప్పవేయన నదియున్. ౧౫౧

ఆ. వె. తుంగభద్ర దీని తోఁబుట్టువైన సు
గ్రీవునందుఁ జేరెఁ గిశ[చ]క్ర
వర్తిపదవి యనిన వనజాతహితతనూ
జాత తనదు మానసంబులోన. ౧౫౨

క. ఇవు డలమెఁ జంద్రచండా
తపములు నా యుభయపార్శ్వతలముల నను వే
ళ పయోనిధి వాలి రాజ్యము
తపనతనూభవున కెవ్విధంబున వచ్చెన్. ౧౫౩

వ తెలియం బలుకు మనిన తుంగభద్ర యిట్లనియె. ౧౫౪

ఉ ఎక్కడి వాలి యింక నది యేమి యనన్ విను పెండె మిచ్చినన్
మిక్కిలి నమ్మినట్టి రఘునేతకు నర్కతనూజయుక్తుఁడై
మక్కువ సేవ చేయు హనుమంతుఁడె యింతకు నాదికారణం
బిక్కథఁ జక్కఁగా వననిధీ వచియించెదఁ జిత్తగింపుమా. ౧౫౫

శా లీలన్ హైమమృగంబుఁ జంపుగతి వాలిం జంపి సుగ్రీవునిన్
గోలాంగూలవరేణ్యుఁ జేసి సఖునిన్ గోల్పోవుటన్ రావణుం
డోలిం జాలిఁ బడంగఁజేసి నిజవంశోత్తంసు నుష్ణాంశు ను
ద్వేలామోదసనాథుఁ జేసె భుజశక్తిన్ రాముఁ డుద్దాముఁడై. ౧౫౬

వ అనినం దరంగిణీపతి మުంగలి కథ చెప్పుమనినఁ దుంగభద్ర యిట్లనియె.

ఉ వాడిన పూవుదండగతి వాసన దోఁపని జానకీసతిన్
చూడుఁడు దిక్తటంబుల నశోకనలాంగదవాయుజాదులం
చాడిన మర్కటేశ్వరుని యాజ్ఞ శిరంబులఁ దాల్చి యేగి ర
ప్రోడలు జాడ లారయుచు బోరున నప్రతిమానయానులై. ౧౫౭

గీ అనిన మున్నీరు బ్రతికితిమయ్య యనిన
ననియె గోదావరీనది యఖిలజనులు
బ్రదికి రీ వొక్కరుడవేల యుదధి నావు
డతఁడు నిక్కము రఘురాముఁ డఖిలహితుఁడు. ౧౫౮

వ అది యెట్లంటేని ౧౬౦

మ. ఇది భాగీరథి వారి యూరి మనుఁగాఁ పీ మానసోద్భూత యీ
నది సూర్యాత్మజ యేను సాగరుఁడ దీనం[1]జేసి యా రాఘవా
ఖ్యుదిశన్ జుట్టలమౌట వత్సలత మాకుం గల్గినం జాల మీ
యెదలం గల్గఁగ నేమి నేఁడు మనలోనే చూడు గోదావరీ. ౧౬౧

1. జేర.

వ. అని యుదన్వంతుం డంతరిక్షం బీక్షించి వైలక్ష్యంబున ౧౬౨

మ. శతకోటిస్ఫురితారదారితగరుజ్జాలంబులయ్యేన్ గిరుల్
మతి నూహింప మదంబుమగ్నమగు నీ మైనాకమే తక్క నీ
యతివిస్తారధరాధరంబు మిహికాహార్యంబొ వింధ్యంబొ యు
ద్ధతిమై దాఁ బెడుఁ జూతమంచుఁ జని రుద్యల్లీలఁ దారందరుల్. ౧౬౩

* *

క. నందేలతిమ్మరాజపు
రందరరచిహ్న ప్రసన్నరాఘవనాట్యా
మందప్రబంధరాజము
నం దేనవ యంకమయ్యె నార్యస్తుతమై ౧౬౪

★

# ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము

## షష్ఠాంకము



క. శ్రీరామలక్ష్మణులు జగ
దారాధ్యులు చండతరశరాసనవిద్యా
పారంగతు లురుపుణ్యులు
హారియశోధనులు వచ్చి రాతరువాతన్ ౧

వ. అప్పుడు ౨

శా. మించెం జండమరీచి మింటఁ బడ సౌమిత్రీ తరుచ్ఛాయకున్
మంచుంజాయలవేల్పుగా కితఁడు రామా రాత్రి ప్రొద్దుండునే
చుంచుం (బాపఁ) డదె ప్లైరింగితివి లోఁ జూడన్ మృగంబున్కి హా
చంచచ్చాలమృగాక్షి యెందరిగితే చంద్రాననా జానకీ. ౩

గీ. అని మగుడఁ జూచి యకట తాపాతిశయము
మదికిఁ జలనంబుఁ దెచ్చెఁ గా డితఁడు తరణి
చదలఁ బొదలుచు రోహిణీహృదయమునకు
గందమై యందమైనట్టి చందమామ ౪

వ అని రామచంద్రుండు చంద్రు నుద్దేశించి. ౫

మ. భువనాంతర్వ్విచరద్విరాజితకరస్ఫూర్తిం బ్రవర్తించు కై
రవమిత్రా రజనీకళత్ర యిదె మీ రాజాస్య రమ్మంచుఁ జూ
పవు నీవున్ మృగశాబకం బనుసరింపన్ బొల్చు నక్తంచర
ప్రవరేణ్యుండవ యయ్యె దేమనుచు దూరన్నేర్తు నిన్నియ్యెడన్. ౬

చ. అనుటయు లక్ష్మణుండు హృదయంబున నెంత గలంచెఁ జూచితే
జనపతియంతరంగ మభిషంగతరంగము కావునన్ బరా

కొనరుతునంచు చూడుము రఘూద్వహా చంచలచంచుకోటిఁ జ
ల్లని నెల మించు [మంచు]రవలుం జవిచూచు చకోరదారకుల్. ౭

వ. అనిన రఘువీరుండా చకోరంబు వీక్షించి. ౮

ఉ. అన్న చకోర మున్ను తుహినాంశుని రోసి సతీసఖుండవై
యన్నుకొనంగ నే వనరుహానన చెక్కులఁ బిక్కటిల్లు లే
వెన్నెల నాను దట్టి పృథివీసుత నెమ్మొగ మింత సూపి న
న్నెన్నిక కెక్కఁజేయఁగదవే చరితార్థులలోన మానుగన్. ౯

గీ. అనిన [న]య్యూర్మిళాధీశుఁ డగ్రభూమిఁ
గంటె రఘురామ యిది శరత్కాలవశతఁ
గృశత వహియించి హరిణాంకకిరణభాతి
నొక్క నది యొప్పె ననుడు రఘూద్వహుండు ౧౦

గీ. ఓ తరంగిణి ! విను మొకానొక కృశత్వ
మునఁ దరంగవిలోచనంబుల వసుంధ
రాత్మజయు నీవు నొక్క తీరయ్యు నీవు
చల్లనై మంటి యది వెచ్చ కెల్లయయ్యె. ౧౧

వ అనుటయు రామభద్రానుజుం డున్నిద్రనీల నలినీవన విలీనుండగు
నలినీవిభుం గంటె యనం బంటవలంతి యల్లుం డల్లనఁ గనుంగొని

శా. లీలాపాంగనితాంతకాంతిలహరీలీనంబులై తావియే
వాలాయంబు నిజస్థితిం దె[లుపు నవ్వా]మాంగి కర్ణస్థలీ
నీలాబ్జంబులఁ గామినీయుతుఁడవై నీ వాశ్రయింతా మదీ
యాలోలాక్షి మొగంబు చూపు మనుకంపాలంబరోలంబమా ౧౩

క నా విని మదిలో లక్ష్మణుఁ
డీవంక రఘూద్వహుండు వీక్షింపడపో
నా వీక్షించి కుమారక
యీ వట్రువపిట్ట దలఁప నెయ్యదియొక్కో. ౧౪

క. వెలిఁ గుంకుమరసరాగము
తలఁపునఁ గరుణయును బొదల తా నేటి దరిన్
బలవించు నాతిపైఁ జూ
పుల నిలిపెడు గాని చేరఁ బోవఁడు గంటే. ౧౫

వ. అని విచారించి యిది వల్లభావిరహావిదళితహృదయవరాకంబగు చక్ర
వాకం బగునని (దివసకర)కులీనుండీ కోకంబు శోకంబునఁ దన
బోఁటియ పొమ్మని క్రమ్మరం బాటించి తనకంటె నిదియ మేటియగు
నది యెల్లంజేని ౧౬

క నెలపొడపుల నిది విరహా
కులమతియగుఁ బ్రొద్దు వొడువఁ గులసతిఁ [1]గలయున్
నెలప్రొద్దుల పొడపులు తొ
య్యలిఁ బాసిన తనకు నెన్నియైనన్ జనియెన్. ౧౭

గీ. అనిన సౌమిత్రి రామ యా యంచఁ గంటె
ముకుళితాంభోజినీప్రాంతమున వసించి
యనుసరింపుచు నున్నది యనిన రామ
చంద్రుఁ డా జాలపాదకులేంద్రుఁ జూచి. ౧౮

చ. హిమకరపాదఘాతమున నెంతయు మూర్ఛవహించి చంచరీ
కమధురగీతి మూలుగుచుఁ గ్లాంతి[2]మెయిం దల వాంచియున్న యీ
కమలినిఁ గ్రమన్నై జకలికాపరి[కీలి]తకోరక స్తనిన్
దమకము మీరఁ గోరెడుఁగదా కలహంసము మాటిమాటికిన్. ౧౯

క. ఏవంవిధజంతులకును
భావం బనుసారిణీకృపామృదులము వో
నావంటివాని చిత్తమ
రావంటిదిగాని చెచ్చెరం దలపోయన్. ౨౦

1 గలయన్ 2. మయిం.

ఆ. వె. అనవుడా సుమిత్రతనయుండు తనలోన
జానకీమహేంద్రజాల మడరె
రామచంద్రు చిత్తరాజీవమున దీని
కేమి సేయువాఁడ నింక నకట. ౨౧

వ. అను సమయంబునం దెర మరుంగున. ౨౨

సీ. చెలికాఁడ యో రత్నశేఖర నినుఁ బెద్ద
కాలంబునకు నేఁడు గంటి మనిన
సౌమిత్రి వీ రెవ్వరో మాట లాడెద
రనుచుండ జవనికయందు మగుడ
సఖ చంపకాపీడ సత్య మీవనినట్ల
యెడపయ్యె వినుము నే నిన్నినాళ్ళు
[నిఖిలమా]యోపాయనిధి మయుం డాత్మ[జ]
యైన మందోదరి నరయు పొంపె

గీ. నాకె సోదరు చిత్రరూపాభిధాను
ననుప నాతనిచేత నే నైంద్రజాల
విద్య నేర్చుచు నుండితి విశదబుద్ధి
లంకలో నావు డీక్షించి లక్ష్మణుండు. ౨౩

క. వీ రెవ్వరొ విద్యాధరు
లారసి చూడంగ వీర లాడెడు మాటల్
సారసుధాసారములై
పారణ సేయించెఁ బాలుపడి కర్ణములన్ ౨౪

వ. అను సమయంబునఁ గ్రమ్మరం దెర మరుంగున. ౨౫

గీ. రత్నశేఖర నీ కళారచన చూపు
మనవు డో చంపకాపీడ యసురసురభు
జంగకిన్నరసారణచారణాదు
లందు నెవ్వని కథ నీకు నభినయింతు. ౨౬

క విను మది యేలా మన క
న్యని కథ లంకానుభూతనూతనచరితం
బును వినుపించెద నిది యా
టనవచ్చునె నిజముగాక యని భ్రమయంగన్. ౨౭

క. నా విని యా లక్ష్మణుఁ డో
భూవల్లభ కంటె సులభమున మనకు వినం
గావలయునది యెదిర్చిన
దీవేళ ననంగ రాముఁ డేదో యనుచున్. ౨౮

శా క్షోణీజాత భవత్పదాంబుజతులాకోటిద్వయీనిర్గళ
జ్ఝాణంఝణ్యవలన్మరాళయుతముల్ సౌమిత్రిపాదాంకన
శ్రేణీరమ్యము లిందుశీతములు విస్తీర్ణాచ్ఛగోదావరీ
వేణీసంభృతసైకతంబు లివిగో వీక్షింపు మింపారఁగన్. ౨౯

వ అనిన సౌమిత్రి యిట్లనియె ౩౦

క. ఎక్కడిది గోదావరి యిట
నెక్కడిది సైకతము లేడ పృథివీసుత మీ
రెక్కడ వసియించినవా
రెక్కడ పలికెదరు రామ యిది యేమనుడున్. ౩౧

క రాముఁడు మోసము వచ్చెం
గా మతివిభ్రమమువలనఁ గాని యదియున్
నా మానసాంబుజంబున
కామోదము సంఘటించె నది యెట్లనినన్ ౩౨

గీ. విపులగోదావరీతటీవిపిన[1]ములను
గొమ్మయునుఁ దమ్ముఁడునుఁ జేరి కొలువ సంత

1 విపుల.

సమున నిమిషార్ధసమములై జరుగునట్టి
దినము లిప్పుడు దలఁపయ్యె ననుచు మరియు. ౩౩

మ. చెవి లేఁజేరలఁ గ్రోలఁ గాంతునొకొ రాజీవాస్యవాచామృతం
బివతాళింపఁగఁజేయనీ మరి ప్రియం బేపార గోదావరీ
నవనీరేరుహబృందమందలహ(రీ)నాట్యంబు లీక్షించుపొం
తె వినోదింపుచునున్న రాచిలుకమాడ్కిం బల్మరుం బిల్వఁగన్. ౩౪

వ అను నవరసంబున యవనికాంతరంబున. ౩౫

క చామరము వీవఁ జొచ్చెన్
రామ సుధాధామ మృదుతరంగంబున నీ
కై మచ్చిక గోదావరి
తామర వెలి[గొ]డుగుఁ గేలఁ దాల్చుచుఁ గంటే. ౩౬

క. అని వినవచ్చిన రఘునం
దనుఁ డా[మోదా]త్ముఁ డగుచుఁ దప్ప*దివియపో
తన ప్రాణేశ్వరి వచనము
లనయము దెలియంగవచ్చు నది యెట్లనినన్ ౩౭

చ. పరిమితరమ్యమై మృదులభంగిఁ జెలంగెడు [వాగ్విలాస] మా
కరణియ కాదు తిన్నని యొకానొక కాకలి[1]యిందవేలమై
పరఁగెడు వల్లకీజనిత పంచమముం బ్రహసింపుచున్న ద
బ్బురమగు నిస్వనంబు శ్రుతిపూనెడు కోకిలకంఠధిక్కృతిన్. ౩౮

వ. వటఫలాధరి యెట నున్నదియో యని విలోకించి యివ్విధం బదృష్ట
చంద్రరేఖంబగు చంద్రాలోకనంబునుం బోలియున్న దనుసమయంబునఁ
గృతప్రవేశయగు మిథిలేశతనయం జూచి రామచంద్రుండు సంభ్ర
మంబున బ్రియసతి రారమ్మని చేరం బోవు [2][సన్న యెరింగి]లక్ష్మణుం
డన్న హస్తంబు వట్టి (చాఁగనీక) సంవేగంబు మాను మిది విద్యాధర

1 యుంద్దసిలమై 2. కంన్నెరింగి

పరికల్పితేంద్రజాల కళాకలనంబన నినకులాభరణంబగు నమ్మగల
రేఁడు హర్షించి వేరొండు సన్నివేశవిశేషంబుఁ గనుగొని. ౩౯

మ ఒక కెంగేల నశోకశాఖయును [1]వేరొ[ం]టం దినాబ్జారికాం
తికపోలంబును బూని యున్నయది యెంతే సాంద్రతం జెందె బా
ష్పకణవ్యాపృతిఁ గప్పు రెప్పలు శిరోజశ్రేణి కాంచీకలా
పకులత్యక్తకటీతటిం బడిన దేర్పా ఁదేది చీకాకుగణ్. ౪౦

వ అని క్రమ్మరం జూచి. ౪౧

సీ పలనైన కూర్మి నెచ్చెలిఁ బోలె మృదుబాహు
శాఖచేఁ గంకేళిశాఖ వూని
నిదురవోయెడునేమొ నేత్రంబు లామీల
దిందీవరశ్రీల కిరవులయ్యె
నవమాలికాసమానములైన యవయవం
బులు(ను శైథిల్యం)బు కలిమిఁ గాంచె
ననుచు వెండియుఁ జూచి కనఁబోలు నొక స్వప్న
మతిమనోరంజకం బైనదాని

గీ. తళుకు నెత్తావి మోవి లేఁ బలుకువలనఁ
గదలుచున్నది నునుఁగెంపుఁజిదుర లొల్కు
ని(రుప)మానందబాష్పశీకరము లరమి
తొరఁగుచున్నవి ముత్యాలకరణిఁ దోప. ౪౨

క అనుసమయంబున సీతా
కనకలతాగాత్రి మేలుకని లోచనజీ
వనజములు దెరచి యకటా
(త)న జీవిత మిప్పు డెవ్విధం బయ్యె నిసీ. ౪౩

గీ. శ్యామలాంభోజవర్ణుఁడౌ రామచంద్రుఁ
డేడ గోదావరీనది యేడ లంక

1 వేరొటం.

యేడ యాతండ జీవమై యెసకమెసఁగు
సీత యేడని యవశతఁ జెందుటయును. ౪౪

శా. రామక్ష్మాపతి యో వసుంధర! వధూరత్నంబు నీ జానకిన్
బ్రేమన్ గర్భమునందుఁ గైకొనిగదా పెంపొందితీ రత్నగ
ర్భాముఖ్యాఖ్యఁ దదంబుజాతముఖి నీపైఁ దూలఁగా [1]ప్రీల నీ
సామర్థ్యం బుచితంబవో తలఁప నీ సర్వంసహాఖ్యాతికిన్. ౪౫

గీ. అనుచు నిప్పుడు జానకి యడలుఁ దీర్ప
ధరణిఁ బ్రార్థింతునని చూచి తగదు వేఁడఁ
గూతు నైననుఁ దేర్ప దీ కుటిలహృదయ
కరినలకు బిడ్డయందైన కరుణ గలదె. ౪౬

వ. కావున నీ యశోకంబు వేఁడెదనని ౪౭

మ. చెలికాఁడా విను తామ్రపల్లవవిపంచీనాద నీ పైదలిం
దెలియం జేయుము లేమ పల్లవకరోద్గీర్ణంబు తుంతుర్వముల్
పలుదోయంబుల చల్లిచల్లి విగళద్బాష్పంబులన్ నీదు పా
దలుగుల్ వారఁగఁ జేసి మున్ను నిను నీ యజ్ఞాశి రక్షింపదే. ౪౮

గీ. అని విషాదంబుమై రాముఁ డకట యీ య
శోక మిప్పుడు నన్ను నిరాకరించె
వినియువిన కెందు మేలెరుంగునె పలాశి
యనుచుఁ గ్రమ్మర నమ్మహీతనయఁ జూచి. ౪౯

సీ. అనిశప్రియంవదయైన మత్ప్రేయసి
యొద్ద నేమొకొ బోటి యొత్తు గల్గ
దనుచోటఁ ద్రిజట చయ్యనఁ బ్రవేశ మొనర్చి
చెలి జానకీ యూరడిలు మనంగ

1. దిలవి.

తెలిసి యో త్రిజట యేతెంచితే నావు దా
త్రిజట యో జానకీదేవి నీవు
ముఖరేఖ చూచి యేమో మేలు గాంచితి
వని తలంచెద నన జనకజాత

గీ కలదు కలలోన నిపు దేను (గ)ంటి రామ
చంద్రు గోదావరీధృతచంచలోర్మి
చమరవాలాంబురుహసితచ్ఛత్రలలితు
ననిన నీ కల మేలు మేలందె దమ్మ. ౫౦

గీ. సీత రామైకచిత్తనై చెలఁగు నాకు
స్వప్నమున నెట్లు గలుగు విశ్వాస మనిన
త్రిజట కాదమ్మ చింత (నేతెంచు) స్వప్న
మమరునే యిట్లు చుంబితార్థముల కలిమి. ౫౧

క. అన విని సీత యచుంబిత
మును జగతిం గలదు రామముఖచంద్రవిలో
కనరహితయయ్యుఁ బ్రతికెఁ
జనక[జ] యటుగాన నేడ స్వప్నములు సఖీ. ౫౨

క. మననేటికి నను వదలెఁ
జననాయకుఁ డనిన నతఁడు శాంతం పాపం
బనుచుఁ జనకాత్మజ నా
మనమున నుండియునుఁ దత్కృత్రిమం బెరుఁగవాకో. ౫౩

గీ. అనఁగ జనకాత్మజాత నే నక్కటకట
హరజటాజూటవాటేందునందు కందు
కలుఁగఁ జూచెద నతఁ డిందు మెలఁగు నాదు
మాటఁ దెలియఁడు గాఁబోలు నేఁటితుదకు. ౫౪

వ. అనవుండు. ౫౫

మత్తకోకిల.
అప్పురాతనపూరుషాంకుర మంగనా తగుమాట నీ
విప్పు డాడి తనంగ నా మి[థి]లేంద్రనందన యక్కటా
చెప్పద(య్యె) మదీయమార్గము [1]శి[ం]జితోక్తుల నందెయుఁ
గప్పెనో విధి వీఁక మూకవికార మారయ దానికిఁ. ౫౬

సీ. అనువేళ నేపథ్యమున నోయి లంకాధి
వాసులార హృతాహితాసులార
జతనమై యుండుఁడీ చనుదెంచెఁ బురి సొచ్చి
వీఁడె శాఖామృగవీరుఁ డొకఁడు
దృఢశక్తి నా ధరిత్రీపుత్రికాత్రిజ
టలు పరిత్రాసనాట్యమున నలయ
మగుడ నత్తెరలోన మానుఁడీ భయము ర
క్కసులార యవ్వనౌకసుల రేని
గీ. మారుకొన నేగినాఁడు దోర్మండలాగ్ర
చండరుచికాండహిండితాఖండదిగధి
పాలఖేలత్ప్రతాపవాతూలసఖుఁడు
రణకళాదక్షుఁ డయ్యక్షరాక్షసుండు ౫౭

వ. అనునెడ త్రిజట యట కనుంగొని. ౫౮

గీ. తాఁకు రేయెండఁ గందర్పదర్ప మడర
నినకులవధూటి రామైకహృదయ నిన్ను
ననునయింపఁగ సిగ్గుమాలిన నిశాచ
రాధిపుఁడు వచ్చె నిదె వనవీధి నబల. ౫౯

క. నా విని సంత్రాసంబున
నా వనజాతాయతాక్షి యడలఁగ నాలో
రావణుఁడు వచ్చి నతముఖి
యై వడఁకెడు సీతఁ జూచి యనియె నయముగాన్. ౬౦

1. సిజ్జి.

మ. స్మరఘోరజ్వరవేదనాపరిపతత్సాంద్రాశ్రువార్ద్రీతని
ర్జరనారీకుచకుంభకుంకుమరజస్త్వక్తావరోధంబు ని
ష్ఠురదీవ్యద్ద్విపదం(త)కుంతహతివిస్ఫూర్జచ్చతుర్దిగ్జయ
స్ఫురణం బీ తన పేరురంబు విను మంభోజాక్షి ని న్వేఁడెదన్ ౬౧

ఆ. వె అనిన జనకజాత వినక నే నీఁక రామ
చంద్రవదనచంద్రుఁ జక్షు లలరఁ
జూతునొక్కొ యనఁగ దైతేయభామిని
పంటవలఁతిపట్టిఁ బలికె నపుడు. ౬౨

వ సఖీమణీ నక్తంచరపతి ప్రలపించెడుం గడుంగడుఁ [1]బనివడి చెవి యొసంగఁ దగదే యనునెడ (రామ)భద్రుండు త్రిజటా భళిభళి ప్రల పించెడు నని యుచితంబ పలికి తనుసమయంబున న(సు)రపతి క్రమ్మర నమ్మహీసుత కిట్లనియె. ౬౩

ఉ. ఆదిఁ బ్రసన్నుఁడైన నిటలాంబకుఁ గన్గొని ఛేదనోత్సవ
చ్ఛేదియటంచు నెద్ది నతిసేయదు రోష మెసంగ నారి ! న
వ్యోదితమస్తపంక్తి నతి కొగ్గిన నా దశమోత్తమాంగ మో
పైదలి ! నీ పదాబ్జములపైఁ బడి వేఁడెడుఁ జిత్తగించుమా ౬౪

వ. అనిన నమ్మహీజాత యాగ్రహోపేతయై కటకటంబడి యిట్లనియె. ౬౫

చ. నవవకుళావతంసము రణద్భ్రమరాంచితమున్ ఘటించి రా
ఘవుఁ దలరంగఁ జేయ మనఁ గాంచిన యీ తన వీను లేల ప్రీ
లవు వినరాని యీ దురపలాపకలాపము సోఁకి యిట్టి పే
లవత దగున్ దలంప కుటిలత్వము లోపలఁ గల్గు వీనికిన్. ౬౬

చ. అన విని రావణుండు కమలానన చూపులనైనఁ బ్రోవు న
న్నన మహిజాత యోరి దనుజాధమ వేఁడఁగఁ గాని లాఘవం
బునకుఁ దలంక వైన నది వోవఁగనిమ్ము (తలంక) వేల త
త్కనకగిరీంద్రధన్వధరకార్ముకహర్తకు రామభర్తకున్. ౬౭

1. బవనివడ

క. అనుటయు రావణుఁ డో మో
హనదేహా! రామరామయని పల్కెడు నీ
జన మతఁ డెవ్వఁడొకో
[1]యని నగి మగుడంగఁ బల్కె నల కలకంఠిన్. ౧౮

ఉ ఇందునిభాస్య కాముఁడన నెంత కృపాణయుతైకపాణినై
[2]నందిని నెక్కు వేల్పు చరణంబులు లీల భజించు నాకుఁ జం
పుం దను రాముఁడే తొడరి ఘోరన నక్కట నీనిమిత్తమై
సందులు దూరినం జనక శాతమహోజ్వలసాయకంబులన్ ౧౯

క. అన జానకి యిది సత్యమ
యనవుడు తనలోన దానవాధిపుఁ డ[ను] నే
మనఁబోయి యేమి పలికితి
నని విపరీతమ్ముగాఁగ నదియె పఠించెన్ ౨౦

ఉ. ఇందునిభాస్య రాముఁడన నెంత కృపాణయుతైకపాణినై
[3]నందిని నెక్కు వేల్పు చరణంబులు లీల భజించు నాకుఁ జం
పుం దను కాముఁడే తొడరి ఘోరన నక్కట నీ నిమిత్తమై
యెందెట బోయినం జనఁగనీక నిశాతశిలీముఖంబులన్. ౨౧

వ కావున నీ కటాక్షామృతంబున రక్షింపు మనిన సీత యిట్లనియె. ౨౨

క. ఆ వేళనె చూచుఁ జుమీ
రావణ నిను నీ వసుంధరానందన దా
నావుడు దురాశ రావణుఁ
డే వేళ యెరుంగఁ జెప్పవే యటులైనన్. ౨౩

గీ. విడుచు మందోదరీదేవి విశ్వరాజ్య
మొప్పగించు భవత్పా[ద]యుగ్మమునకు

1. యన 2 నందెన 3 నందెన

మాట లిన్నియు నేటికి మాటు నరకుఁ
దలలు నీ కొరకె కెకదారి దైవతారి ౭౪

వ. అనవుడు నమ్మేదినీనందన యిట్లనియె ౭౫

క ఏవేళ విరియు ఖద్యో
తావిర్భూతప్రదీప్తి నబ్జిని సొబగై
యావేళనె చూచుఁ జుమీ
రావణ నిను నీ వసుంధరానందన తాఁ ౭౬

గీ అనినఁ గోపించి యో దురితాత్మురాల
గణ[న]సేయంగ రామరావణుల [సం]ధి
దివసమణి కీటమణుల రీతియె తలంప
నంతరంబని దీని వధింతు ననుచు. ౭౭

క కరవాలం బొర వాపినఁ
గరుణయు సంశయముఁ గినుపుఁ గడిమియు మదిలోఁ
బెరయఁగ నప్పుడు రఘుకుల
శరనిధిచంద్రుండు రామచంద్రుం డనియెఁ. ౭౮

ఉ. హా వసుధాతనూజ యెటు లయ్యెదొకా రిపుచేత నీకు నీ
దైవికమైన పాక మతిదారుణమైనదిగా దలంప నో
రీ విబుధారి పాతకవరిష్ఠ వధించెద నెందు వోయె దో
హో విను విల్లువి [1]ల్లిదియపో సమయంబు కుమార లక్ష్మణా ౭౯

క అన విని లక్ష్మణుఁ డను నో
జననాయక యీ మహేంద్రజాలకళాద
ర్శనమున నూరక భ్రమయఁగఁ
జనునే యిపు డీవు చాలుఁజాలు ననంగఁ. ౮౦

గీ. పలుకు నిర్వదికంటె యో పంటవలఁతి
పట్టి యొరవుట్ల వెడలు నా పట్టియంపుఁ

1. ల్లిదయపో.

బాము నీమీఁద నిదె యోర[1]వడగ వెట్టి
పట్టు నా చెల్మి యనెడు వాకట్టు మందు. ౮౧

వ అనిన సీత యిట్లనియె. ౮౨

శా చాలుంజాలు నిశాచరాధమ ముధాజల్పంబు లీ కంధరా
నాళం బంటఁగ రామదోర్యుగళికన్నం గల్గ దన్యంబు వే
యేలా చెప్పఁగఁ గానినాఁడు కరుణాహీనంబు నీ కేలి పె
న్వాలే యంటిన నంటుఁగాని యన దేవద్వేషి రోషంబునన్. ౮౩

క ఈలీలఁ బలుకనేలా
కాలక్షేపంబు దీని గళనాళగళ
త్కీలాలము నర్పించెద
హాళిం గాళికి నటంచు యసి యంచుఁ గనఁ ౮౪

వ అప్పుడు రాఘవుండు ౮౫

గీ అహహ దయ మాలె [విధి] తమం బగ్గలించె
జగము మున్నీటఁ బడి క్రుంగె యుగము గ్రుంగెఁ
కలువ సరులకుఁ దరమైన చెలువ యరుతఁ
దులువ పెనువాలు దా వాలఁ దొడరు కతన. ౮౬

వ. అని క్రమ్మరఁ జూచి కటకటంబడి. ౮౭

గీ. అలమెడుఁ బటీరవల్లి దావానలంబు
తొడికెడు సుధాంశులేఖ విధుంతుదుండు
చిక్కు వరపెడు తొగదండ మొక్క(లీఁడు)
[2]పెల్లగించెడు బిసిని నాఖీలగజము ౮౮

గీ. అనఁగ నవ్వేళ సీత (ధా)రాపహసిత
శీతలామృతనిజకాంతిజితవినూత్న

---

1. వడిగె. 2. పెల్లగింపెడు

మౌక్తికక్షోద! [1]మన్నన మగని నెడయ
సంభవించిన చిచ్చార్పు చంద్రహాస! ౮౯

సీ అనుడు దానవకులాధ్యక్షుఁ డోరి యిదెవ్వ
రిచ్చోటనున్నవా రిందు దీని
నల్ల వచ్చెద వేగ నా చేతి కొక పున్క
యనుచు హస్తం బశోకాంతరాళ
మునకుఁ జాఁచి యొసంగెఁ బునుక యెవ్వఁడో కాని
యని వేడ్కఁ జూచిది పునుక గాదు
నులిచివైచినయట్టి తలకాయ యెవ్వాని
యదియొకో కని దృష్టి నాదరించి
గీ హా కుమారక యక్షదైత్యాయటంచుఁ
దెరలి ధరఁ గూలి త్రిజట బోధింపఁ దేరి
యీ తెరం గల కపి నేతయే తలంప
వానిఁ గెడపెద నని క్రోధవశతఁ జనియె. ౯౦

వ. ఆ సమయంబున రామరామానుజన్ములు హరుషంబున నహో సంవిధాన వైదగ్ధ్యం బనునెడ త్రిజట [2]యేకజటాలకభరయగు మన్నుటన్నుపట్టిం గనుంగొని యాలింగనం బొనర్చి సఖీ పుణ్యంబున బ్రతికితి వనిన నా వనజవదన బ్రతుకుట పాపంబుగా కేపుణ్యంబనిన త్రిజట యది యెవ్విధం బనిన సీత యిట్లనియె. ౯౧

క ఈ పగిది రాముఁ బా(సి)న
తాప మడఁచు చంద్రహాసధారాసరణిఁ
బ్రాపించనైతి త్రిజటా
పాపము నా కిదియు నొక్క బ్రతుకనఁ దగునే. ౯౨

క. ఇట దారుసంచయంబున
ఘటియించుము వహ్ని తనదు గాత్రము శైత్య

---

1 తనమన్న 2 యేకయేకాజటాలక.

స్ఫుటముగఁ జేయుదు ననినఁ ద్రి
జట శాంతం పాపమనుచు జానకిఁ బలికెన్. ౯౩

చ. సలలితశీతభానుకరజాలకరంబితభూరిగారుడో
పలఫలకానుకారియను బాలపటీరతుషారనీరపం
కిలమును నైన రామనృపకే(సరి) పే(రెదఁ) జల్లఁ జేసె దో
యలికులవేణి నీ సుమసమాంగకముల్ విసువేల చేరుపన్. ౯౪

క. [1]అన సీతాకాంత సఖీ
[2][జనమణి]విను మీ యశీకజల్పంబులు న
మ్మ నిజంబు నగ్నిఁ జొరఁదగుఁ
గొనితె మ్మొక నిప్పుతునుక గొబ్బున ననగన్ ౯౫

క. రామనృపాలకుఁ డకటా
కామిని పులివాత వెడలి క్రమ్మర శబరుం
డోమిన యురిఁ బడి నకనక
నౌ మెకమనఁ జకితభావ యైనది కంటే. ౯౬

వ. అనుచోటం ద్రిజట యట చయ్యనఁ జని యేతెంచి దొరక దనలం
బిచ్చోట ననుటయు రాముండు హర్షంబునం ద్రిజటం బొగడుచుండ
భూనందనయును నశోకంబున కభిముఖియై యిట్లనియె ౯౭

గీ. ఓ యశోకద్రుమేశ నా కొండు మండు
నగ్గి మిడుఁగురు దయసేయుమయ్య కిసల
కైతవంబునఁ బాంథలోకమున (కా)య
తానలార్చులఁ బ్రకటించునట్టి నీవు. ౯౮

మ. అని కంటే తరుశాఖనుండి రుచిమై నంగారఖండంబు రా
లె నటంచుం జని పట్టఁబోవుతరి నా లీలావతిం జూచి భూ

---

1 అని. 2 చనటిం

పనిశానాయకుఁ డీ యశోకమును నాపాలింటి కాద్యక్షరం
బునకుం బాసె నయో యనంగ రఘురాముం బల్కెఁ సౌమిత్రియుఁ౯.౯౯

గీ కూడ దీమాట నిప్పులు గురియనోటు
తరువు లెండైన ననవు డాతఁడు కుమార
త(న)కుఁ దప్పునె విధిఘాతుకుని కృతంబు
లనగ నయ్యగ్ని సీత పూనిన విభుండు ౧౦౦

క అనలా యతిమృదులము లీ
జనలాలితశీల కేలు చల్లని మణివై
మనఁ జేయు మేలు నేయుదు
వనయంబును గృష్ణవర్త్మవగు నీ వరయన్ ౧౦౧

వ. అనునెడ సీత యిట్లనియె ౧౦౨

గీ ఎట్టి పుణ్యవిహీనమో యెద వహించు
ననల మతిశీతలంబైన దనుచుఁ జక్కఁ
గాంచి యంగారఖండంబు గాదు పద్మ
రాగఖండక మిది చెప్పరా దనంగ ౧౦౩

వ త్రిజట యిట్లనియె. ౧౦౪

క, మతిఁ దలఁపఁగ నతిభాగ్యో
న్నతులగు వా రెద్దివట్టినఁ కనకంబౌఁ
గతిలేల యిప్పు డనలం
బతివా వీ వంట రత్న మయ్యెనొకాదో. ౧౦౫

క అనుటయు జానకి గ్రమ్మరఁ
గనుగొని యీ రత్నముద్రికారాజం బే
జననాధునియదియో యని
మనమున నూహించి తెలిసి మంజులఫణితిఁ. ౧౦౬

ఉ. అన్నువయైన నెన్నడుము నంజనరేఖలుఁ జారువృత్తతా
భ్యున్నతియుఁ మెయిఁ బసని పూతయునుఁ దగ శోభనస్థితిఁ
జిన్నటనాటనుండియును జేరిక రాముని చెట్ట వట్టి నీ
వు న్ననుఁబోలె నేగతిఁ దవుల్పడి వచ్చితి వింద ముద్రికా. ౧౦౭

గీ. అనుచుఁ దన ముద్దువ్రేళ్ళ నయ్యంగుళీయ
కంబు నివురుచు నో ముద్రికా కుశలమె
సానుజుండైన రాముపాదాంబుజముల
కనఁగఁ దెరఁ దట్టి హనుమంతుఁ డరుగుదెంచి. ౧౦౮

క దేవీ కుశలము కుశలం
బావీరాగ్రమణులకు[ను] నన విని సీతా
దేవియు నీ వెవ్వరు నా
పై వంచెద [వ]మృత మనుడు పావని యనియెన్ ౧౦౯

క. తారాపతిభృత్యుఁడ రఘు
వీరాగ్రణిమాతఁ బేరు విను హనుమంతుం
డీరీతి నఖి తల నినుఁ
గారించు దశాస్యు కేలఁ గలిపినవాఁడఁ ౧౧౦

వ. అనునెడ పుడమియల్లుం డుల్లంబు పల్లవింపుచుం బొదల నిది హనూ
మన్మా[మ]ధేయంబగు మద్భాగధేయంబు విలసితంబుగదా యనునెడ
సుమిత్రాపుత్రుం దేతత్సంవిధానం బతిమనోహరంబుగదా యనునెడ
సీత యో మాతరిశ్వజాత తారానేతయన నెవ్వాఁ డవ్వానిం దెలియం
జెప్పు మనిన నప్పావని యిట్లనియె. ౧౧౧

గీ. కినుక బలశాలి వాలిఁ గైకొననివాఁడు
చెన్ను మీరఁగ జగముక న్గన్నవాఁడు
చాలి రాముని పదసేవఁ గ్రాలువాఁడు
మేటి సుగ్రీవుఁడను గహనాటరాజు. ౧౧౨

క నావుడు జానకి యెవ్వరొ
కో వనచరులకును నరులకుం బొంతనముల్
గావించువార లన విని
పావని యా రామచంద్రు బాణమె యనుచున్ ౧౧౩

క. చాపము వెలువడి వాలికిఁ
దూ పౌసఁగెన్ దేవతావధూనఖధారన్
దీపితకపిరాట్పదవీ
శ్రీపూర్వముగాఁగ వినజుఁ జేర్చెన్ దారన్. ౧౧౪

వ. అనిన సకలజనాలోకనశీతయగు సీత యిట్లనియె. ౧౧౫

క కాండ మొక్కట నల కీశమండలేశు
లిద్ద రీచందమున నిగ్రహింపఁ బెంపఁ
బడిరి నా భాగ్యమెట్టిదో బలవిహీనుఁ
డయ్యె నిపుడింత రాఘవుండనిన నతఁడు ౧౧౬

శా. తల్లీ యింతనుమాత్రమే బహుళచంద్రప్రక్రియం జాల మే
నెల్లం జిక్కఁగ నున్నవాఁ డనిన నయ్యేణాంకబింబాస్య యో
[1]చెల్లంబో యన వాయుజన్ముఁ డయినన్ జెల్వారెడున్ మేచకో
త్ఫుల్లాబ్జద్యుతియున్ బ్రభావము నతిస్ఫూర్తిన్ దదీయాకృతిన్. ౧౧౭

గీ. నావు డొకకొంత బ్రతికితి నీవు పిదప
నాడు మాటకు నను సీతతోడ వాయు
జన్ముఁ డోయమ్మ యంతక చక్క వినుము
నీ మనోనాథుఁ డనుచు సందేశ్యమ్మెపుడు. ౧౧౮

సీ. తిలకించు మంచుమించులవేల్పు మొగి మింటఁ
జను (?) రోపు జగవెలుంగు
మీటి నల్లగు పాటపాట చిన్కుల క్రొత్త
మొగులు కారడవిలోఁ దగులు చిచ్చు

1. చెల్లంగా.

పరతెంచు మడుఁగు లేఁదెర తెమ్మెరలు పాఁప
బుసకొట్టు బెట్టున నెసఁగు గాడ్పు
జివ్వాడ ముయ్యాడుబువ్వు మోచిన నేవ
తీవ నచ్చున గచ్చు దేరు చూరి
గీ. యెప్పు డటు విప్పువచరించుఁ గప్పుఁ గలువ
తుప్పు డించిన రెప్పల కుప్పికోల
వాలుఁగన్నుల మగమీల మేలుఁ గొన్న
యన్నుదలమిన్న నినుఁ బాసియున్న తనకు ౧౧౯

వ. అని మరియును. ౧౨౦

శా. ఏ నెవ్వారికిఁ జెప్పనేర్తు వినువా రెవ్వారు నా చిక్కు నా
గ్లానిం దేరుచువార లెవ్వ రెరుఁగంగా నేర్తురెవ్వార లీ
నీనా పాయఁగరాని లోతగులమిఁ నీ వుండ నే వేఁడఁగా
కే నింకే మనువాఁడ దీనికి నయో హేమాంబుజాతాననా ౧౨౧

గీ. అనిన లజ్జాభరాకుంచితాస్యయైన
భూసతీసుతఁ జూచి రాకాసిజోటి
బోటి నీవును నీవల్లభునకు నంపు
మమ్మ సందేశమునఁగూడ నానవాలు ౧౨౨

వ. అనుటయు. ౧౨౩

గీ. నయనజలవార్ధి నీఁదుచుండియు మదీయ
దృష్టి నీ వక్త్రహిమకరామృతమ కోరుఁ
బూని యనుమని యొందల మానికంబు
తిగిచి యవ్వాతసూతి చేతికి నొసఁగె. ౧౨౪

శా. తానం బాడుము రామపాదనఖచంద్రజ్యోత్స్నయన్ దివ్యగం
గానీరంబునఁ బంక్తికంధరనిరీక్షాజాతపాపంబునన్
మై నిండారెడు మైల వాయఁగ శిరోమాణిక్యమా యంచు శం
పానీకాశకటాక్ష వల్కిన హనూమంతుండు సంతుష్టుఁడై ౧౨౫

గీ. విమలకమలారిముఖి దైవికమునఁ జేసి
యిపుడు దలఁపయ్యె రఘుకులాధీశుపాద
పంకజాతంబు లట వోవఁ బదరుచున్న
యది మనోరథ మమ్మ న న్న[ను]వు మనుచు. ౧౨౬

క కన్నీరు పూస లనఁగాఁ
గన్నీరు లవంబులగుచుఁ గళమున జారన్
మున్నీరు గన్న సంపతి
[1]యన్నీరిక గాలిమాలి కపు డిట్లనియెన్. ౧౨౭

క. అన్నా నీ వేగినతుద
మన్నాథునివార్త చెప్ప మరియిఁక నెవ్వా
రున్నా రనవుడు భాగ్యము
న న్నాకిపు దొకటి గొబ్బునం దలఁ పయ్యెన్ ౧౨౮

వ. వినుమని ౧౨౯

మ. నను నీతో ననుమన్నవాఁడు జగతీనాథాగ్రగణ్యుండు నే
డనివార్యస్థితిఁ బర్వు లక్ష్మణధనుర్జ్యారావముల్ దైత్యరా
ట్తనునానావిధరోదనధ్వనులచేత న్నీకు(ఁ జెప్పించుఁ) గ్ర
న్నన మద్వార్తల నూరడిల్లు మనుమానం బేది యంచుం దగన్. ౧౩౦

వ. అనునెడఁ దెర మరుంగున. ౧౩౧

ఉ. ఘోరతరాజిరంగమునఁ [2]గుత్తుకపట్లకు వచ్చి సొచ్చి సం
దారసి రాజపుత్రుఁడగు నఘని గూలిచి యెందు వోయె దో
రోరి వనేచరాపశద యుట్టిట లూఁగెదు మేఘనాదుఁ డా
హారితశత్రుమేదుఁడు దశాస్యుని పంపున నిన్నుఁ జెప్పగన్. ౧౩౨

---

1. యన్నీరికె. 2 గుత్తుకు

క. నా విని వాయుతనూభవుఁ
డే వచ్చినకార్య మయ్యె నిఁక మై దాఁపం
గా వలదు పోయివచ్చెద
దేవీ యని మ్రొక్కి వసుమతీనందనయుఁన్. ౧౩౩

గీ ఓ సమీరణసుత నిరాయాసమునఁ ద
రింపు మీ దుష్టదైత్యవారిధుల ననిన
కీశకేసరి నా మౌళిఁ గీలుకొనియె
నమ్మ నీ సుప్రసన్నత యనుచుఁ జనిన. ౧౩౪

క. సీత దితిజాతసతిఁ గని
యీతని తెరఁ గెరుఁగఁ జెప్పవే ఖేచరివై
నాతో ననఁ గానిమ్మని
యా తొయ్యలి చనియె నంత యవనికలోనన్ ౧౩౫

సీ. అదె మేఘనాదబాణాహారియైనవాఁ
డీ వీరుఁడన నటియింపఁ జేసి
రానంద మందరు నదె దైత్యుఁ డతని వా
లమునఁ గీలించె నింగల మనంగ
వగఁజెంది రందరు వానరుండు దహించె
నదె లంక ననఁగ మోదాతిఖేద
ములఁ జెంది రందరు మున్నీట నదె ముంచి
యార్చె పుచ్ఛానలం బాతఁ డనినఁ
గీ. జాల నవ్వేళ నందరు సంతసమునఁ
బరఁగి రాత్మల మగుడ నేపథ్యసీమఁ
దరచుగా నద్భుతం బద్భుతం బటంచుఁ
దనరు నొండొక వాక్యంబు వినఁగఁబడియె. ౧౩౬

శా. పోలన్ బూర్వగిరిన్ హరింబలె మరుత్పుత్రుండు లీలాగతిన్
వేలాపర్వత మెక్కి దాఁటెడు నభోవీధిన్ బయోధిన్ రయో
(న్మీల)ద్వాతహరిప్రభిన్నబలగంభీరోదరావిర్భవ
ద్వ్యక్తేంద్రస్తుతిసాంద్రకీర్తినవముక్తాకీర్ణదిగ్భాగుఁడై ౧౩౭

వ. అనునెడం బరమపావనియగు నవనితనయ యవనికాభిముఖియై కనుం
గొని ౧౩౮

గీ. త్రిజట వచ్చితివే ధరిత్రీతలంబు
నకు బ్రియంవదవైన నిన్ గౌఁగిలింప
ముచ్చటయ్యెడు నంచు నమ్మచ్చెకంటి
యెదురుగా నేగె నట రాముఁ డిట్టులనియె. ౧౩౯

శా. జీవంజీవసమాక్షి నన్నును సమాశ్లేషంబునం దేల్పవే
రావే యంచు వచింప లక్ష్మణుఁ[డు] ధీరగ్రామణీ నాటకుల్
గావింపందగు నింద్రజాల మిది లంకం బుట్టు వృత్తాంత మే
లా విభ్రాంతి వహించె దీవనుచుఁ బల్కెన్ రాముఁ డెల్లేనియున్.

క. మన కిప్పు[డు] దైవికమునఁ
గనవచ్చె నిజప్రతాపకథనవిముఖపా
వనిచారిత్రరహస్య
మ్మనఘా యింతయును గరతలామలకంబై. ౧౪౧

వ. అనునెడం దెరమరుంగున. ౧౪౨

ఉ. కుట్టులు వెళ్ళఁగా దధిముఖున్ సుముఖున్ బిడికిళ్ళఁ బెట్టి త
న్నుట్టఁగ నిచ్చమై మధువనంబునఁ దేనియ లాని గ్లాని వోఁ
బెట్టి భవత్పదాబ్జములు ప్రేమఁ గనుంగొన వచ్చుచున్నవాఁ
డట్టి సమీరణప్రభవుఁ డంగదముఖ్యులతోడ రాఘవా. ౧౪౩

క నావుడు రాముఁడు లక్ష్మణ
యీవాక్యము వింటె మన(కు) నెదురేగఁ దగుఁ
పావనికిఁ గృతకార్యున
కీవేళ నటంచు నేగి [1]రెల్లరు ప్రీతిన్. ౧౪౪

* * *

క. నందేల తిమ్మరాజపు
రందరచిహ్నప్రసన్నరాఘవనాట్యా
మందప్రబంధరాజము
నం దారవ యంక మయ్యె నార్యస్తుతమై. ౧౪౫

★

1. రంవరు.

# ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము

## సప్తమాంకము



క శ్రీమద్విజ్ఞానక(ళా)
ధాముఁడు పాపాటవీవితానసముద్య
ద్ధామాంకుఁ డేగుదెంచె మ
హామహుఁడు పులస్త్యశిష్యుఁ డాతరువాతన్. ౧

వ చనుదెంచి. ౨

క. నలుదిక్కులు కనుఁగొని
తెలి(యని యెడ) కెగుదెంచితిన్ జెప్పెడువా
రలు వేరెవ్వరి నడుగుదు
నల యాతని సద్మమనుచు నట కనుఁగొనుచున్. ౩

క. ఏతెంచి వీఁడె రావణు
మాతామహుఁ [డగు]చు మంత్రిమణియనఁ ద్రిజగత్
ఖ్యాతిఁ గను మాల్యవంతుని
దూత కరాళకుఁడటంచు దొడ్డ యెలుఁగునన్. ౪

వ ఓయి కరాళక యిటుయిటు చనుదెమ్మనిన నతండు ప్రవేశించి ౫

గీ. [1]ఏటికోలయ్య యో సంయమీంద్ర ! యనిన
మేలు గానిమ్ము నీకుఁ గరాళకాఖ్య
యల విభీషణు గృహ మెద్ది (తెలి)యఁ జెప్పు
మనిన బనియేమి యనవు డిట్లనియె నతఁడు. ౬

గీ వను బులస్త్యుండు తన పిన్నమనుమఁడైన
యతని కొంక బుద్ధి బోధింపఁ బనిచె నావు

1. ఏరికోలయ్య

డాతఁ డిట లేడు పోయెఁ గదయ్య యనిన
ఏలకో పోవు టనినఁ గరాళకుండు. ౭

గీ. ఆవిభీషణుఁ డొక(నా)ఁడు భావ మలర
నోలగంబున్న తమ యన్న మ్రోలఁ గొల్వ
నతని చెవిచెంత ముకుటంబునందుఁ దోచు
పత్ర మమరారి గైకొని పారఁ జూచి. ౮

వ. ఇట్లని పఠించె. ౯

క. ధరమీఁదట మనఁగోరెదు
సరసులు కలనైనఁ జూడఁ జనరు చతుర్థీ
హరిణాంకరేఖనుంబలె
పరకాంతాభాలరేఖఁ బరికింపంగన్. ౧౦

గీ. నావు దమ్మునిముఖ్యుఁ డౌరా విభీష
ణుని వ(లం)తితనం బిట్లు వినఁగఁ జేయ
వలదె రాజుల కని తరువాతిమాట
చెప్పుమనినఁ గరాళకుం డప్పు డనియె. ౧౧

క. రావణుఁ డొక్కించుక నగి
కావరమున ననియెఁ దా నొ[1]కానొకఁడెవ్వాఁ
డో వెరచువాఁడు వల్కిన
దీవాక్యము నిక్కువమగు నెట్లోయనినన్. ౧౨

గీ. పరవధూస్తనహేమకుంభములయందుఁ
(బ)రమదాభీలకుంభికుంభములయందు
(దూ)రసాహసులైనట్టి భీరుజనుల
వాఁడి చూపులం దూపులు గాఁడగలవె. ౧౩

వ. అనిన సప్రణయరోషవిషాదుండగు విభీషణుండు లంకేశ్వరున కిట్లనియె.

---

1 కండెవ్వా.

శా. ఏనీ కీర్తులు శం(ఖ)మౌళిఖురళీనృత్యత్తరంగాగ్రగం
గానీరంబుల మీరి లోకములు సంక్షాళించి వర్తింపఁగా
నా నీవే జనకాధిరాజతనయా[వ్యాసక్తిఁ బౌలస్త్య]వం
శానూనోదితకీర్తిచంద్రునకు నేఁ దంకంబవై తక్కటా! ౧౫

వ. అనియె ననవు దమ్మని సకౌతుకంబుగాఁ దరువాతి వృత్తాంతంబు చెప్పు
మనినఁ గరాళకుఁ డిట్లనియె నప్పుడు ౧౬

క. రోషారుణాయతేక్ష
భీషణుఁ డుత్ఖాతఖడ్గబింబితబాహా
భూషణుఁడునగుచుఁ దన్నె వి
భీషణు రావణుఁ డుదారభిదు(రస)మాంఘ్రిన్. ౧౭

సీ. నావు దమ్మని చూచితే విభీషణునకు
నయభూషణునకు విజ్ఞాననిధికి
నాపదల్ కలలోననైనఁ గాననివాని
కంఘ్రిప్రహారంబు నందవలసె
నని కరాళక మీఁదు వినుపింపుమన నవ్వి
భీషణుండు కృతార్థిపోషణుండు
తగువార లొక్కకొందరు గొల్చి వెంటరా
నన్యాయవర్తనుండైనయట్టి
గీ. యన్న డిగనాడి రఘురాము నాశ్రయించె
ననిన ముని యాత్మలోన నిట్లయ్యెనేని
యల పులస్త్యుని సందేశ మాచరించెఁ
బ్రియకలితభాషణుండు విభీషణుండు. ౧౮

క. అని హర్షంబున నీ వ
చ్చిన పని యెయ్యదియొ తెలియఁజెప్పు మనిన వి
ట్లనియెఁ గరాళకుఁ డనఘా
విను మంతయు నీకు విన్నవించెద వంచున్. ౧౯

క. సీతాయల్లకవిహ్వల
చేతస్కున్ దశశిరస్కుఁ జెలఁగింపగఁ ద
న్మాతామహుఁ డిప్పుడు నా
చేతఁ బుత్తెంచె నొండు చిత్రపటంబున్ ౨౦

వ అనిన నమ్మని యత్యంతకళావంతుండగు మాల్యవంతుం డాసన్నశత్రు సన్నాహుండగు రావణున కేవంవిధవినోదనోపచారంబు సేయం దరి యగునేయని వితర్కించి యిదియునుం గాలోచితం బగునది యొండు గావలయు ననునెడ తెర మరుంగున ౨౧

ఉ. ఓరి సుధాంశుబింబనికషోపరిఁ దివ్వడు చాల చందనం
బోరి ఘటింపు దైందవమయూఖముఖంబులఁ జారుచామరం
బోరి మృణాలకాండమృదులోదరతంతువు లేర్చి కూర్చు దం
భోరుహపత్రసీరకణపూరములన్ మణిహారమాలికల్. ౨౨

గీ. నావు డాలించి తనలోన నవ్వి మౌని
యీ పలాశాధిపతికి శీతోపచార
మెట్టు సీతోపచారంబు నట్టియదియ
శంక యేమిటికని ప్రకాశంబుగాఁగ. ౨౩

క. విరహాగ్నితప్తుఁడగు ని
ర్జరవైరికి శీతలోపచారము సేయన్
దొరకొనిరో దానవులన
గరాశకుఁడు ఖచరపతియుఁ గడఁగె నటంచున్. ౨౪

గీ. గంధ మలఁదెడుఁ గరముల జందమామ
తలిరుపీవన విసరెడుఁ జలువగాలి
వాఁటపరపెడుఁ బువుసెజ్జ నీటిరేఁడు
భావజానలతప్తుఁడౌ రావణునకు. ౨౫

క అన విని ముని తన మనమున
గనుగొంటే దైత్యుఁ డెంత గర్వించెనహో
యనునెడఁ గరాళకుం డి
ట్లనియె న్నేపథ్యమునకు నభిముఖుఁ డగుచున్. ౨౬

గీ అదె ప్రహస్తుండు నగరికై యరుగుచున్న
వాఁడు నాచేతి పటమీ నవశ్య మతని
హస్తమున కీవు నీయిచ్చు నరుగు మనుచు
నాడి నడయాడి రిద్దరు నచటువాసి. ౨౭

ఇది విష్కంభము

వ తదనంతరంబు కృతప్రవేశంబగు వింశతిహస్తప్రహస్తద్వితయంబు
నందు మందోదరిపతి డెందంబున నిట్లనియె. ౨౮

గీ. అ(లి)కఫలకిని కేశపక్షాభిరామ
యలఘుముఖరితకాంచీగుణాధిరూఢ
సీత మాన్మథసాయకశ్రేణివోలెఁ
జిక్కినది నాదుమది నేమి సేయువాడ ౨౯

గీ. ఆ జనస్థానమునఁబోలె నవనిజాత
యిప్పు డొప్పెడుఁ బ్రసభగృహీతయయ్యు
నినకరాచాంతకాంతియౌ యిందురేఖ
వెలుకఁబారియుఁ జూపుల విందుగాదె. ౩౦

గీ. అను సురారాతిఁ జూచి ప్రహస్తుఁ డీవి
చిత్రచిత్రపటంబు నీక్షించితయ్య
యనుచు ముందరఁ బ్రకటింప నబ్బురంబు
నంది యీ వ్రాసినది యేమి యనిన నతఁడు. ౩౧

క. ఇది గాదా తరళతరో
న్మదకమరకుళీరమత్స్యమకరకరాళా
ఘ్యదితతరంగాభంగవి
శదనాదోజ్జాగరంబు సాగర మధిపా ! ౩౨

ఆ. వె. అనుడు తనుతమాలవన(ష)ండమండితం
బైన జలధి యొాల (ని)ంద్రచాప
నివహదీప్తివోలె నింగి పచ్చఁగఁ జేయు
చున్నయది యిదేమియో యనుండు ౩౩

క. సుగ్రీవపాలితంబగు
నుగ్రవనాటాధినాథయూధంబన న
వ్యగ్రుండై నవ్వుచు దై
త్యగ్రామణి వాలిపాలితం బను మనుచున్. ౩౪

ఉ. అందులకేమి చాపధరులైన తపస్వులు వీర లెవ్వర
న్నం దశకంఠ ! భానుకులనాథులు వీరలయందు వజ్రభృ
న్నందనుఁ గూల్చె నగ్రజుఁడు నాటనుగోలె దినేంద్రనందనున్
జెందె వనాటసేనలని చెప్పిన నాత్మ పరాకు సేయుచున్ ౩౫

సీ. ఇతఁ డెవ్వఁ డత్యంతకృశరమ్యశుభమూర్తి
మందరామందనిర్మ(థనజని)త
తరళతరంగసంతతిదూరవిక్షిప్త
హ(ర)శేఖరారోహణాభికాంక్షి
చంద్రోపమానుఁడై జలరాశితటమున
ద్రేణియుండిన పూర్ణతేజుఁ డనవు
డితఁడు లంకాగమనేచ్ఛమై సాగరున్
గులగురుఁ గుశశయ్యఁ గొలిచియున్న

గీ వాఁడు రఘురాముఁ డనుడు రావణుఁడు నవ్వి
మనల నీరీతి సీతకై యనుసరింపఁ
గలఁడు నా విని యిటు చూడు మల నృపాళు
గాగ్ని సాంభశ్చరంబుగా నడలు కడలి ౩౬

గీ అనుడు నీ యిద్దరును నెవ్వ రాదరమునఁ
దరుచరులు తమ్మ నల పెద్ద తపసిఁ జేర్పఁ
జేరినారన నీతండు సింధునాధుఁ
డితఁడు మీ యంచు నర్ధోక్తి మతి నడంచి. ౩౭

క. తీరా బంధువిరోధిన్
బేరుకొనఁగ ననవు డివ్విభీషణుఁ డస్మ
ద్వైరంబు పూని రామమ
హీరమణుం జేరెఁ జేరనీ యటమీఁదన్. ౩౮

గీ రాక్షసాధీశకోటీరరత్నకిరణ
పుంజకింజల్కవత్పదాంభోజుఁ డగుచు
లీల మను నన్నుఁ జేరంగఁ జాలఁ డనిన
నప్రహస్తుండు సత్యమౌ నన [1]నతండు. ౩౯

గీ. అచట నక్షరపంక్తిద్వయంబుఁ గాంచి
యుప్పతిలు వేడ్క నిదియేమి చెప్పు మనుడు
సా(గ)రాధీశ్వరుని విభీషణునిఁగూర్చి
తేటగా లక్ష్మణుండాడు మాట లనుడు. ౪౦

వ. అందు నొకటి చదువు మనినఁ బ్రహస్తుండు. ౪౧

చ. వెరవకు వార్ధిరాజ రఘువీరుని కోపపుఁ జిచ్చు నిన్ను ద
గ్గరదు చెరం బరంబువడు కాంతల బాష్పము లానుగాని నీ

1. నవుడతండు

తెర మకరీవిహారములు దేరు నుదారతఁ దచ్ఛరాహతిన్
గరి చెడు రాక్షసేంద్రతనుగల్లతటీమకరీవిలాసముల్ ౪౨

వ. అనినం బదివదనంబులదొర యిదియునుం జదువు మనుటయు. ౪౩

మ. శరణాపన్నున కివ్విభీషణునకుం సత్యంబు లంకాధిప
త్యరమం జయ్యన నిచ్చె నానతి ఋణోత్తారంబుగా రాఘవే
శ్వరుఁ డీవేళనె పూఁటకాఁపు లల భాస్వన్నందనశ్రీసము
ద్ధరణంబుల్ భుజదండముల్ మనము పొంతన్ సాక్షి లీదీనికిన్. ౪౪

క అని చదివిన నౌరా యీ
[1]గొనబగు జటదారి నోరఁ గొలఁదులు కానీ
కనుపట్టెడు నిది యెద్దియొ
వననిధిమధ్యమునఁ జాల ధ్వజినీపాలా ౪౫

ఆ. వె అనఁ బ్రహస్తుఁ డనియె వనరాశి నడుచక్కఁ
గపులు దెచ్చి కొండగములఁ గూర్చు
కిరణమాలివంశకీర్తిప్రశస్తిప్ర
బంధమైన సేతుబంధ మధిప. ౪౬

క. అన విని చిత్రకరుఁడు వ్రా
సిన నేర్పౌరౌర మిగులఁ జిత్రముగా దే
యనృతంబు సత్యముంబలె
గనుపింపుచు నున్నవాఁడు క్రమమున ననుడున్. ౪౭

క. మనమున నిపుడున్ మృషలే
యని తలఁచెదవే యధీశ యనునెడఁ దెర మా
టున నొక కలకల మెసఁగన్
విని దశకంధరుఁ డిదేమి వినుపింపుమనన్. ౪౮

వ. ప్రహస్తుం డిట్లనియె. ౪౯

1 కొనబగు

గీ. చండదర్పోద్ధురత రాము దండు నడుమ
నెసఁగు కపికుంజరంబుల బృంహితంబు
హృతనవాంభోదనాదమౌ నిది యధీశ!
వలయు నారసి ప్రతికార్య మలవరింప ౨౦

వ అనినం బంక్తికంధరుం డప్పుడు శంకాప్రతివిధానంబుల కిది యెంత
పనియని యిట్లనియె ౨౧

క ఆమోదము గైకొనియెడు
నామది కపిసింహసింహనాదంబులచే
నా మందోదరి యందెల
లేముద్దుం గులుకు రవల లివలం బోలెన్. ౨౨

క. అని పలుకఁగ తదనంతర
మున మయతనుజాత వచ్చి ముకుళితకరజీ
వనజాత యగుచు జయజయ
దనుజకులాధీశ యనుడు దయ దలిరింపన్. ౨౩

క. రారమ్మిటు కూర్చుండ న
వారుణరత్నోష్ఠి యనవు డానతముఖియై
చేరువఁ దగు పీఠిక న
న్నారీమణి యధివసించినం గనుఁగొంచున్. ౨౪

గీ. వెలఁది ఘుగ్నాలకము హాసవిజితచంద్ర
లోక మీక్షాత్తకువలయశ్రీక మఖిల
దురవలోకంబునై నన్ను దొరయు నీదు
వదనమండల మిపుడేల వంచి తనుఁడు. ౨౫

వ. ప్రహస్తుం డిట్లనియె. ౨౬

క.- దేవా కపికలకలముల
చేవం దల వాంచి చింతఁ జివికెదు విపుడీ

దేవి యన రావణుం డే
లా వలవని చింత కోఁతులకుఁగా ననుచున్. ౫౭

గీ. లాలితాంగదభుజలత నీలచికుర
చారునయన సముజ్జ్వలత్తార కుముద
హాస తారేశవదన [వ]నాటనేన
యబల నా ప్రోల మారు మాటాడ గలదె. ౫౮

గీ. అనిన మయపుత్రి చింతసేయంగ నొండు
కారణమె [యున్నయది] నీకుఁగా శకునము
జూడ నేఁడొక కొండఁ జెంచులు వసించు
పల్లి కనిపితి నొక బోటిఁ ప్రాణనాధ! ౫౯

క. అందొక పుళిందసుందరి
నందన్నిజమందిరాంగణంబునఁ బరమా
నందమున మెలఁగు మృగరా
ణ్ణందను నిట్లనియె నీసునం గనుఁగొంచున్. ౬౦

గీ. లీల నిర్జరయూధపుం దోలి తనుచుఁ
జెలఁగి యూరక [1]గర్వింపవలదుసుమ్మ
శరభనందనుఁ డుత్సాహసహితబుద్ధి
కలితుఁడై వచ్చె నీ లంక పొలమునకును. ౬౧

వ. అనిన లంకాపతి శంకావిరహితుండనగు తనకు శకునోపశ్రుతిపరీక్ష
పక్షం బేల బేలవే యనునెడం దెర మరుంగున. ౬౨

శా. శంకాదూరరఘుప్రవీర రణి[త]జ్యావల్లరీఝల్లరీ
ఝంకారప్రసరప్రరూఢపులకచ్ఛన్నావిభిన్నాంగకుల్
హుంకారస్ఫుటకీశకంరకద(న)ప్రోద్యత్కృపాణ(ప్రభా)
సంకీర్ణాఖిలదిఙ్ముఖుల్ చెలఁగి రక్షోమోద్ధతిన్ రాక్షసుల్. ౬౩

1. గవ్వింప

క. అని వినవచ్చిన రావణుఁ
డను మోదంబెసఁగ నేతదాయోధన ము
గ్రనిశాటవీరజయభా
జన మైనది యనుడు మగుడ జవనికలోనన్. ౬౪

గీ. దూఁటి పరిపాకకింపాకపాటలాస్య
మైన కపిసేన గ్రోలె రామాగ్రసీమ
దనుజచక్రంబు (నంత యంధక)తమిస్ర
చయము నుదితార్కభానుపంక్తియును బోలె. ౬౫

గీ [1]అనిన [దైత్యు] డహంకార మతిశయిల్ల
కం(టి) మర్కటకీటవిక్రాంతి యెంత
యనుచు నెలుఁగెత్తి యోరోరి దనుజభటులు
మీరు వేవేగ నాయాజ్ఞ మీఁద నేగి. ౬౬

గీ. కలన రఘురాము నోర్వంగ వలయు మేలు
కొలుపుఁ డాయోధనోదీర్ణుఁ గుంభకర్ణు
మోఘితాద్రిభిదాహ్లాదు మేఘనాదుఁ
బంపు డిప్పుడ లక్ష్మణుఁ జంపుగాని ౬౭

క. అనఁ దెరమాటున దేవా
కనుకని నీ వానతిచ్చు క్రమమంతయుఁ జే
సినవాఁడు మాల్యవంతుఁడు
మునుమున్నగ నిపుడు చూడుము సమిద్ధరణిన్. ౬౮

గీ. తాఁకె న(స్తంభ)దోస్తంభదర్పమడరఁ
గుంభకర్ణుండు రఘురాముఁ గొండవోలె
కదిసె సౌమిత్రి నసురశిఖండి మేఘ
నాదుఁ దల మేఘనాదుఁ డంతకుఁడువోలె. ౬౯

1 అనినరావణుండహంకారమతిశయిల్ల

వ. వెండియుఁ దెరమరుంగున ౨౦

మ కులధాత్రీధరకల్పులన్ గపుల నుగ్గుల్ చేసె నే వీరుఁ డు
జ్వలదంష్ట్రాభిదురప్రహారముల నెవ్వాఁ డస్త్రవర్షంబుచే
నలవార్చెన్ (ద)హనా(భు)లన్ హరుల నేఁడా కుంభకర్ణేంద్రజి
త్తులు హా కూలిరి రాఘవాస్త్రశిఖిఁ దోర్దోడం బతంగంబులై. ౨౧

గీ. నావు డాలించి మందోదరీవిభుండు
దేవియును దాను మూర్ఛఁ జెందిన ప్రహస్తుఁ
డధిపుఁ దేర్చిన నాతఁ డిల్లాలిఁ దేర్పఁ
దేరి యక్కొమ్మ ప్రాణేశు దిక్కు జూచి. ౨౨

క. శోకతిమిరంబు మిగులం
బై కొనియెం గావవే కృపానిధి యన్ నే
లా కలఁగెద వీ చీఁకటి
[దీ]కొనునే చంద్రహాసదినమణి గలుగన్. ౨౩

వ. అని రావణుం డమ్మండలాగ్రంబునుంబూని హుమ్మని బయలు చిమ్ముచు
నిట్లనియె ౨౪

గీ. ఘోరదారితసురకుంభికుంభముక్త
హారిముక్తాఫలాకలితాధివాస
మైన యీ చంద్రహాస మీలోనె యొసఁగు
ఖేదమోదంబు లమరమర్త్యాదులకును. ౨౫

వ. అని ప్రహస్తసహితుండై దశమస్తకుండు చనుటయు మందోదరియును.

క. ఈ విద్యాధరమిధునము
రావణరణరభస మబ్బురంబుగఁ గనుచున్
దా [1]పచియించెడు [నెది]యో
కావున నే ని నిపుడ యేగి గాఢవ్రతనై. ౨౬

1 వచియింప్పెడు.

క. సమరక్ష్మామండలి న
యామరారికి జయ మొసంగ నస్మత్కులదై
వము బ్రార్థించెద నని య
య్యమలేందునిభాస్య చనియె నటుతరువాతన్. ౭౮

క. అరుదెంచిన యా విద్యా
ధరమిధునమునందు నిజనితంబినితోడన్
పురుషుం డిట్లనె నో దళ
దరవిందనిభాయతాక్షి యట కనుఁగొంటే. ౭౯

ఉ. వంచనలేక పోరి యని వ్రాలిన యీ దనుజప్రవీరు లే
తెంచి దినాంతపంకజముఁ దేఁటులఁబోలె నహర్పతిం బ్రవే
శించిరి తత్ప్రభిన్నసరసీరుహబాంధవబింబ మంబర
[1]ప్రాంచలమం[జుకు]ంజకుహరాగ్రమధుచ్ఛదలీలఁ గ్రాలెడున్. ౮౦

క. అన విని విద్యాధరి యీ
వనచరులకు నెదురు నడచువాఁ డెవ్వఁడొకో
తన దోర్వని రణసంభ్రమ
మున మొనపెడు పులకజాలముల ననవారన్. ౮౧

వ. అని విలోకించి సవిస్మయుండగుచు వెండియు నిట్లనియె. ౮౨

చ. ఉరవడి నీలశైలవికటోత్కటకూటము నీలుఁ డెత్తి యా
సురపతి పేరురం బురుముచుం బ్రహ(రి)ంచిన దాన నింతయున్
దరల (క)తండు [2]గైకొనె నెద న్వి(క)చోత్పలమాలిక న్మనో
హరసరణిన్ వసంతసమయంబునఁ గొమ్మలువైచు వాటుగన్. ౮౩

మ. అని విద్యాధరుఁ డాత్మఁ గౌతుకము డాయన్ గ్రమ్మరం బల్కు నం
గవ[కం]బే యొకఁడయ్యు నీలుఁ డలిజోకన్ నీలరేఖన్ దళా

1 ప్రాంజల 2 గైకొనియెద న్వి(క)చోత్పల.

ననహస్తాబ్జ(కి)రీటవాటికలపై నర్తింపుచున్ తేజమున్
దనరం జేయుచునున్నవాఁ డనిన నర్తన్వంగి సాశ్చర్యయై. ౨౪

క ఈ రాక్షసుఁ డెవ్వండొకొ
యా రాక్షసరాజుఁ జెనక నరిగెడునన వాఁ
డా రామహితుఁడు భూరిగ
ధీరగుణా(ర్ణో)ధిపతి విభీషణుఁ డబలా. ౨౫

క. అని వెండియును విషాదం
బున నకటా దైత్యవల్లభుఁడు తమ్మునిపై
ఘనశక్తి వైచెనన విని
యనఘా తుది నేమియయ్యె నది యన నతఁడున్. ౨౬

గీ. అప్పు డంగీకరించె రామానుజన్ముఁ
డా మహాశక్తిఁ బ్రాణమౌ (లేమఁ) బోలెఁ
దన యురోవీథి ననిన విద్యాధరీల
లామ యయ్యో యటంచుఁ బల్మరు గలంగ. ౨౭

వ. విద్యాధరుండు గ్రమ్మర నిట్లనియె. ౨౮

ఉ. అంకమునన్ జలింపని దశాననలక్ష్మణుల న్నిరంకుశా
యాంకవిజృంభమాణధనురక్షివిముక్తశరాతివృష్టిచేఁ
గ్రుంకఁగఁ జేయుచున్ గపులకున్ బ్రియమున్ భయమున్ ఘటింపుచున్
సాంకవగంధి వీరకరుణామయుఁడై మను రాముఁ జూచితే. ౨౯

వ. అని కనుంగొని దశకంధరుండు రామశరపీడితుండై వెరచరచి పరచెంగద
యనునెడం దెర మరుంగున. ౩౦

గీ. ఊర్మిళాలోచనాంజనానూనరమయు
నర్యమాన్వయభాగధేయంబు రామ
జీవితము నొక్కమాట కోల్పోవకుండ
నన్న లక్ష్మణ హా వత్స కన్ను దెరవు.

క. అని మూర్ఛఁజెందు రామునిఁ
గని విద్యాధరుఁడు వగచి కనుఁగొంచే త
మ్మునిమీది వత్సలతఁ జెం
దిన దుఃఖం బితని కనఁగ నేపథ్యమునన్. ౯౨

సీ. జననాధ యాశ్వాసమునఁ జెందు మనఁగ వి
ద్యాధరుం డీ వానరాధినాధుఁ
డూరడింపఁగ మూర్ఛఁదేరి యీ రఘురాముఁ
డనుమాట యెద్దియో యనఁగ నతఁడు
విడువు సుగ్రీవ యెక్కడి తెల్వి తము రామ
లక్ష్మణులనుచు నెల్లరునుఁ బొగడు
వచనామృతము గ్రోలువాఁడ నీ లంకెపా
[1][పెడలు పేర మరియ]దెట్లు దాల్తు
గీ. నేఁ దనకు మ్రొక్కఁ దనవెంట నితఁడు లేమి
గాతరతఁ జెంద పినతల్లిఁ జూతు నెట్లు
కంటివే గొంటనై మన్న మంటిఁ గా(క)
యల యయోధ్యకు మగుడి పోఁదలఁచినాఁడ. ౯౩

క. అన విద్యాధరుఁ డయ్యో
మునిఁగెడు కరుణాసముద్రమున నివుడీ రా
జని యారసి దీనికిఁ బ్రతి
యొనరింపఁగఁ దగిన దెద్దియో యని మరియున్. ౯౪

వ. ఈ ప్రతీకారకధకు విధి వక్రంబై(నది) చోద్యంబుగాదె యనిన విద్యా
ధరి వక్రమాత్రంబె ? వక్రతరం బనందగుగాక భీకరాకారుండై యదె
చూడు మి(ప్పు డొక్క) వానరేంద్రుండు దానవేంద్రకృతపంధానుండై
యనూనసానుమత్కూటంబు వూని మానవేశ్వరు మ్రోల వ్రాలు

1 పెలెడు (పెరమరియ)

చున్నాఁడు నా విని యమ్ముగ్ధ వాచావిదగ్ధుండగునతం డో ముగ్ధ ! దుగ్ధ
కంఠవుంబోలి యా లీలం బలుకుదురె శాంతంపాపంబని పాణిపల్లవా
చ్ఛాదితకర్ణకుహరుండగుచు ని త్తెరం గెఱుంగించెద నని యిట్లనియె.

గీ. భూరిదివ్యౌషధీలతాగారమైన
గంధమాదనకుధరంబు గాలిచూలి
లక్ష్మణప్రాణరక్షణోల్లాసియగుచు
(ను)రుజవస్ఫూర్తిఁ గొనివచ్చి యున్నవాఁడు ౯౬

క అని మగుడఁ జూచి మదిఁ బొది
విన యామోదమునఁ బలుకు విద్యాధరుఁ డో
కనకారవిందవిభ్రమ
జనకానన ! కంటె కంటె జగ ముప్పొంగన్. ౯౭

గీ సారదివ్యౌషధీభూరిసౌరభంబు
మూరుకొని లక్ష్మణుఁడు కన్ను మోడ్పు దేరి
వెండియును మండలితచాపదండ మమర
రామచంద్రునిఁ (బరి)పూర్ణకాముఁ జేసె. ౯౮

క. నా విని కంటే మగుడఁ బ
రావర్తింపఁగదొడంగె రాము రణక్రీ
డావిస్ఫురద్భుజుండై
రావణుఁ డన నతఁడు నిజపురంధ్రికి ననియెన్ ౯౯

గీ. కమలలోచన సావధానముగ నిపుడు
చూడు మానవదానవేశులరణంబు
వీరలక్ష్మీతులారోహవిహరణంబు
నావుఁ డా కొమ్మ నిజమనోనాథుఁ బలికె. ౧౦౦

క. భువనైకవీరుఁడగు రా
ఘవునకు నానాప్రవీరగణపరిభూతుం

డవు రావణునకు నొక యె
త్తవు పెట్టులు వీరలక్ష్మి యాహవధరణిన్ ౧౦౧

వ. నా విని యో తీవఁబోఁడి రావణుం దప్పించి వేరొక్క వీరునిం జెప్పుమా
యని విద్యాధరుం డిట్లనియె ౧౦౨

సీ. సురవధూస్తనగంధగరిమ ముట్టక తూల్చు
వాలుఁ బోరునకు నెవ్వాఁడు జాణ
హతమరుత్కరిశిరశ్చ్యుతమణిస్మితచంద్ర
హాస మెవ్వని కేల నాడుచుండు
స్వభట[1]సంరక్షకవాటవక్షఃపత
ద్వజ్రఘాతముల (కె)వ్వాఁడు నవ్వు
గగనసరోభూమి కైలాస మెవ్వాని
హస్తాబ్జములకు రాయంచ యయ్యె

గీ. నతఁడు యుగవిగమారంభకృతమహాంధ
కారకంధర[2]నిర్ఘోషకరినజైత్ర
[దుందు]భిధ్వానదీర్ణపాథోజజాండ
కర్పరుం డల్పుఁడే పంక్తికంధరుండు. ౧౦౩

వ. అనునెడ యవనికాంతరంబున. ౧౦౪

చ. హరు గిరి దూల్చి లంక కభయం బొనరించి జగంబు లాపద
న్పొరయఁగఁజేసి దివ్యమృగనేత్రుల బందులు వట్టి జానకీ
గురుకుచకుంభయుగ్మమునఁ గుంకుమ దార్పఁగ గోరి రావణ
స్ఫురదురుచండదోర్భుజగపుంగవలీలలు మీరెడున్ గడున్. ౧౦౫

వ. మరియునుం దెర మరుంగున ౧౦౬

చ. హరు విలు దూల్చి లంకకు భయం బొనరించి జగంబు లాపద
న్పొరయఁగనీక దివ్యమృగనేత్రుల బందులు మాన్చి జానకీ

1. సంరక్షకాకవాట 2 నిర్ఘోష

గురుకుచకుంభయుగ్మమునఁ గుంకుమ దార్పఁగఁగోరి రాఘవ
స్ఫురదురుచండదోర్భుజగపుంగవలీలలు మీరెడుఁగా గడుఁగా. ౧౦౭

గీ. అనఁగ విద్యాధరుఁడు నిశ్చయము నిజాధి
నాయకులఁ బెద్దసేయు దానవవనాట
భటుల వాక్యంబు లివి యనఁ బ్రాణవల్ల
భునకు విద్యాధరీమణి యనియె నపుడు. ౧౦౮

చ. అలఘురథస్థుఁడై న దనుజాగ్రణితో నచలాతలస్థుఁడౌ
నల రఘురామచంద్రునకు నాహవ మెట్లొనఁగూడు నావుడుఁగా
దిలసుమనాస వాసవుని తేర*[దె మాతలి తెచ్చె రాఘవుం
డలరుచు నెక్కె పూర్వ]దిగహార్యము సూర్యుఁ(డు వో)లె నున్నతిన్.

వ. అప్పుడు తెర మరుంగున. ౧౧౦

క. కనుఁగొంటె యితఁడు పూర్వం
బున ఖర*[మారీచశక్రపుత్రులు పొలివో
యిన త్రోవనె జ]నఁ గోరెడు
ననునెడ విద్యాధరుఁడు ప్రియం గని పల్కెఁగా. ౧౧౧

క. ఓ రాజమండలానన !
యీ రాక్షసచక్రవర్తి యేమనియెడినో
యీ రామవచనపీడితుఁ
డై రమ్మా వినఁగవలయు ననఁ దెరలోనఁగా. ౧౧౨

చ. ఖరుఁడన నెంత వాలియనఁగా నొక కీశము తాటకాసుతుం
డరయ మృగంబు పేంద్రఁ దెగటార్చియె క్రొవ్వెదు చూడు క్రీడమై
హరిహయహస్తి నాఁగిన దశాననపంచముఖంబు వచ్చె వి
స్ఫురితనిషంగసంఘశరపుంఖసటాపటలాభిరామమై. ౧౧౩

---

*ఈ పట్టులందు తాటాకున కొంత స్థల మూరక విడువబడినది మూలప్రతి శిథిలమగుటనో యేమో వ్రాయసకా డీ భాగము బూరక విడిచినాడు.

వ అని వితర్కించి. ౧౧౪

మ. అల కాళీహరికేసరాంచలసటాసాటోపసంపాదితో
జ్వలవాలవ్యజనానిలాంకురలవాచాంతశ్రమాంభఃకణుం
డలఘుశ్రీనిధి యీ దశాననుఁడు పంచాస్యోపమానక్రియా
కలనం జెందెడు కీర్తి యెంత యిదియుం గాదంచు జృంభింపఁగన్. ౧౧౫

వ. విద్యాధరుండు విద్యాధరి కిట్లనియె. ౧౧౬

గీ. దైత్యపతి మాటలకు రాముతమ్ముఁ డలిగి
యేమొ పల్కెడు ననఁ దెర యెత్తి నీకుఁ
బంచవదనత్వముననేమి పదిముఖంబు
లుండఁగానేమి పనికిరా వొండు వినుము. ౧౧౭

గీ. గర్వ మెడలి విభీషణుకరణి రామ
విమలపాదాబ్జములకు భృంగమవు గమ్ము
కావె యలకుంభకర్ణునిగతిఁ దదీయ
కాండదహనార్చులకుఁ బతంగమవు గమ్ము. ౧౧౮

వ. అనునెడ విద్యాధరి పతి కిట్లనియె. ౧౧౯

ఉ. భీమశరాంధకారములు వెంచుచుఁ [జూచితె రావణుండు] సం
ధ్యాముఖమయ్యె నావు డని యమ్ముల గిమ్ముల బారఁ జిమ్ముచు
గ్రాముఁడు సోముఁడయ్యె నలినచ్ఛదలోచన వాఁడె పోఁడిమిన్
సా[.........]మది సంతస మెంతయు నింద వెండియున్. ౧౨౦

గీ. రాముఁ డాత్మ(యదివ్య)శరప్రభూత
శాతదివ్యాశుగాటోపచాపుఁడైన
దేవతారాతి నిపుడేమియో వచింపఁ
బదరుచున్నా డనంగ నేపథ్యమునను. ౧౨౧

క. గతధర్ముఁడవై వెరవ(కు)
మతిధర్మము వదల నేను మరియొ(క) చేదే

ని తగిన కైదువు గలిగిన
చతురతఁ బోరాడు మోరి జారక యనఁగన్. ౧౨౨

వ విద్యాధరి రావణుఁ డేమనియెడునో యనఁగఁ దెరచాటున. ౧౨౩

ఉ. చారునిజాభిధానపదసామ్యమునన్ గి(ను)పూరియోయనన్
బారణ సేసె నెద్దీ సురపద్మముఖీముఖచంద్రహాస మా
సారదశాస్యవీరభుజచందనభూజసమాజజృంభ(మా)
ణోరగచంద్రహాసము రఘూద్వహ నీ కెరుఁగంగ బోలదే. ౧౨౪

వ. అనునెడ విద్యాధరుండు లీలాధరితచంద్రహాసుండును సోత్ప్రాసహాసుండును నగు రామచంద్రుం డేమనియెడునో యనునెడ తెర మరుంగున లంకేశ్వరుండు ఖేదపడియెడునో యనునెడ విద్యాధరి యీ మాటకు రావణుం డేమనియెడునో యనునెడ జవనిక కడ నక్తంచరపతి యింత లోపలన ఖేదపడియెడువాఁడె యౌరౌరా యోరి విను మని యిట్లనియె

శా. హానిం జెందె దిగంతముల్ పదియు నాన్యస్ఫూర్తిగోత్రాదికూ
టానూనంబులు బాహు లిర్వదియు భారార్ధంబ కాఁగల్గె నౌ
నా నారాయణుఁ డబ్ధిఁ గూర్కెఁడు హరుం డారాధ్యుఁ డీరీతి కె
ద్దానిన్ జేయుదునంచు ఖేదపడు దైత్యస్వామి యెల్లప్పుడున్. ౧౨౫

క. అనునెడ విద్యాధరి యీ
మనుజాశనభర్త రిత్తమాటలవాఁడే
యనఁ గాదుకాదు సుమ్మీ
యని విద్యాధరుఁడు వల్కె నద్భుత మెసఁగన్. ౧౨౬

ఉ భిన్నశరాశనాసి[ముఖభీకర]సాధనుఁడై దశాననుం
డన్నరనాథుచేఁ దునియ నాననముల్ దివి నంట మట్టమై
కొన్ని కరంబులం దిగిచి కొన్నిట రువ్వుచు బాహువింశతిన్
వన్నెకు నెక్కఁజేసెఁ దమవారలు వైరులు నిచ్చ మెచ్చఁగన్. ౧౨౭

వ. అని మరియునుం గౌతుకంబున. ౧౨౮

చ కనుఁగొను నింద్రు భీతిఁ బులకంబులతోన శిలీముఖావళీ
వినిహతరావణాస్యములు వే జనియింపఁగఁజొచ్చె నెవ్విధం
బున నిపు డవ్విధంబునన మూర్ధవిఖండనకేళిలోలమా
జనప(తి)యంతరంగమున సంభవ మొందెడు హర్షవీచికల్. ౧౩౦

క. అన విద్యాధరి యిఁక నీ
దనుజేంద్రుఁడు చెరలు గొన్న తరుణుల మొగముల్
గన దుర్లభంబు గ్రమ్మరఁ
బెనఁగొని మొలవంగ దొణఁగె పృథుమస్తకముల్. ౧౩౧

గీ అనిన విద్యాధరుఁడు తాప మందవలదు
రాముఁ డిందాక రాక్షసరాజుతోడ
మేల మొనరించెగాని యీ వాలు చూడు
మలిగె నని వెండియునుఁ జూచి యబల కంచె. ౧౩౨

శా. చేతోజ్జాతవస(న్మ)హేశ్వరశిరశ్శీతాంశురేఖాసుధా
స్రోతస్సంగతిఁబోలె రామవిశిఖక్షుణ్ణంబులయ్యున్ పున
ర్జాతస్ఫూర్తివహించు రావణశిరస్సంఘంబులన్ వెగ్గలం
బై తేజం బొకఁ డుల్లసిల్లెడు జగం బాశ్చర్యమున్ జెందఁగన్. ౧౩౩

చ. అని నగి వీని డెంద మహహా కనుఁగొంటివె యుత్తమాంగమ
ర్దనరతుఁడై రఘూద్వహుఁ డురస్థల మెప్పుడు నొంపఁ దప్పు డె
ల్లను భ్రమదంబె కైకొని చెలంగెడుఁగాని కలంగఁ డిప్పుడున్
బొనుఁగఁగనీఁడు గావలయు భూతనయా దనలోన పూనికా. ౧౩౪

వ. అను నవసరంబున జవనికాంతరంబున. ౧౩౫

గీ ఏల పాలార్చెదవు దానవేంద్రు తలల
గొలల నిండింపరాదె మాకోర్కి నొక్క
బాణమున నో పయోజాతబంధువంశ
తిలక నిజకీర్తిచే ధరిత్రియునుఁ బోలె. ౧౩౬

వ. అని పలుకు వచనరచనలు
విని విద్యాధరుఁడు విబుధవిసరము లీలా
గున నాడుచున్నయవి యే
మనియెడునో యిందులకు ద(శాననుఁ) డనఁగన్. ౧౩౭

ఉ. హారిశిరస్సుధాంశుకళ నంటక దోఃపరిఘంబులార యా
శారమణోత్తమాంగమణిసంఘముఁ గైకొనుఁ డందు పొందుగా
దీరి (మదీయ)విక్రమనుతిన్ మధురధ్వనిభంగిఁ జేయు బం
గారమునూలు జానకి తగన్ జఘనంబునఁ దాల్చుఁ గావుతన్. ౧౩౮

గీ. అనఁగ విద్యాధరుఁడు నవ్వి దనుజనాథ
బలిమి (గ)లవాఁడవౌదుసూ బాహుదండ
ములె నియోగించె దిప్పుడు దలఁప నీకు
నవియె పరివారమై యున్కి కని మరియును. ౧౩౯

క. సాకూతంబుగఁ జూచి మ
హీకన్య(రమణుఁ) డి(పు డొ)కించుక కినుకన్
జేకొనినరీతి నున్నాఁ
డీ కంటకుఁ డాడు మాట కిదె మదిరాక్షీ. ౧౪౦

వ. అని క్రమ్మరం బ్రమోదఖేదంబు లెసంగ కటకటంబడి. ౧౪౧

గీ. ఎవ్వఁ డిందుశిలావేదిఁ బూవుసెజ్జ
పుష్పోడిన తేలి లీలమై బొరలుచుండు
వర్ధశాస్యుఁడు రాముచూ పరుణమైన
వ్రాలినాఁడు ధరాశయ్య ధూళిఁ బ్రుంగి. ౧౪౨

క. అన విద్యాధరి హర్షం
బున నిఁక రఘురాముఁ గలియుఁబో సీతయనన్
విని విద్యాధరుఁ డిందుల
...కనుమానమె చక్కఁ జూడు మదె చిత్రముగాన్. ౧౪౩

క. అభ్రంలిహబ(హు)కీలా
(ద)భ్రాగ్నిం (జొచ్చి) వెడలి తనరెడు సీతా
సుభ్రూమణిరుచి నుదితా
ర్కాభ్రాజితకిరణకళిక కరణిం దరుణీ. ౧౪౪

క. అనుటయు విద్యాధరి (యిట
కను)ఁగొంచే శిబి(ర మొర)యఁగా ర(య మొప్పఁగా)
జనియెఁ బరివారయుతుఁడై
జనపాలకమౌళి రామచంద్రుఁ డధీశా. ౧౪౫

గీ. అనిన విద్యాధరుండు కర్ణామృతంబు
గాఁగ నీ వార్త పౌలో(మి కడ)కు నేగి
విన్నవింపఁగదగు నంచు వేడ్కమీర
నింతియును దాను వెడలి రనంతరంబ. ౧౪౬

వ. కృతప్రవేశంబగు సీతారమణసీతాసౌమిత్రిసుగ్రీవసరమావరపంచకంబున (ప)ంచజనపాలపంచాననంబగు రామచంద్రుం డిట్లనియె. ౧౪౭

క. చరమాద్రికూట మొరయఁగ
నరిగెన్ భగవంతుఁడైన యంబుజమిత్రుం
డురవడి [న]న లక్ష్మణుఁ డదె
వరుస నతం డపరవార్ధివారిం గ్రుంకెన్. ౧౪౮

వ. అని యేతత్సమయంబున. ౧౪౯

గీ. ప్రాంశుదిగ్దంతిచంచలశ్రవణఘాత
కటతటోచ్ఛలదలిగుచ్ఛకములరీతి
దర్పసారమసారసంతమ(సరాసు)
లాశ లరికట్టి మూసె నాకాశవీథి. ౧౫౦

క. అన రాముఁడు రాత్రించరు
లనఁ జీఁకటు లేవు మీరె (నన) సరమేశుం

డినకులుని తూపుగములనఁ
గనుపట్టెడు శాతశీతకరకిరణంబుల్. ౧౫౧

వ. అనిన సుగ్రీవుం డది యట్టిద యగునని. ౧౫౨

మ. స్రవదిందూపలవారిశీకరము లంచద్దుగ్ధసింధూర్మిఫే
నవిధాపాండురముల్ చకోరముఖలూనప్రాగ్రముల్ పుల్లకై
రవధూళీపరిధూసరంబులు విధూస్రంబుల్ విజృంభించె పాం
ధవధూకోమలదే(హ)సీమల చమత్కారంబు గావింపుచున్. ౧౫౩

వ. అనిన రామచంద్రుం డీక్షించి యౌనౌనని యిప్పుడు. ౧౫౪

*ఆ.వె. శంకరార్ధదేహసన్నద్ధశాంకరీ
కుంకుమాభిరామకుచసమాను
నోషధీ(శుఁ జూపుచు)న్నది బిసి(ని యు)
త్తాలముకుళహస్తి[లీలఁ బోలి] ౧౫౫

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. ౧౫౬

శా. కాలగ్రీవగళప్రభానిభతమఃకాండంబుల (వ్వేళ)దెసన్
గ్రాలన్ దూర్పున దుగ్ధసింధులహరీరమ్యేందుకాంతిచ్ఛటల్
వ్రాలన్ గోకచకోరశోకకుతుకమ్లానప్రసన్నేక్షణా
లోలశ్రేణులు ముంచెనో యనఁగఁ ద్రైలోక్యంబు శోభిల్లెడున్. ౧౫౭

వ. అనిన రామచంద్రుం డది యట్టిదయగు నిప్పుడు. ౧౫౮

మ. సితభానుస్ఫటికాలవాలవలయన్ధేమోల్లసచ్చంద్రికా
లతికాపల్లవపంక్తిపైఁ బొదువులీలన్ గొంత సే పంబరం
బతిరాగంబు వహించి యంత ధవళంబయ్యెన్ (జకోరాస్య)భం
జితతత్కోమలకాండనిస్రుతపయస్సే(కస్థితిన్) జెందెనాన్. ౧౫౯

వ. అని మరియును రామచంద్రుండు చంద్రోదయవైభవంబుం జూచి లక్ష్మ
ణున కిట్లనియె. ౧౬౦

*మూలమున నిది విభీషణోక్తము కాని రామోక్తమగుటయే ప్రాచీనతమ సంస్కృతప్రతులందు కానవయ్యెడి.

మ చతురానంగభుజంగమస్తకమణిన్ సర్వగ్రహగ్రామణిన్
రతికాంచీమణి శంభుజూటమణి పాంథద్యోమణిన్ తారకాం
చితహారాగ్రమణిన్ జకోరపరిషచ్చింతామణిన్ జంద్రుఁ జూ
చితె ప్రాచీకరపద్మదర్పణమణిన్ శృంగారరక్షామణిన్. ౧౬౧

వ. అనిన లక్ష్మణుం డది యట్టిదయగు నియ్యెడ. ౧౬౨

చ తొగ లెగయన్ బయోధి దివితోఁ గలయన్ పరివోక కోకముల్
వగ నలయన్ జకోరపుఁగవల్ బెలయన్ జవరాంధ్ర మానవుం
దొగ వొలయన్ బయోజినికి తూఁ గొలయన్ తెలిమించు లెల్లెడన్
దగ మలయన్ వి(టావ)ళి కతల్ వెలయన్ నెల దోఁచె తూర్పునన్.

వ అనిన విభీషణుండు నెచ్చెలిఁ జూడుచూడుమని యిట్లనియె. ౧౬౪

ఉ. చండమయూఖశాతనఖజాతవిభిన్నతమిస్రభద్ర వే
దండకరోరకుంభగళి(తస్ఫు)టతారకమౌక్తికౌఘ (మా)
ఖండలదిగ్దరీకుహరగర్భ(వినిద్ర)సముత్థితంబునౌ
[1]పాండుమదేభవైరి చొరఁబారెడు నంబరకాననస్థలిన్. ౧౬౫

వ అనవుడుసుగ్రీవుండు దశగ్రీవుతమ్మునింజూడుచూడుమని యిట్లనియె.

మ. హరిదిక్చంద్రతమాలపత్రము మనోజాధీశ్వరచ్ఛత్ర మం
బరలక్ష్మీమృదుదంతపత్రము (ర)తిప్రత్యగ్రదోఃకేళికా
నిరతశ్వేతసహస్రపత్రము జగన్నేత్రంబు ధాత్రీప్రియా
సరసస్ఫాటికసీధుపాత్రమునునై జాబిల్లి శోభిల్లెడున్. ౧౬౭

వ. అని మరియునుం జూచి. ౧౬౮

*చ. తరణివియోగతప్తయు సితద్యుతిగల్గయునైన [2]యంబరేం
దిరమె[యి] తా[ం]తపద్మముఖదీధితియై నిశ తారకామనో
హరమిహికాపయఃకణ(చ)యంబులు చల్లుచు తోన వాసనం
బొరయఁగఁ [3]బూయుచున్నయది పొందుగ వెన్నెలపేరి గంధమున్.

1. పాండురరేఖవైరి. 2 యంబరంద్దిరమె 3 బూను.
*మూలమున నిది శ్రీరామచంద్రోక్తము

వ. అనిన రామచంద్రుండు వెండియుం జూచి తనలోన. ౧౩౦

ఆ వె. ఇందుఁ డిందు[ఁ డ]నుచు నే(ల) కన్గొన పయో
బిందుమాత్ర మితని పెంపుగాన
రాముఁ డీమృగాక్షి కోమలతరకపో
లాననంబు వెదకఁబూను నెపుడు. ౧౩౧

వ మరియును సీతం గనుంగొని. ౧౩౨

శా లావణ్యాంబుధియైన నీ వదనలీలా[1]లేశముల్ దుగ్ధపా
రావారోర్మితుషార మెల్లెరుఁగుఁ దారాభర్త దాఁ గావునన్
దేవీ చూపుఁదెరల్ నిగుడ్పు మమతం దీపింపనీ కొంతనే
పావిర్భూతవికాసనీలవనజవ్యాపారహంసాకృతిన్. ౧౩౩

వ. అనిన సీత లజ్జావనతవదనయై తోన తలయెత్తి చూచి హర్షంబున
నిట్లనియె. ౧౩౪

గీ. కమలముల తూఁగుమందు లోకములవిందు
మానినీమానమత్తసామజగజా(రి)
తామసీముఖచంద్రచందనము చంద్రుఁ
డింద్రపథమున చంద్రికాసాంద్రుఁ డయ్యె. ౧౩౫

వ. అనిన రామచంద్రుండు సుగ్రీవునిఁ జూచి చూచితే యని యిట్లనియె.

చ. గురురజనీకుచాగ్రనవకుంకుమచర్చ వియత్పయోధి(జా)
సురుచిరచామరంబు [2]శివుజూటజటాలతికానికుంజమం
జరి మదనాధిపస్ఫటికసౌధము తొల్కడలేమ నాసికా
భరణము చందమామ యొక భవ్యరుచిన్ జగమొప్పఁ గప్పెడున్.

క. నావిని సుగ్రీవుం డో
భూవల్లభ చంద్రు కలిమి పునరుక్తమనం

1. వేశమున్. 2. శశి

గా విని యది యెట్లనవుఁడు
భావింపఁగఁ దోఁత్తనాఁడె ప్రస్ఫుట మగుచుఙ. ౧౩౮

ఉ. చందనకుందనందిహరిచందనబృందముకంటె దేవక
ర్మందిశరేందుకైతకపరంపరకంటె వధూదృగంతసం
క్రందనదంతిదంతకులకంబునకంటె నదభ్రశుభ్రతఙ
జెందెడు నీ యశోమహిమచే శుచియయ్యె ధరిత్రి యెంతయుఙ. ౧౩౯

వ. అనిన రామచంద్రుం డీ తుచ్ఛప్రాయజల్పితంబులచేత చాలుంజాలు ననిన విభీషణుండు (దే)వా ; సుగ్రీవుండు త్రిభువనంబులు శుచియయ్యె ననక భూభవనం బొక్కటి శుచియయ్యె ననుటే తుచ్ఛప్రాయంబయగు నది యెట్లంటేని. ౧౪౦

క. అలఘుకుచచుంబితుంబీ
ఫల[1]విలసద్వీణపైఁ గపర్దిశిరముపై
నెలమంచు మించు నీ కీ
ర్తులు దివిజాంగనలు పాడుదురు సతతంబున్. ౧౪౧

క. నావుడు రాఘవుఁ డను లం
కావల్లభ నీవునుఙ బ్రకాశముగా సు
గ్రీవుని మతంబ తాల్చితి
వీవేళ నటంచు (న)గుచు నినసుతుతోడఙ. ౧౪౨

స్రగ్ధర
ప్రారంభోద్రిక్తనక్తంప్రమదదశముఖోద్బాహునిర్వ్యాహ[హేలా]
తారాద్రిఙ సప్తలోకీదమమదనజయోదారశంఖంబు కాంతా
తారాంచద్గండపాళీధవళిమసరిదుద్దామఫేనంబు గంటే
తారామార్గప్రవేశోద్యతు[ని విర]హిణీదత్తశంకుఙ శశాంకుఙ. ౧౪౩

వ. అని పొందుపడం జూచి డెందంబున. ౧౪౪

---

1. విలసద్విపములపై. 2 రక్షున్. 8 నిర్వ్యోవ

ఉ భూజను లత్రినేత్రమున (బు)ట్టె సుధాకరుఁ డంచు నెంచుట
ల్పాజము భ్రాంతి[యద్ది] నిఖిలస్తుతకాంతినిశాంత మీతఁ డీ
యోజ రతిప్రవాళతరుణోష్ఠసుధారసపూరసిక్తమౌ
నా జలజాతసాయకుని యక్షి జనించినవాఁడు చూడఁగన్. ౧౮౫

వ అనిన రామానుజాతుండు సీతం గని కంపెకంపె యని యిట్లనియె. ౧౮౬

క. కుముదాదుల కానందము
సమకొల్పుచు వీఁక నాకసము దాఁటెడు నీ
కమలారాతి యకూపా
రము పవనాత్మజుఁడువోలె రంహస్ఫూర్తిన్ ౧౮౭

సీ. అనుడు సౌమిత్రి కిట్లనియె (సర్వం)సహా
తన[య యా]రఘువంశతాపశమన
చందనంబగు వాయునందనుం డెట పోయె
నన నాతఁ డను రాముఁ డా యయోధ్య
కనిపె చుట్టల మోదమునఁ దేల్ప నావు డీ
యాలస్య [1][మింకేటి] కనిన రామ
సౌమిత్రు లదె పూర్వశైలరాగము ప్రక
టించుకై వడి[నరుదెంచె]తరణి

గీ. యనుచు లంకాధిపతిఁ జూడ నతఁ డపేగి
మగుడ నేతెంచి యేతద్విమానరాజ
మో రఘూద్వహ! పుష్పకం బుత్సహించి
యెక్కు డనవుడు నందరు నెక్కి రందు. ౧౮౮

వ. రామచంద్రుం డామోదంబున నీ విమానరత్నంబు త్రిభువనైకవీరుండగు
కుబేరానుజుండు కుబేరుం గ్రొచ్చి తెచ్చినదిగదా యనిన లక్ష్మణుండు
కోపోద్దీపితుండునుం బోలె దేవా కిష్కింధామా[హి]ష్మతీపతు లతని
భూరివీరలక్ష్మి విభజించి [పంచి]కొనియుండ వెండియుం బొగడు

1 మేటి.

వడుట యెట్లు తెగడువడక యనిన నగుచు జగతీపతి యది యట్టిద
యగు నెట్లంటేని. ౧౮౯

గీ తాదృగాభీలభుజపీడితంబులయ్యు
జ(డి)య కెవ్వాని కీర్తిఘోషణముఁ జేయు
వార్ధు లేడింటి యొల రావణు గళంబు
లా కపిస్వామిఁ గొనియాడ నలవి య(గునె) ౧౯౦

మ. తన రోషారుణనేత్రదీపికలచేతం జీఁకటుల్ వాయ నె
వ్వని కారాగృహగహ్వరాంతరమునఁ వర్తించుఁ బంచద్వయా
ననుఁ డా హైహయు దీప్తి (సప్త)హయు నానాశత్రుధాత్రీధవేం
ధనవైశ్వానరు విశ్వతోముఖయశుఁ వర్ణింపఁగా శక్యమే. ౧౯౧

ఉ వా(ర)ని ధైర్యవృత్తిఁ గ(రవా)లనికృత్తశిరస్కుఁడైన యే
వీరు గళాల(వాల)మున వే మకుటేందువుఁ బిండి[త]తుప్రధా
సారము నింపుచుఁ [1]దనదు చంద్రధరత్వము నిచ్చమెచ్చ గౌ
రీరమణీశుఁ డా రణగరిష్ఠు దశాస్యు నుతింపఁ బోలదే. ౧౯౨

వ. అని మరియును ౧౯౩

క. కంఠేకాలసపర్యో
త్కంఠుండు త్రికూటశిఖరిగహ్వరవిహర
త్కంఠీరవంబునగు దశ
కంఠు నకుంఠితవిహారగతు లద్భుతముల్. ౧౯౪

మ. పలభుగ్భర్త భవాద్రి యెత్తుతరిఁ దద్భూరావతారోన్నమ
ద్బిలశాయింద్రఫణావళీమణివిభాబృందం బకాలోదితో
త్పలశత్రుం బొడమింపఁ గెంపు గనియెఁ దట్టంబుగా నాల్గు ది
క్కులు గిక్కన్ హరు మూడు దృక్కులు[ను నా]కుల్ ప్రుక్క నొక్కుమ్మడిన్.
*వ. అని ప్ర(వే)శించి[న]. ౧౯౫

1 తనరు *ఈ వచనము మూలములో లేదు.

క. ఈ రథ మాకృతిఁ గన్న మ
నోరథమన దనరెడుఁ‌ మనోరంజకమై
ఆరోహాలీల మన మతి
దూరము వచ్చినను శ్రమము దోఁపక యున్కిన్. ౧౯౭

వ. [1]అను లక్ష్మణు నీ(క్షించి య)ది నిజంబయగు నిప్పుడు. ౧౯౮

ఆ. వె. అబ్ధి దాఁటి దండకాటవి గడచి మే
ఖలకళిందకన్యకలఁ దరించి
యేగుదెంచినార మిదె కేకికులకేళి
కూటమైన చిత్రకూటమునకు. ౧౯౯

ఆ. వె. అనవు దపుడు తిర్యగాలోకయై సీత
యో కళిందజాత నీ కుటుంబ
మైన మాకు మగుడ నీ నవ్యదర్శనం
బొసఁగితమ్మ కరుణరసము మీర. ౨౦౦

క. అనుటయు రఘునందనుఁ డో
వనితా యిది నిర్విరోధవర్తనములమై
మను క్రూరసత్వయుతమగు
ననఘభరద్వాజమునివరాశ్రమము సుమీ ౨౦౧

వ. అనిన సుమిత్రాపుత్రుం డిది యట్టిదయగు నిందు. ౨౦౨

గీ. చండతరవక్త్రసింహకేసరము లొడియుఁ
గొన్ని చెలరేఁగి యొకకొన్ని గ్రోలు సింహ
శాబకములాను సింహికాస్తన్యరసము
కొన్ని తద్గహ్వరంబులఁ గూర్కుఁ గరులు. ౨౦౩

---

1. అని లక్ష్మణుం డీ(క్షించి). ఈ విధముగా నున్నచో అన్వయము కుదురుట లేదు దీని తరువాత భాగము శ్రీరామచంద్రోక్తముగా సంస్కృతమున నుండుటచే పై సవరణ చేయనైనది.

చ. మలయుచు నాటమై వటుసమాజము ద్రొక్కిన నిద్ర దేరు పె
బ్బులి [మృగి] చేరి తన్నఖరపుంజమునన్ నవదీరఁ దీఁడెడున్
గళము శిఖండితుండమృదుఖండితకంచుకమై సుఖించు కుం
డలి బుసగొట్టుఁ దెమ్మెరలు డగ్గరి క్రోలెడు ముంగి రంగునన్. ౨౦౪

క. అనునెడ రఘునందనుఁ డి
ట్లనియెన్ బ్రమదమున నిదె రథాంగవధూమో
దనిదాన మఖిలజనహృ
ద్వ(న)మహరంజనము వేగుఁదరి యరుదెంచెన్. ౨౦౫

మ విలసత్కేతకధూళిధూసర[1]రుచుల్ వేలాపరాంభోనిధిన్
గలయం బారె జరాయురాంతరితనక్షత్రాధిరాడ్దీధితుల్
తిలకించెన్ వికచత్సరోరుహవనీదృక్పాతసంభావితో
జ్జ్వలతారుణ్యతరణ్యభీషువులు పూర్వక్ష్మాధరాగ్రక్షితిన్. ౨౦౬

వ. అనిన లక్ష్మణుండు సకౌతుకంబుగా నిట్లనియె ౨౦౭

ఉ. అరుదారం ఘటమానకోకమిథునవ్యాజంబునన్ బీవర
స్థిరవక్షోజవివిక్తయౌవనలుఁగా దిక్కన్యలన్ జేసి ని
ర్భరదుర్దైవలిపింబలెన్ మధుకరీపంక్తిన్ వెసన్ [2]బాపి పు
ష్కరిణీలోకమునందు నిల్పెడె రమన్ గంజాప్తుఁ డాప్తక్రియన్.

వ. అనిన సుగ్రీవుండు విభీషణుం జూడుమని యిట్లనియె. ౨౦౯

మ నివుడె న్నింగి నిశానిశాచరవధూనిర్మాథసంనాంత్రిక
ల్దివ[3]సాంతాగతసుప్తపంకజవనాళీబోధ[4]వైతాళికుల్
సవికాసాంబుజకోరకోదరకుటీసంభూతభృంగాంగనా
రవ[రా]గప్ర(ణ)వోపదేశగురువుల్ రాజీవమిత్రాంశువుల్. ౨౧౦

వ. అనిన విభీషణుండు. ౨౧౧

1. రజో. 2. బాచి. 3 గంతా. 4 వైతానికుల్.

చ. పనివడి వచ్చు నీ దివసపద్మపదాహతిఁబోలె నాకసం
బను నవతామ్రపల్లవకుజాగ్రణికిఁ గళికాగుళుచ్ఛమై
తనరి [1]దిశాంగనాశ్రుతివతంసవిలాసముఁ జేయుచున్ వినూ
తనదిననాథదీధితికదంబము తద్దయుఁ దేజరిల్లెడున్. ౨౧౨

వ. అనునెడ రఘునందనుం డవనీనందన కిట్లనియె. ౨౧౩

శా. ఇంతీ చూచితె చక్రవాకరమణీహృన్మోదసంధాయులై
ధ్వాంతాగాధపయోధిమగ్నజగతీ[2]దత్తావలంబంబులై
కాంతిన్ శ్రీకరముల్ పయోజినికినై కంజాప్తుదీప్తుల్ దిశా
కాంతాకుంకుమతోయసేచనవిధాకారంబులై యొప్పెడున్. ౨౧౪

వ అని మరియును జనకాంతుండు తన కాంత కేకాంతంబుగా నిట్లనియె.

మ. విరియం జేసె పయోజినీ ముకుళనీ[వీబంధమున్ రక్తుఁడై]
(కర)లీలన్ రవి యెప్పు డప్పుడ సముద్గచ్ఛన్మదాయత్తష
ట్చరణాళిచ్ఛలనన్ వెలుంగెడు తదంచన్మేఖలామధ్యక
ర్బురమాణిక్యమయూఖరేఖ వికచాంభోజాక్షి! వీక్షించితే. ౨౧౫

వ. అని యమరపురతరంగిణిం గని ప్రకాశంబుగా వికసితవదనయగు
భూసుతతో రాసుతుం డిట్లనియె. ౨౧౬

గీ. హారనీరప్రభాహారహీరహేల
బహువిహారోల్లసజ్జాలపాదజాల
ప్రకటకల్యాణకారిణి నికటసీమ
మున వెలుంగెడు నిదె గంగఘనతరంగ. ౨౧౭

క. నా విని యానందంబున
నా వనితాజనలలామ మదియ పరించెన్
భూవరుఁ డపుడు సుమిత్రా
దేవిసుతుం జూచి చూచితేయని పల్కెన్. ౨౧౮

1. దిశాంశుని 2. దంతావళాలంబులై

గీ. రఘుమహీశా(న్వయ)శుభాంకురప్రరోహ
ధరణి యిదె చేర్వ సరయువు తద్విలోల
వీచికాజాల[1]సంభూతవిపులశీక
రార్ద్రపరిసర మదె యయోధ్యాపురంబు. ౨౨౦

వ. అను సమయంబునం దత్పురవరసౌభాగ్యశ్రవణప్రవణులగు సుగ్రీవ
వైశ్రవణులం జూచి సౌమిత్రి యిట్లని వర్ణింపం దొడంగె ౨౨౧

*చ. అరిగజరాజి స్వప్నములయందు తనుంగని మేని వీడ భీ
కరపరిసింహనాదముల క్రందున కుబ్బుచునున్న తత్క్షమా
ధరశిఖరాగ్రభాగముల దాటుచు నప్పురి కోట యొప్పు ని
ర్భరతరవిక్రమ[క్రమ]ధురంధరతన్ మృగరాజు కైవడిన్ ౨౨౨

క. అల పురి [2]సకలాట్టాలక
ముల మెలఁగెడు పౌరవారమున కనయంబున్
[3]జలజోద్భవశుద్ధాంతం
[4]బులు గనరా నతఁడు లేమఁ బుక్కిటఁ దాల్చున్. ౨౨౩

గీ మీఁది లోకంబు లేడును మీరియున్న
కోట వెట్టఁగనైన యిప్వీటి పరిఘ
సప్తపాతాళములు దూరి చన్న [5]దనుట
పోలు మరివేర చెప్పఁగ నేల దాని. ౨౨౪

ఉ. హారిపురీసరోజనిలయన్ జెలఁగింపఁగ సాలశిల్పి క
ర్పూరపు మందుచే మిడుగురుంబువు బంతులు రాలఁ బన్నె నౌ
రౌర వినోదయంత్రనిచయంబున దూరెడు తారకాళి చెం
దొరపు గుంటి[కో]వుల గుదుల్ గనఁ గ్రొత్తగు కొత్తలంబులన్. ౨౨౫

---

*ఈ ౨౨౨ పద్యమునుండి ౨౪౩ వరకు గల గద్యపద్యము లమూలకములు.

1. సంఘాత. 2. సలాట్టాలాక. 3 జలజోద్భవంశురుథాంతం. 4 బుల. ౫. దనుచు

క. [1]నిట్టలుగ బవరి క(ట్టు)గ
గట్టిన గోపురము లమరు కనుపండువులై
నెట్టన విష్ణుపదంబున
గట్టిన నవరత్నఖచితఘంటిక లనఁగన్. ౨౨౬

ఆ. వె. వివిధరత్నరుచులు దివిఁ జల్ల నప్పురి
మేడ లొరసి [2]సతులఁ జూడఁ జనుచు
బూ(ను) నెన్ని వన్నెలైన రాజది యేల
మాను యువతిసన్నిధాన వికృతి. ౨౨౭

చ. మొలచు వెలంది మించు వరిముత్తెపుఁ గుచ్చుల జీబు పయ్యెదల్
వలభులఁ జిక్కి దిగ్గన మలంగ ధళారను గుబ్బచంటి రం
గులు మణిహర్మ్యపంక్తులకుఁ గుందనముల్ ఘటియింప లీలమై
మెలఁగుదు రప్పురో(ప)రినిమేషవిదూరమదాశి[కుం]తలల్. ౨౨౮

క శాలలపై [3]వెలిపడగల
చాలుబడిఁగా జుక్కవీథి జలదపథమునఁగా
బాలేరు వారఁ గట్టిన
యాలేరనఁ దనరు లోచనానందంబై. ౨౨౯

మ. అకటా యిందు వసించు దంపతుల కేకాంతంబు లెట్లబ్బునో
[4]ప్రకటశ్రీనృపు లెట్లు నీసదనముల్ పాటింతురో రోహిణీ
శకటాదుల్ చను బండిత్రోవ లివిగో సౌధోపరిద్వారమా
లికలం చాడు జనంబు రాత్రుల పురాళిందక్షితిం బోవుచుఁగా. ౨౩౦

క. నరిపంక్తులు ముయ్యాడుఁగా (?)
బురి నమరు[న్] జదలనుండి పొరిఁబొరి ధరణీ
ధరములఁ గ్రీడింపం దిగు
శరదములకుఁ దావు లగుచు జన[విశద]ములై. ౨౩౧

1. నిట్టలుగ 2. సతులు 3. వెలవడిగెల. 4. ప్రకటశ్రీనృపలెట్ల.

క. రొప్పవలెఁ [1]బతికి ద్రిప్పట
చొప్పడుటం దలఁప గంపసుళ్ళవి సరిగా
వప్పద్మహితాశ్వములని
యప్పురి తురగములు దెగడు ననవరతంబున్. ౨౩౨

క. శూలి పురత్రయి [పై]జను
వేళన్ దేరైన నేల వెలఁదికి తల్లిన్
బోలి జనించిన బిడ్డల
పోలికి నరదంబు లమరు బు(రి)విశదములై. ౨౩౩

క నట[2]దరి సేనాగణికా
విటులు యశోధవళితాభ్రవిపులాష్టదిశా
[3]తటులు రణక్రీడాలం
పటు లప్పుటభేదనంబు భటులు దలంపన్. ౨౩౪

క ఘనసాలగ్రామశిలా
ఖని యప్పురి విప్ర(వా)టి కాపుర మందుం
డినవార లే[మి] మహిమం
బున జూడ హిరణ్యగర్భమూర్తులె యగుటన్ ౨౩౫

సీ. కూడ రన్యవధూటిఁ గూడ రన్యాయవ
ర్తనుల నప్పురిలోని రాచవారు
వీడ రాశ్రితకోటి నూడ రెన్నడు సంగ
రముల నప్పురిలోని రాచవారు
పాడ రాత్మస్తుతి నాడ రసత్యంబు
లేచి యప్పురిలోని రాచవారు
వాడరు పరధనం బోడ రీవులయెడ
రమణి నప్పురిలోని రాచవారు

1 బ్రతికి 2. దరిశనాన్. 3 తటుల.

గీ. రాజితానూనకాంతికి రాచవారు
ప్రస్ఫుటప్రభఁ బగలింటి రాచవారు
రమ్యతరమూర్తి వలపుల రాచవారు
రసికులైనట్టి యప్పురి రాచవారు. ౨౩౬

క [1]పినుఁగుం గోమటు లప్పుర
మున గొలుతురు నాఁగు లేక పుట్టులకొలదిన్
గనుమాసిన మాడలు నూ
తన మయ్యెడుకొరకుఁ బ్రాఁత తవిఁదెలువోలెన్. ౨౩౭

గీ. గ్రహములకువోలె రాసులు గదియు ధర్మ
మెలమి చుక్కల కెల్లను గలుగఁజేయు
నప్పురంబున గాపు మిన్నంటఁ బంట
గొలుచు ముక్కారు నందు రాసులుగ జేసి ౨౩౮

సీ చిమ్మచీఁకటి మీఁదఁ గ్రమ్మ లేఁజందురుఁ
డదటుమీరఁగఁ జాప మందెనౌర
జలజమంతయును గల్వలె యాక్రమింప సం
దున జంపకం బుస్సు రనఁగవలదె
కురువిందరుచుల మార్కొను బింబమునకు బా
పటయయ్యెఁ జెంగట వటఫలంబు
నగ్రస్థపూగంబు నల్లక [2]లత బిరు
ద్రేవల డిగఁబారె [రీవి]నేలొ
గీ. గగన మిల వ్రాలఁ గదలికా[3]కలమగర్వ
కంజములు దొంతరై యంత గడగవశమె
యనుచు నప్పురి జవరాండ్ర యంగకముల
నెలమి వీక్షించి యూహింతు రెల్లవారు. ౨౩౯

గీ. వెలయ నవ్వీటి పుష్పలావికలు వలపు
లొలయ నమ్మెదు మంచి పువ్వులు గొనంగ

1. బినుంగుం 2. లతలుల 3 కమల

వచ్చి యదియేమి చిత్రమో వారిచేత
కోరి మరు లుమ్మెతలు గొంద్రు కోడెకాండ్రు. ౨౪౦

క. తగు గొమ్మ బలిమియును బలు
వగు గాపును గలిగి తారు నావరుణములై (?)
పొగడొందు నప్పురాంగణ
జగతిన్ గేళీవనములు జనజీవనముల్. ౨౪౧

వ. మరియు నప్పురవరేణ్యంబు తరణికరనికరసంసర్గంబునం బెరుంగు నిరు[ప]మానసద్మపద్మరాగప్రభాభంగతరంగిణీసంఘంబుల పొత్తువలనం జటులత[ర]రౌద్రరససముద్రంబయ్యును, శుద్ధాంతమదనయుద్ధాంత [1]తాంతకాంతాకపోలకస్తూరికాకలితస్వేదామోదవహాగంధవహా మండలోద్దండమండలప్రచారంబుల[వల]నం బరిమళకరండంబయ్యును, చంచత్ప్రాసాదసంచరదకించనోదరీకుచకంచుళికాచయంబుల యంచులం జూపట్టు పట్టుం గుట్టుపనుల చం[దం]బులకు డెందంబులు జిట్టనం గరంగ వాసంబునంగయి సేత బెడంగులయెడ(ం బొ)డముచొకం బొకనిచ్చలుం దవిలిరచ్చలు సేయు నచ్చరమచ్చకంటులవలనంగొమరారి యమరాలయంబయ్యును, నిజప్రభావాధరితచైత్రరథనందనామందిరారామరామసందోహనిష్యందమానమరందధారాప్రవాహయ[ ]ంబులందవిలిదిబ్బులంబేరునంతఃపురబింబాధరాసంబాధసంఘృష్టాష్టాపదభూషణరజఃపుంజంబులవలన జంబూధునీసవిధంబయ్యును, నగణ్యమణ్యభిరామపణ్యవీథికాసీనపణ్యవధూవిధూపమానముఖసఖమణిదర్పణగణాంతర్బింబితచుంబితతద్రూపరేఖావిలాసవిభవంబులు రత్నపరీక్షామిషంబున రెప్ప లిడక తప్పక చూచి లోచవులం జొక్కు [2]సిగ్గరి మగల గుట్టు లట్టె బయలంబడనొడళ్ళం బొడకట్టు పొగరు గరుతాల్పులు గనుంగొని గెడలం గిలకిలనగు చిలుకలకొలుకుల పలుకులం జిలుక రొదలవలన నమందకందర్పమాందురక్షోణియయ్యును, నిష్ఠాపరిగరిష్ఠప్రతిష్ఠితఘ[ం]టాపథామర

1. తత్తా. 2. సిగ్గరరి

మంటపోపరిస్థానవితాన[విస్తా]రితనానావిధానల్పశిల్పికల్పితప్రవాళజాల కళికానీకలతాంతసంతాన (శలా) టుకోటిఫలార్బుదన్యర్బుదంబులవలనం జిరంతనవసంతసమయంబయ్యును, నృపగృహద్వారసోపానగోపానసీ విహారమాణమదకలకలరవమిథునమధురమణితస్వనంబులకుం జొక్కు చుం జక్కనం జరణమంజీరశింజితంబు లెసంగ(నే)లందడకట్టుమెట్టులుం బోని మానికపు మేడ లెక్కి తోడి చెలులచే నిచ్చలకు మెచ్చులగు పచ్చ లును, చెవుల గ్రొత్త ముత్తియంబులుం గలయం గులికి యక్కలికి పులుగులకు బులుగంబు వెట్టింపుచు విప్పు లగల కప్పురామోగవరుల మరువులం జెలంగి మెలంగుచుం జూచు (రా)చకొమిరెల మేనుం దీగె మెరుపుల వలనం దళుకారు తొలుకారయ్యును, నందత్క్రీడారవిందాకర మందాందోళనవీచీనిచయడోలావిహారఖేలనాలోలజాలపాదమదవతీసద మలక్రేంకారసంకులతం జిక్క(ప)డక యంకురించి రొమధూమాంకు రంబునం బంకించి కింకుర్వాణమానసులై మను తలంపులు సుంకించి చెందొవలం బడ నుంకించి వలదనుటయు జంకింపుచుం దెరలి యొరలు ప్రోషితభర్తృకలకుం బరితాపం బెడలం గెడలం బన్నిన తుహినభర్తృ కాసముఖా[యి]త బహుళమిహికాజలతుంతుర్పసంపాతంబులవ[ల]న నితాంతహేమంతసమయం బయ్యునుం జూపట్టు ననుటయు నవ్విభీష ణుండు హర్షంబున నిట్లనియె. ౨౪౨

ఆ. వె. మధుర సాటిగాదు మాయయుఁ బ్రతిగాదు
కాశి జోడుగాదు కంచి యీడు
గాదు ద్వారకయును గా దెన యుజ్జని
యును సమంబుగా దయోధ్యతోడ ౨౪౩

క. అన నూర్మిళావిభుం డి
ట్లను వాఁడె యరుంధతీశుఁ డామోదమునం
దను భరతుఁడు సేవింపఁగ
నిను బట్టము గట్టు కోర్కి నెగడెడు బుద్ధిన్. ౨౪౪

క. సకలాశానందకరుఁ
బ్రకటదిలీపాన్వవాయరత్నము నిన్నుఁ
వికసన్నవరవిఁగూరిచి
సుకృతికృతస్తోత్ర యెదురుచూడం దొడఁగెఁ. ౨౪౫

వ కావునం బుష్పకావతరణం బొనర్పవలయునన రామచంద్రుండు లక్ష్మణుం [జూచి వీ]క్షింపు [1]మింతకు సులభసకలమంగళాలోకనంబును నాఖండలాశామండనంబును నగు చండకిరణునకు నమస్కరింపవలయు నని యంజలి ఘటించి ౨౪౬

క విలసత్ప్రాచీకుంకుమ
తిలకముఁ దైత్రిలోక్యభవనదీపముఁ బూర్వా
చలరోహణైకరత్నము
నలినీపతిఁగూర్చి వందనం బొనరింతుఁ. ౨౪౭

వ అనునెడ నేపథ్యంబున నో వత్సా రామభద్ర ! యనిన రామభద్రుండు

క. [చాలఁ] జోద్యము తమ్ములఁ
బోలెన్ మన మానసముల మొగి వికసనమున్
గీలింపుచుఁ బ్రభకై వడి
హేళివలన నొక్క [2]వాణి యెసఁగెం గంటే. ౨౪౮

వ. అన మరియుం దెర మరుంగున ౨౫౦

ఉ. తోరపుఁ గీర్తిపూరములు దూరమునం బ్రవహింపఁజేయు [మి]ం
పార సహస్రసంఖ్యలగు నబ్ద[ము లు]ండు మతిద్యుతిన్ మహో
దారభ[వ]ద్గు[ణ]స్తుతిసుధఁ భువనంబుల నేదదేర్చు మో
కైరవలోచనానయనకైరవకైరవిణీమనోహరా ౨౫౧

గీ. అన రఘూద్వహుఁ డలరి మహాప్రసాద
మనుడు వెండియుఁ దెరలోన నభిమతంబు

1 మంతక. 2. వాసి.

నేమియని పల్కు రవికి న(య్యి)నజుఁ డనియె
జనక! దినకర! యీ రామజనవిభుండు. ౨౫౨

వ పరిపూర్ణమనోరథుం డది యెట్లం టేని. ౨౫౩

ఉ. కాంచె మహోన్నతిన్ గుణనికాయముచే తమ తండ్రి యాజ్ఞ పా
టించె నిశాటమర్కటపటిష్ఠుల నిద్దర నేలి రాజ్య మే
లించె యశంబు మించెఁ దృణలీల దశాస్యు[ని] జంపి ప్రీతిఁ గా
వించె సుహృజ్జనంబులకు వే నిజదర్శనవైభవంబునన్. ౨౫౪

వ. ఐన నిట్లగుఁగాకయని భరతవాక్యంబుగా నిట్లనియె. ౨౫౫

మ. ఎలప్రాయంబుననుండియున్ గలుగనీ కృష్ణాద్రిశర్వానని
శ్చల సారస్వతసిద్ధు లీ జనుల కీ సర్వజ్ఞసద్మంబులం
బిలశాయీంద్రఫణంబులన్ జగతి పూన్కిన్ వాణితోఁ గూడఁ దాఁ
జెలికారం బొనరించి నెట్టుకొననీ శ్రీలక్ష్మి సాక్షాత్కృతిన్. ౨౫౬

క. అనవుడు రఘునాయకుఁ డను
మన మిఁక పుష్పకము డిగ్గి మానుగ గురుబం
ధునగరజనములఁ బ్రమద
మ్మున దేలుత మనుచుఁ జనిరి [1]పురిలోపలికిన్ ౨౫౭

* * *

క నందేలతిమ్మరాజపు
రందరచిహ్నప్రసన్నరాఘవనాట్యా
మందప్రబంధరాజము
నం దేడగు నంకమయ్యె నార్యస్తుతమై. ౨౫౮

★

1 పురిలోనికిని

# శ్రీ సిద్ధేశ్వర చరిత్రము

కాసె సర్వప్పప్రణీతము

సంపాదకుడు

ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం ఏ

ఆంధ్రశాఖాధ్యక్షుడు, ఉస్మానియా విశ్వవిద్యాలయము

చిరకాలముగా ఆంధ్రపాఠకలోకము ఎదురుచూచుచున్న అమూల్య గ్రంథము ఆంధ్రరచయితల సంఘమువారి కృషిచే వెలుగులోనికి వచ్చిన చారిత్రక కావ్యము. కలకాలము ఇంకిపోవని జీవ తటాకములచేతను, మాసిపోవని దివ్యశిల్పముచేతను, మరపురాని వాఙ్మయముచేతను ఆంధ్రజాతిని—అథవా భారతజాతిని—కృతజ్ఞతాబద్ధముచేసిన మహారాజన్యులైన కాకతీయుల చరిత్రకు ఆధార గ్రంథము సిద్ధేశ్వర చరిత్రము గౌతమీపుత్ర శాతకర్ణి, రాజరాజ నరేంద్రుడు, శ్రీకృష్ణదేవరాయలవంటి జాతిపితలైన రాజుల సరిపంక్తి వాడగు ప్రతాపరుద్ర చక్రవర్తి చరిత్ర ఇందు సవిస్తరముగ చిత్రింపబడినది నవలక్షధనుర్ధరుల కధినాథులైన కాకతీయుల మహానగరము ఓరుగల్లు వైభవోపేతవర్ణన మిందు చదువుడు. కాకతీయ చరిత్ర నామూలాగ్రముగ పునర్వీక్షణము చేయుచు సంపాదకులు వ్రాసిన విపుల పీఠికతో నొప్పారుచున్నది వీరకరుణరసముల కాటపట్టైన ఆంధ్రుల చరిత్రలోని ఒక యుజ్జ్వలాధ్యాయము కాకతీయుల చరిత్ర—శ్రీ సిద్ధేశ్వర చరిత్రము.

వెల 6 రూపాయలు | అజంతా ముద్రణము

★

# కవిశిరోభూషణము

సంపాదకవర్గము :

ఖండవల్లి లక్ష్మీరంజనం అమరేశం రాజేశ్వరశర్మ
చెలమచర్ల రంగాచార్యులు యన్.సి యస్. వేంకటాచార్యులు

అహోబల పండితీయమను నామాంతరముగల మహావ్యాకరణ గ్రంథము ఆంధ్రశబ్ద చింతామణిమీద అహోబలపండితుడు వ్రాసిన గొప్ప సంస్కృతవ్యాఖ్యానము. ఆంధ్ర రచయితల సంఘమువారి కృషిచే నూతనరూపము ధరించి త్వరలోనే విద్వాంసుల కరకమలముల నలంకరింపబోవుచున్నది. ఆంధ్రశబ్ద చింతామణి సూత్రములకు అహోబలుడు వ్రాసిన వ్యాఖ్యానము ఆంధ్రులు గర్వింపదగినది; ఆంధ్రేతరులు హర్షించి తలలూచదగినది. కళాశాలలందును పాఠశాలలందును తెనుగు బోధించు ప్రతియుపాధ్యాయుడును తప్పక పఠించి మననము చేయవలసిన గ్రంథరాజము సూత్రములకును సంస్కృత వ్యాఖ్యానమునకును వివరణాత్మకమైన ఆంధ్రానువాదముతో నొప్పుచున్నది. అహోబలపండితుడు అడుగడుగునకు ప్రసక్తముచేయు ఉద్ధారములకు మూలగ్రంథ ప్రసంగము యథాసాధ్యముగ చూపబడినది. అహోబల పండితీయమనగా పాండిత్యసాగరము. అందు సంస్కృత ప్రాకృతాంధ్ర వ్యాకరణములు, అలంకారశాస్త్ర చర్చలు, ఒకచో మీమాంసాప్రసంగములు, ఆంధ్రవ్యాకరణము ఉపాదేయమా అను చర్చ, నిఘంటువుల యాతాయాతములు—అదొక దుర్గమార్థజల గౌరవ భారతీసముద్రము. అయినను ఆంధ్రానువాద వివరణములచే సులభముగా కడముట్టసీదదగినది.

*విపులశబ్దశాస్త్రము. త్వరలోనే వెలువడనున్నది.*